ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

# భాగవతకథ

## 46వ భాగము

గ్రంధకర్త - శ్రీ ప్రభుదత్త బ్రహ్మాచారి

అనువాదం - శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య

శ్రీ రామ

భాగవతకథ



46 వ భాగము

# మథురాగమనము

శ్లో॥ వ్యాసశాస్త్రోప వనతః సుమనాంసి విచిన్వతా,
కృతా వై ప్రభుదత్తేన మాలా భాగవతీ కథా॥



గ్రంథకర్త:
శ్రీ ౧౦౮ ప్రభుదత్త బ్రహ్మచారిగారు



అనువాదకుడు :
శ్రీ రామ్‌శరణ్ కుంచుర్తి వేంకట నరసయ్య
- సంపాదకుడు, "మోక్షసాధని"

కాపీరైటు] 1970 [వెల : 6-00

సోల్ డిస్ట్రిబ్యూటర్సు :

నటరాజ పబ్లికేషన్స్
ఏలూరు రోడ్ * విజయవాడ

# మధురా లీల.

# భాగవతకథ

## అంబికావన యాత్ర

౧౦౦౭

శ్లో॥ ఏకదా దేవయాత్రాయాం గోపాలా జాతకౌతుకాః ।
అనోభిరనడుద్యుక్తైః ప్రయయుస్తేఽంబికా వనమ్॥

శ్రీ భాగ. ౧౦. స్కం. ౩౪ అ ౧ శ్లో॥

వ. అంత నొక్కనాఁడు నందాదులైన గోపకులంబికా వనంబునకు శకటంబు లెక్కి జాతరకుం జనిరి"

శ్రీమదాంధ్ర భాగవతము

ఈ ప్రాణి పరివర్తన శీలి. అందువలన నీతఁడు నిత్య నూతన పరివర్తనమును గోరుచుండును. ఒకే పరిస్థితిలో నుండగల వారిద్దరే. పరాధీనమగు పశువును, దేహాభిమాన శూన్యుఁడగు బ్రహ్మజ్ఞానియును, అట్లుగాక ప్రాణి ప్రతి విషయమునందును, ప్రతిదినమును నిత్య నూతనత్వమును గోరును. నిత్య నూతన వస్త్రమును ధరింపఁగోరుచుండును, భోజనవస్తువులును నిత్యమును మారుచుండవలయును. నేఁడు శాకము విసుగు పుట్టినది. పెరుగు పచ్చడినిఁ జేయుమనును. నేఁడు క్షీరాన్నమైన రేపు పూరీలు. తోట అలంకారమును నిత్యనూతనముగ నుండవలయును. ఇంతకు సారాంశమేమనఁగా మానవుడు ప్రతి విషయములోను నూతనత్వమును

గోరుచుండును. నిత్యనూతన జ్ఞానము కలుగవలెను. నిత్య నూతన పరిచయము కావలెను. నిత్యనూతనానుభవము కావలెను. వాస్తవముగ నన్నియును బురాతనములే. క్రొత్తది ఒక్కటియును లేదు. అయినను నూతనత్వములో నుత్సుకతయును, ఆకర్షణమును గలదు.

యాత్రలో నిత్యమును నూతనానుభవములు కలుగుచుండును. క్రొత్తక్రొత్త ప్రదేశములను జూచుట తటస్థించును. క్రొత్తక్రొత్త దృశ్యములు కనబడును. క్రొత్తక్రొత్త జీవజంతువులు సమ్ముఖమునకు వచ్చును. వివిధ జలాశయములందును, వంకరటింకరగఁ బాఱు అనేక నదులలో స్నానము చేయుట సంభవించును. పవిత్రతీర్థములు లభించును. క్రొత్తక్రొత్త వారితోఁ బరిచయముకలుగును. వివిధ సంఘటనములు సంఘటించును. ఒకేపకృతికలవారు వెంటనుండి, చాలమంది ప్రేమించువారుండి, జీవనోపయోగములగు ఆవశ్యకసామగ్రి వెంటనుండివచో యాత్రయందు మిక్కిలి ఆనందము కలుగును. ఆడుచుఁబాడుచు వెంట వచ్చుచుందురు. నడుచుచుండఁగా నలసట వచ్చినచో వృక్షములయొక్క శీతలచాయలందెంతో సుఖముగ నుండును. శ్రమచేసిన మంచి ఆఁకలియును వేయును. ఆఁకలిలో నేది తిన్నను ఆ యన్నము మధురాయమానముగ నుండును. ఎండలోఁ బ్రయాణమొనర్చిన దాహమధికమగును. దప్పికైనపుడెంత నీరు త్రాగినను నది స్వాదిష్టముగను రుచికరముగను నుండును. వృద్ధులను జాగ్రత్తగాఁజూడవలసి యుండును. వారికి నడుచుట కష్టము

గనుండును. బయటకుఁబోవుటకు వారికి సౌకర్యము గ నుండును. కావున వారికి యాత్రవిశేషరుచికరముగ నుండదు. అయినను ధర్మోపార్జనము కొఱకును, కర్తవ్యమనుకొనియు వారును యాత్రను జేయుచునే యుందురు. అందఱికంటే యువకులకు మిక్కిలి ఆనందముగ నుండును. నవ్వులాటలు, పరుగెత్తి గంతులు వేయుటయు, తమతోడి యువతీ యువకులతో రసవత్తరముగ వరుసలాడుచుందురు. యువకుల కంటెను నధికానందము స్త్రీలకు గలుగును. స్త్రీలకు యాత్రావసరము ప్రాప్తించెనా వెంటనే సిద్ధమగుదురు. మూటలు ముల్లెలను, ఆహారపానీయముల కొఱకై యేర్పాట్లు చేసి కొని, కాటుకను. బొట్టును బెట్టుకొని వెంటనే సిద్ధమయ్యె దరు స్త్రీలకంటెను బిల్లలకింకెక్కువ ఆనందము కలుగును. ఏలననఁగా వారికి నిత్య నూతన జ్ఞాన ప్రాప్తినిఁజెందుట కుత్సాహముండును. పిల్లలకు యాత్రావసరము ప్రాప్తించెనా వారి కానందముచే నిద్రరాదు. అందువలననే మనకు ప్రతి మాసమునను జాలపర్వములు వచ్చుచుండును. ఆపర్వము లందు భిన్న భిన్న ప్రాంతముల యాత్రా మాహాత్మ్యము లుండును. అచ్చటికిఁబోయి జనులు ధర్మోపార్జన మొనర్చి మనోవినోద మొనర్చెదరు. కావున మనుష్యుల అన్యసుఖద మనోరంజక ప్రసంగములందు తీర్థ యాత్రలకును గొప్ప స్థానముగలదు.

సూతుఁడిట్లనెను:- "మునులారా! నేను మీకు భగ వానుని కామవిజయ కథను జెప్పితిని మన్మథునకు మహా

దర్పము కలిగినది. తానందఱను బరాజితుల నొనర్పఁగలనను అహంకారమతనికిఁగలదు. విశ్వామిత్ర పరాశరాది మును లను జయించుటచే నాతని అహంకారము పరాకాష్ఠ స్థితికి వచ్చెను దానిని భగవానుఁడు రాసను రచించి నాశముచేసి వేసినాఁడు. మన్మథుఁడోడి తనకుఁ గుమారుఁడయ్యెను. భగవంతుఁడాతని ననుగ్రహించి పుత్రత్వేన స్వీకరించెను. ఆతని దృష్టిలోఁగామ దేవుఁడు విషదృష్టివాఁడు. ఆతఁడు స్త్రీనిగాని, పురుషునిఁగాని చూచిన వారు పడిపోవలసినదే. ఈతని బాణములు విషాక్తములు కావు. పుష్పబాణములు. ఈతఁడు కుసుమాయుధుఁడని పిలువఁ బడుచుండును ఈతని ధనస్సు చెఱకుగడ. తియ్యనిది. కాని పుష్పబాణములు హృద యమునకు తగులఁగానే ఆతఁడు చావను జావఁడు, బ్రతుకను బ్రదుకుఁడు, తటతట కొట్టుకొను చుండును. ఇట్టి ప్రబల పరాక్రమవంతునిగూడ భగవానుఁడు నిమిషములో నవ్వుచునే తనవశము కావించుకొనెను. ఇంక నితరుల మాటను జెప్ప నేల? భగవానుఁడు కేవలము కుసుమాయుధుఁడగు కాముని యందుఁగృపఁ జూపుటయేకాదు. ఇట్టి విషజంతువగు అజగ రునిపై కూడ కృపను జూపినాఁడు. ఆప్రసంగమును నేనిప్పుడు చెప్పెదను.

వ్రజమందు హోళీపండుగ కొన్నినెలలకు ముందుగనే ప్రారంభమగును. హోళికయందు యువకులకే కాదు వృద్ధు లకును నవయౌవనము రాఁగలదు. సర్వత్ర సరసతాప్రవా హము ప్రవహించును. ఇంటింట గులాలు, వసంతములు

నిండిపోవును. హోళీ అయిపోయినతర్వాత సంతర్పణము, యాత్రల నొనర్చెదరు. దేవీపూజ నొనర్చెదరు. ఇప్పుడు గోపకలిట్లనిరి:- "మన మానవరాత్రులలో అంబికా యాత్ర కుఁబోవుదము. అచ్చట ంబికాదేవికిని, అంబికేశ్వరునకును బూజ నొనర్చెదము. సరస్వతీనదిలో స్నానమొనర్చెదము."

శౌనకుఁడిట్లనెను :- "సూతా! సమస్త వ్రజవాసుల యిండ్లలో దేవాధిదేవుఁడును, ఆనందకందుఁడును, శ్రీకృష్ణ చంద్రుఁడు విరాజిల్లుచున్నప్పుడు అన్యదేవతలను బూజించు నావశ్యకత యేమియున్నది?" బ్రహ్మర్షులద్వారా సేవింపఁ బడు వ్రజదేశమును వదలి అన్యదేశయాత్ర చేయుటవలన నేమి ప్రయోజనము?"

సూతుఁడిట్లనెను :- "స్వామీ! వ్రజవాసులకెంకొక కోరిక లేనేలేదు. సమస్తఫలముల ఫలము వారిగృహములందు బాలకుఁడై విరాజిల్లుచున్నాఁడు. వారికి కౌతుకవశమున నందునకును కోరిక కలిగెను. దేవాధిదేవ మహాదేవుఁడు మా మీఁదఁ బ్రసన్నుఁడగుఁగాక! అంబికాదేవి మాకు శ్రీకృ ష్ణునియందవిచలభక్తి కలుగునట్లాశీర్వదించుగాక!" ఇదే వారియొక్క ఆకాంక్ష. అందుకనియే వారు యాత్ర నొనర్చు టకు నిశ్చయించిరి."

గోపికలు చాలదూరము యాత్రార్థము వెళ్ళవలెనని తెలియఁగానే వారికి మిక్కిలి యానందము కలిగెను. ఒకదినము నకు ముందే వారు పూరీలను, బతాసీలను, పులగమును, లడ్లను,

ఇతర పిండివంటలను, తీపి, కారముగల పిండివంటలను తయారు చేసికొని ఉంచుకొనిరి. పిల్లలు జల్లలు వారికి పెట్టుమని యెప్పుడేడ్చెదరో ? వారు వారి సామగ్రిని బండ్లలో వైచుకొని పెట్టెలలో వస్త్రభూషణములను నింపుకొనిరి. పిల్లలకు చమ్కీటోపీలను, చొక్కాలను దొడిగిరి. ప్రాతఃకాలమున శంఖ, వేణు మృదంగాది ధ్వనులు మ్రోగసాగెను. అందఱు బండ్లను నెద్దులు లాగుచుండఁగా "గోవర్ధనకు జయ'అను జయజయ ధ్వానములొనర్చుచు దేవయాత్రకుఁబోయిరి. పోవుచుఁబోవుచుఁ గొలఁది దినములకు అంబికా వనమునకుఁ జేరుకొనిరి. స్థానము మిక్కిలి సుందరముగను, స్వచ్ఛముగను, నేకాంతముగను నుండెను. సరస్వతీనది కిరువైపులను దట్టమైన వనము గలదు. దానిలో భగవతీ అంబికాదేవియొక్క చాలగొప్ప విశాల దేవాలయము గలదు. సమీపముననే అంబికేశ్వరుఁడగు శివుఁడుండెను. స్థానము ప్రసిద్ధమును, ప్రాచీనమునగుటచే దూరదూరమునుండి యాత్రికులు దేవీదర్శనమునకు వచ్చుచుందురు. వ్రజవాసుల పుణ్యసలిలయగు సరస్వతీ నదీతీరమునఁ దమతమ నివాసముల నేర్పఱచుకొనిరి. అందఱిట్లనిరి. "ముందుగా స్నానమును జేసి, అనంతరము శివుని, దేవినిఁబూజించెదము." అంత నందఱును విధ్యుక్తముగ స్నానము నొనర్చిరి. తదనంతరము అందఱును శంకరుని ఆలయమునకుఁబోయి, అందఱును విధి విధానపూర్వకముగ విశ్వనాథుని పూజనొనర్చి, అదేవిధముగ శాస్త్రోక్త విధిచే నంబికాదేవికి గూడ పూజనొనర్చిరి. తీర్థపురోహితులు

నందుఁడీవనమునకు వచ్చినాఁడని విని. వారు గుంపులు గుంపులుగా వచ్చుటకై రానారంభించిరి. ఈ దినములలో నంద రాజు మించిన దాతలు లేరని వారు వినియుండిరి. అతని కష్ట సిద్ధులును నవనిధులును నిండి యుండునని తలచుచుండిరి. వ్రజరమకు క్రీడాస్థానము నేర్పఱుపఁబడెను. అందువలన వారు పెద్ద పెద్ద చొక్కాలను దొడుగుకొని, పాగాలను ధరించి, రంగుల రంగుల ఉత్తరీయములను వేసికొని నందుని దగ్గఱకు వచ్చి ఆశీర్వాదముల నొసంగుచు నిట్లనిరి :– "వ్రజరాజునకు జయమగుగాక! నీపిల్లలకు దీర్ఘాయువు కలుగుఁగాక! వారికి వేలకొలఁది భార్యలు వచ్చెదరుగాక! లక్షలకొలఁదిగ మనుమలు మనుమరాండ్రు గల్గుదురుగాక। పాడిపంటలచే నిండ్లు నిండుఁ గాక!

నవ్వినందుఁడిట్లనెను :– "బ్రాహ్మణులారా! మీరి దేమి ఆశీర్వాదము నొసంగుచున్నారు? ఒక్క భార్యనే పోషించుట కష్టమగుచున్నది, మాపిల్లవానికి వేలకొలఁది భార్యలు వచ్చుననుచున్నారని ఆశీర్వదించుచున్నారేమి? మాచిన్నవాఁడిన్నివేలమంది నెట్లు సంబాళింపఁగలఁడు?"

బ్రాహ్మణులిట్లనిరి :– "వ్రజరాజా! మీపిల్లవాఁడు సామాన్యుఁడుకాఁడు. అంతయును సంబాళింపఁ గలఁడు. ఈతనికి వేలకొలఁది భార్యలను సమర్థించుట ఏమంత గొప్ప పనికాదు. మీరు కృపతో నీక్షేత్రమునకు వచ్చితిరి. మీరు మీపద ప్రతిష్ఠకుఁదగినట్లుగ దానదక్షిణల నొసంగ వలయును."

ఉదారమనస్కుఁడగు నందుఁడిట్లనెను :- "బ్రాహ్మణు లారా! మీ కేదికావలయునో దానినిఁ గొనిపొండు. నాకడ నారాయణుని కృపచే దేనికిని లోటులేదు. చాలమంచి బలిసి, యీనిన పాడిఆవులను గైకొనుఁడు. కావలసినంత సువర్ణ మును గొనుఁడు. మంచి మంచి వస్త్రములను గొనుఁడు

మధువును గొనుఁడు, లడ్లు, పూరీలు మొదలగు పిండివంట లను, రసగుల్లాలను, గులాబుజామును, క్షీరాన్నము, హల్వా. మీగడ, వెన్న, పాలకోవా వీనిలో మీ కేవి రుచి కరములుగ నుండునో వానిని యథేష్టముగఁదినుఁడు. లొట్ట లు వేసికొనుచు, చప్పరించుకొనుచుఁ గడుపునిండ నిష్టము వచ్చినట్లు తినుఁడు"

నందుని యీ యుదారవాక్యములను విని తీర్థవాసు లగు బ్రాహ్మణులు మిక్కిలి ప్రసన్నులైరి. వారు నందుఁ డొసంగిన గోవులను, సువర్ణమును. వస్త్రములను, మధు మధురాన్నాది వస్తువులను సంతోషముతో గ్రహించిరి. బ్రాహ్మణు లాశీర్వచనముల లొసంగుచు నిట్లనిరి :- "పుత్రవంతు లగుదురుగాక! కీర్తివంతులగుదురుగాక! యశ స్వులును, తేజస్వులును నగుదురుగాక!".

నందుఁడిట్లనెను :- బ్రాహ్మణులారా! ఈ వస్తువు లన్నియును మీ ఆశీర్వాదముచే మొదటినుండియును గలవు. దేవాధి దేవుఁడగు మహాదేవుఁడు మామీఁదఁ బ్రసన్నుఁడగు నట్లాశీర్వదింపుఁడు. మాచిత్తమును ఆతని చరణములందు

లగ్నమొనర్చుఁగాక! బ్రాహ్మణులు "తథాస్తు" అని పలికి ఆతని నభినందించెను.

శాస్త్రములలోఁ దీర్థమునకుఁ బోయిన దినమున నుపవాస మొనర్చు నియమముకలదు. ఈ నియమానుసారముగ గోపగోపీజనము లాదినమున నేమియు దినలేదు. కేవలము సరస్వతీనదిలోని సుందర స్వాదిష్ట జలపానము నొనర్చి డేరాల లోనికి వచ్చి నిద్రించిరి.

అచ్చట దట్టమైన వనముండనే యున్నది. అర్ధరాత్రివేళ దైవయోగమున నొక అజగరమచ్చటికి వచ్చెను. అది అత్యంతాఁకలినిఁ జెంది యుండెను. నందుని డేరా సమీపముననే కలదు. రాఁగానే అది నందుని పాదములను బట్టుకొని, అది ఆతనిని మ్రింగనారంభించెను. వెంటనే నందుఁడు కన్నులను దెఱచెను. ఈ గొప్ప సర్పము మ్రింగుటకు వచ్చినదని ఆతఁడు తెలిసికొనెను. అప్పుడాతఁడు ముక్త కంఠముతో నిట్లరువ నారంభించెను :- "కృష్ణా! కృష్ణా! నేవెచ్చట నున్నావు? ఎచ్చట నిద్రించుచున్నావో అచ్చటినుండి పరుగెత్తుకొని రావలయును. ఓరీ! నీవు సమస్త వ్రజవాసులు శరణాగతిని జెందఁగా వారిని సంకటములనుండి రక్షించితివి. నేనును శరణాగతుఁడను. నేనును వ్రజవాసినే. నీ తండ్రినగు నన్ను రక్షింపుమని నేను కోరుచున్నాను. ఈ ఘోర సంకటమునుండి నన్ను రక్షింపవలయును."

ఇది విని శౌనకుఁడిట్లనెను :- "సూతా! మాకు రెండు శంకలుత్పన్నమైనవి. మొదటిదేమనఁగా- శ్రీకృష్ణభగవానుని తండ్రియగు నందుఁడు మృత్యుభీతిచే నింతటి దీనముగా నేల యేడ్చినాఁడు. తర్వాతఁ గుమారునితో నిట్లనినాఁడు-"శరణాగతుఁడగు నన్ను సంకటమునుండి రక్షింపుడు." ఇది నందునకనురూపముగ లేదు." రెండవ శంక యేదనఁగా- భగవానుఁడును నదే డేరాలో నుండి యుండును. అట్టి యెడల నెచ్చట నుండిన నచ్చటినుండి రావలెనని యేల కేకలు వేసినాఁడు?"

అంత సూతుఁడిట్లనెను :- "మహాభాగా! ఇదంతయును నరనాట్యము జరుగుచున్నది. మృత్యువుచే నందఱకును భయము కలుగుచుండును. అందువలన నందుఁడును భయభీతత్వ నాట్యమును జూపించెను. రెండవది— ఆతని కప మృత్యువు వచ్చినదని తెలిసికొనఁగా నాతఁడార్తుఁడై భగవంతుని బిలుచుటయే మందు. చచ్చునపుడు భగవచ్చరణామృతము నోటిలోఁబడిన నకాల మృత్యువును నాశమొనర్చును. వానికి దుర్గతి కలుగదు. అందుకనియె రెండుసార్లు "కృష్ణా! కృష్ణా!!" యని రెండుసార్లు పిలిచెను. మూఁడవది ఆతనికి మృత్యుభయము లేదు. ఆతనికి శ్రీకృష్ణ వియోగ దుఃఖమే దుఃఖము అందుకనియే ఆతఁడార్తుఁడై కృష్ణా! కృష్ణా! అని పిలిచెను. నాల్గవది— ఆతఁడిట్లనుకొనెను :- అజగర మాతనిఁ బ్రమింగిన, తర్వాత నది వ్రజవాసులమీఁదఁగూడ ప్రహార మొనర్చును. కావున శ్రీకృష్ణుఁడు కాళియుని వలె దీనిని

దమన మొనర్పఁగలఁడని ఆతని విశ్వాసము. అంతటి విష ధర కాళియుని నాశ మొనర్పఁగా నీ యజగరమేమి లెక్క? ఎవరైన భయపడిన భయపడుదురేమోకాని శ్రీకృష్ణుఁడు మాత్రము అజగరమునకు భయపడఁడు. అందువలన నాతఁడార్తుఁడై శ్రీకృష్ణునిఁ బిలిచెను. ప్రేమాధిక్యముచే దీన త్వము వచ్చుట స్వాభావికమే.''

ఇఁక శ్రీకృష్ణుఁడు దూరముగ నుండిన విషయమును వినుఁడు. మీరు చిన్నప్పటినుండియును సాధువులై తిరి. విషయమేమనఁగాఁ జిన్న పిల్లలు సదా తల్లిదండ్రులకడ నిద్రించుచుందురు. ఆతఁడు కొంచెము పెద్దవాఁడైనచో నాతనికి గురుజనములవద్ద కొంచెము సంకోచముండును. అప్పుడు సమవయస్కులగు వారితో నుండుటలోను, నిద్రిం చుటలోను మిక్కిలి ఆనందము కలుగును. తల్లిదండ్రులును సంకోచించుచుందురు. ఎండకాలము భగవానుఁడు సఖు లతో నాడుచుఁ బాడుచుఁ జాలదూరము పోయెను. వారి తోడనే నిద్రించెను. ఒకే యూడుగల గోపకులొక్కచోటనే నిద్రించుచున్నారని గోపకులందఱకును దెలియును. కావున నెవరికినిఁ జింతకలుగలేదు. అజగరము నందునిఁ బట్టుకొని నప్పుడు శ్రీకృష్ణచంద్రుఁడు దూరముగ నుండెను. చాల మంది సేవకులును, ఇతర గోపకులును ఆతనికడ నిద్రించు చుండిరి. వ్రజరాజుని ఆర్తస్వరమును వినఁగానే గోపగణము లేచి నిలుచుండిరి. ఒక పెద్ద అజగరము నందుని పాదము లను మ్రింగుచుండుటను గాంచి వారందఱును కిం కర్తవ్య

విమూఢులైరి. వన్యమృగముల భీతిచే గోపకులు పెద్ద పెద్ద కట్టెలను దెచ్చి, గొప్ప నెగడును వెలిఁగించిరి. పెద్ద పెద్ద కట్టెలు కాలుచుండెను. గోపకులకేమియును దోఁచలేదు; కాలుచుండు కట్టెలను దీసి అజగరమును గొట్టిరి; కాని అది చలింపలేదు. అది నందుని పాదమును వదలలేదు. దాని శరీరము కాలెను; కాని అది నందుని అట్లే పట్టుకొని యుండెను. ఇంతలోనే నందనందనుఁడగు శ్రీకృష్ణుఁడు ఆ గోలను విని అచ్చటికి వచ్చెను. రాఁగానే అతఁడిట్లడిగెను: "ఏమది! గోలజరుగుచున్నదేమి ?"

గోపకు లేడ్చుచు నిట్లనిరి :- "ఓయీ! వ్రజరాజును అజగరము మ్రింగుచున్నది. మేమనేకములగు నుపాయము లోనర్చితిమి. అది వదలుటలేదు."

భగవానుఁడు సరళముగ నిట్లనెను :- "ఏమయ్యా! భయపడుట కిందేమున్నది? నేనా నీచుని యమపురమున కిప్పుడే పంపెదను. సర్పమునకు నాతండ్రినిఁ బట్టుకొని మ్రింగునంతటి సాహసమా ? ఆ నీచునకు మాతండ్రి తన పాదమును నోటిలోఁ బెట్టినాఁడు. నేనా నీచుని శిరస్సుమీఁద నాపాదములను బెట్టెదను."

ఇట్లు పలికి భగవానుఁడు తన వామపాదమునాతని శరీరమునఁ బెట్టఁగానే భగవంతుని చరణస్పర్శ తగులఁగానే ఆతఁడు మారిపోయి సర్పశరీరమును వదలి పరమసుందరమగు దేవతా శరీరమును ధరించెను. దివ్యవస్త్రాభూషణములచే

నాతఁడలంకృతుఁడై యుండెను. అమ్లాన పుష్పమాలలను ఆతఁడు తన కంఠమున ధరించి యుండెను. దివ్యకిరీటముకుట ముచే నాతని శిరస్సు సుశోభితమై యుండెను. చాలమంది విద్యాధరులాతని స్తుతించుచుండిరి. ఆతని యిట్టి అద్భుత రూపమును గాంచి గోపగణమాశ్చర్య చకితులైరి. వారు పరమ విస్మయముతో నాతనివైపు అట్లే చూచుచు నిలిచి పోయిరి.

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఈవిధముగ భగవానుఁడు అంబికా వనయాత్రయందు తన తండ్రిని అజగ రమునుండి రక్షించెను."

ఇది విని శౌనకుఁడిట్లనెను :- "సూతా! ఈయజగరుఁ డెవఁడు? ఈతఁడేల నందుని పాదమును బట్టుకొనినాఁడు? ఈతఁడు భగవానుని స్పర్శింపఁగనే సర్పముగ నుండినవాఁడు దేవత యెట్లైనాఁడు? ఉచితమని తోఁచినచో నీకథను మాకుఁ జెప్పుఁడు."

సూతుఁడిట్లనెను :- "మంచిది స్వామీ! నేనజగరుని పూర్వజన్మ వృత్తాంతమును జెప్పెదను. మీరందఱును సమాహిత చిత్తులరై శ్రవణ మొనర్పుఁడు."

# సుదర్శనోద్ధార కథ

(౧౦౦౮)

శ్లో॥ ఋషీన్విరూపానంగిరసః ప్రాహసం రూపదర్పితః ।
తైరిమాం ప్రాపితో యోనిం ప్రలబ్ధైః స్వేనపాప్మనా ।

శ్రీ భాగ. ౧౦ స్కం. ౩౪ అ ౩౪ అ. ౧౩ శ్లో॥

వ. "దేవా యేను సుదర్శనుండను విద్యాధరుండ విమానారూఢుండనై రూపసంపద్గర్వంబులం జొక్కి దిక్కులం జరించుచు నొక్కయెడ నాంగిరసులైన ఋషులంగురూపులైన వారలంగని నగిన వారును నీవు రూపసంపద్గర్వంబున మమ్ము నగితివి గావున మహాసర్పంబవై యుండు మ్మని శపించిరి."

జీవుఁడెటు తలఁచిన నట్లగును. మీరు శ్రద్ధగా నాలోచింపుఁడు. మనకు క్రోధము వచ్చినపుడు ఆకృతి పూర్తిగా మారును. కన్నులు మారును. స్వరము మారును. అదేవిధముగ మనస్సునఁ గామము కలిగిన భావము మారి పోవును. చేష్టలు మారిపోవును. వికారము ముఖమున స్పష్టముగ గోచరించును. మానవుఁడు కామమయుఁడగును. సృష్టికి కారణము మనభావములే. సృష్టి ప్రసంగమున వచ్చును. బ్రహ్మ కెప్పుడే భావము కలిగిన నప్పుడట్టి సృష్టి కలిగినది. ఆతని మనస్సులో గానేచ్ఛ కలిగినపుడు గంధర్వులుదయించిరి. దివ్యభావముదయించినపుడు దేవత లుదయించిరి. సుఖదుఃఖము లొసంగువారితరులెవరో లేరు.

మానవుఁడు తాను జేసిన కర్మల ఫలముల ననుభవించును. ఎప్పుడెట్టి కర్మయుదయించునో అప్పుడట్టిదే నిమిత్తముగఁ గారణమేర్పడును మన మెవరినైనను జూచి నవ్వినచో నితరులు మనలను గాంచి నవ్వుదురు. మనమితరులపై దయఁజూపినచో నితరులు మనపై దయఁజూపుదురు. కర్మ సిద్ధాంతము బావిలోని మాట వంటిది. మనమేమి పలికిన, మరల నదియే వినఁబడును. చాలమంది అప్సరసలు అష్టా వక్రుని యెనిమిది వంకరలను గాంచి నవ్విరి. అప్పుడా ముని శాపము నిట్లొసంగెను. "మిమ్ములను జూచియును లోకులు నవ్వెదరు." తన ప్రియురాండ్లను నవ్వించుటకై ఒక గంధ ర్వుఁడు మునిని జలములో మునుగి పాదములను బట్టుకొనెను. అప్పుడు ముని యిట్లనెను :– "నీవు పాదములు బట్టుకొను గ్రహామయ్యెదవు గాక !" మానవుఁడు తన భావనాను సారము గనే కాఁగలఁడు. ఇంతకు ఆలోచింపవలసిన దేమనఁగా– ఒక మానవుఁడు పుట్టినప్పటినుండియును గుంటివాఁడు. వాఁడు కుంటుచుఁగుంటుచు నడచుచున్నాఁడు. వానినిఁ గాంచి యితరులు నవ్వుట వ్యర్థము. ఇంకొకఁడు పుట్టు గ్రుడ్డి. వానికిఁ గనఁబడదు. గోడకు కొట్టుకొనుచుండును. ఇత రులు వానినిఁ గాంచి నవ్వుచుండెదరు. ఇందులో నవ్వుట కేమి యున్నది ? ఒక కుంటి కవి యుండెను. ఆతఁడు కుంటుచు వచ్చుచుండుటను గాంచి కొందఱు నవ్వుచుండిరి. వారు నవ్వుచుండుటను గాంచి ఆతఁడు మంచి చెడ్డలు చూడక యిట్లనెను :– "మీరెవరినిఁజూచి నవ్వుచున్నారు ? నన్నుఁ

జూచియా? నన్నుఁ జేసిన వానినిఁ జూచియా? నన్నుఁ జూచి నవ్వుచుంటిరా నేను పుట్టుకలోనే కుంటిని. నేనిట్లు నడచుట నాకు స్వభావమైనది. లేక నన్నుఁజేసిన భగవంతునిఁగాంచి నవ్వుచున్నామంటిరా? అతఁడు నన్నుఁ గుంటి వానిఁగా నేల జేసినాఁడో. కావున నాతని గాంచి నవ్వుటయును వ్యర్థమే. అతఁడు న్యాయకాని, ఎవ్వరికిని నన్యాయమును గావింపఁడు. కర్మానుసారముగ ఫలము నొసంగును." ఇంతకు జెప్పుచున్న దేమనఁగా జన్మతోఁ గురూపిగానుండు వానిని గాంచి సురూపులు నవ్వుటెందులకు? ఎవనికి వాఁడు తన రూపమును సుందరముగ నెట్లు చేసికొనలేక పోయినాఁడో అట్లే కురూపము గావలయునని గ్రహింపలేదు. ఎవఁడైనఁ గురూపినిఁ గాంచి, ఆ కురూపము నాతని మనస్సులోనికిఁ దెచ్చుకొనినచో నాతని కట్టి భావములే కలిగి, చివరకు దాను నట్లే యగును. ఎవరు ఇతరుల దోషములను జింతించెదరో అతఁడు దోషి యగును. ఇతరుల గుణములను గూర్చి నిరంతరము చింతించిన నాతఁడు గుణి యగును.

సూతుఁడిట్లనెను:- "మునులారా! మీరా యజగరుని గూర్చి నన్నుఁ బ్రశ్నించితిరి. అతఁడు అంబికావనమున వ్రజరాజగు నందుని కాలు పట్టుకొనుటయును, శ్రీకృష్ణుని పాదస్పర్శచే సర్పశరీరమును వీడి దేవతయగుటయు మీకు తెలిసినదే. అతని వృత్తాంతమును నేను మీకు జెప్పెదను. సర్పము సర్పశరీరమును వీడి దివ్యరూపధారియగు దేవత యగుటను గోపకులు గాంచి పరమ విస్మితులైరి. మాటి

మాటికి దానివైపునకు జూచుచు, మరల నాశ్చర్య చకితులై శ్రీకృష్ణునిఁ గాంచుచుండిరి. భగవానుఁడు వారి భావములను గమనించి, దాని పూర్వజన్మ వృత్తాంతము నాతని ద్వారా అందఱకు దెలియఁజేయవలయునని ఆతఁడిట్లనెను :- "అయ్యా! నీవెవరవు? చూచుటకు నీవెవరో దేవతవుగా గోచరించుచున్నావు. నీవీ నిందనీయ సర్పమవేల అయితివి? నీ దివ్యశరీరము పరమకాంతిచే దేదీప్యమానమగుచున్నది. ఇట్టి శరీరమును బుద్ధిపూర్వకముగ ద్యజించి సర్పమగుటకెవరు నంగీకరింపరు. ఏ కర్మచే వివశుఁడవై యీ యజగరమైతివి ?"

భగవానుని యీ ప్రశ్నను విని దివ్యపురుషుఁడు నవ్వి యిట్లనెను :- "ప్రభూ! మీరు ఘటఘటము నెఱిఁగినవారు, సర్వజ్ఞులు, సర్వవిదులు. అన్నియు నెఱిఁగియును నరలీల నొనర్చుచున్నారు. నాకిప్పుడు నావృత్తాంతమును జెప్పుట కాజ్ఞాపించితిరి. కేవలము మీ యాజ్ఞను బాలించుటకే నేను నావృత్తాంతమును జెప్పుచున్నాను."

"స్వామీ! నేను పూర్వజన్మమున విద్యాధరుఁడను. విద్యాధరులుప దేవతలలో నొక జాతి యని మీకు తెలిసినదే. ఉపదేవతలందఱిలో విద్యాధరులందమైనవారు. కాని నేను విద్యాధరులందఱిలో నతిసుందరుఁడుగ నెన్నఁబడుచుంటిని. నా సౌందర్యమునకు సర్వత్ర ఖ్యాతి కలదు. దూరదూరముల నుండి చాలమంది నన్నుఁ జూచుటకు వచ్చుచుందురు. అందువలన నాపేరు సుదర్శనుఁడనుడనిరి. నాకు సౌందర్య గర్వ

ముం డెడిది. నేను సౌందర్య మదమున మత్తుఁడనై తిని. స్త్రీలు నారూపమందాసక్తినిఁ జెందెదరు. నేను విద్యాధర స్త్రీలలచేఁ బరివేష్టింపఁబడి యుండెడు వాఁడను.

ఒక దినమున నేను నా ప్రియురాం డ్రతోఁ గలసి వనవిహారమునకు బోవుచుంటిని. అచ్చట నాకు దారిలో నొక మహర్షులు తటస్థపడెను. వారందఱును అంగిరస వంశజులు. అంగిరస గోత్రులగు నామునులందఱును నల్లనివారు. వారి స్వరూప మును సుందరముగ లేదు. నిరంతరము తపస్సు చేయుచుఁగాఁ జేయఁగా వారి చర్మ అడవి దున్నచర్మమువలె నుండెను. ముఖమున ముడతలు పడెను. కాళ్లకు పగుళ్లేర్పడెను. వాయువుచే శరీరమంతయును నెండినట్లుండెను. జీర్ణ శీర్ణ వల్కల వస్త్రములను ధరించిరి. వారి యావేషములను, కురూపమును గాంచఁగనే నాకు నవ్వువచ్చెను. నేను వారినెగతాళి చేయఁ దొడంగితిని, మదమత్తుఁడ నగుటచే నావివేకము నశించెను. నేను వారి నెగతాళి చేసితిని.

మునిగణము చాల శాంతులుగను, దాంతులుగను తపస్వులుగను, సహనశీలురుగను నుందురు. కాని నాదౌర్భాగ్య వశముచే వారికి నా అవినయమునకు క్రోధముకలిగి, కోపముతో నిట్లనెను. :– "ఓరీ! దుష్టా! నీకు నీసౌందర్యముమీఁద చాల గర్వము కలదు. అందఱును నీసౌందర్యమును గాంచి దర్శనము నకు వచ్చెదరని నీవనుకొను చున్నావు. కావున నీవు సర్పముకావలసినదని నిన్ను శపించుచున్నాము. నిన్నుఁ

జూడఁగనే అందఱును భయపడు చుందురు. నీకడకెవరును రారు."

మునులు శాపమును వినఁగానే నామదము చూర్ణ చూర్ణమైనది. నా సౌందర్య గర్వము ఖర్వమైనది. నేను భయముచే గడగడ వణఁకితిని."

భగవానుఁడిట్లనెను :- మునులు నీయెడలఁగఠోరముగ నుండిరి చిన్న యపరాధమునకు గొప్పదండము వచ్చినది."

శీఘ్రముగ సుదర్శన విద్యాధరుఁడిట్లనెను :- లేదు స్వామీ! కరుణామయులగు మునీశ్వరులు నన్నుఁగృపఁజూచిరి. వారు నాకు శాపమీయకుండినచో నేను గర్వముచే నరకము లకుఁబోయెడు వాఁడనే. దేవదుర్లభమగు మీ చరణ స్పర్శ యెట్లు ప్రాప్తింపఁగలదు."

భగవానుఁడిట్లనెను :- "సరే, తర్వాత నేమైనది."

సుదర్శనుఁడిట్లనెను :- "తర్వాత నేమైనది స్వామీ! శాపమును విని నేనామునుల పాదముల మీఁదఁబడితిని. నేను జేసిన పనికి నాకు పశ్చాత్తాపము కలిగెను. దీనుఁడనై హృదయమున ఖేదమును బ్రకటించుచు నేను మునులను క్షమాపణ గోరితిని. మునుల కోపము నీటిమీఁద గీతవలె నుండును. కోపము రాఁగానే వెంటనే శాంతించును. మును లిట్లనిరి :- "నాయనా! మేము ఎగతాళికైనను నబద్ధమాడము, నీవు సర్పమనై తీరవలయును, కాని అంబికావన

మునకు భగవానుఁడు వచ్చినపుడాతని తండ్రియగు నందుని పాదమును నీవు పట్టుకొందువు. అప్పుడు భగవంతుఁడు నిన్నుద్ధరింపఁగలఁడు. అప్పుడు మరల నీవు పూర్వ విద్యాధరుఁడ వయ్యెదవు” ఇట్లు పలికి ఆమునులు వారిష్టమువచ్చిన చోటునకుఁబోయిరి. నేను సర్పమునై యీవనమున నివసించుచుంటిని' నేఁడు నాభాగ్యము పండినది. మీరు సంసార భయభీతులగు వారి సమస్త భయములను బోగొట్టువారు. మీరు నాభయమును బోఁగొట్టితిరి. మీరు శరణాగత వత్సలురు. నేను శరణమునకును రాలేదు. నేను మీతండ్రికి బాధను గలిగించితిని. నేను మీకపరాధమునే కావించితిని. అయినను మీరు నా దుఃఖముల నన్నిటిని నాశమొనర్చితిరి. భక్తవత్సలా! అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! మీరు మీసంసార తారక పాదపద్మ స్పర్శచే నన్నుఁ గృతార్థునిఁ గావించితిరి. నన్ను సర్పజన్మనుండి యుద్ధరించుటయే కాదు, శాశ్వతముగ సంసారబంధమున నుండియు నుద్ధరించితిరి. నేనిప్పుడు శాపవిముక్తుఁడ నైతిని. మీ యాజ్ఞ అయినచో నేనిప్పుడు నాలోకమునకుఁబోయెదను.

భగవానుఁడిట్లనెను :- “మంచిది, నీవు నీలోకమునకుఁ బొమ్ము. ఇప్పుడింకెవరిని నెగతాళిచేయవలదు. నీరూపమందును గర్వమును జెందరాదు. ఈ ధనవైభవములును, రూపయౌవనములును” సాంసారిక సుఖములును అన్నియును నశ్వరములే. క్షణభంగురములు, అనిత్యములు, వీని యహంకారమును జొందక సదానాచరణస్మరణమును గావింపుచుండుము.”

సుదర్శన విద్యాధరుఁ డిట్లు౦డెను :- "పరమపురుషా! మహాయోగీ! సజ్జన ప్రతిపాలకా! సర్వేశ్వరా! సర్వాత్మకా! ఇప్పుడు నేను మీచరణములను శరణువేఁడితిని, ఇప్పుడు నామదమణఁగినది. మీ పరమపావన పాదస్పర్శచే నా శాపము వీడిపోయెను. ప్రభూ! ఎవరు సాక్షాత్తుగ మిమ్ములను దర్శించిరో, కేవలము మీ సుమధుర నామములను శ్రద్ధా సహితముగ గానమొనర్చెదరో, వారును బరమపావనులై పరమపదవి కధికారులయ్యెదరు. నామస్మరణ మొనర్చువారి సంగతి నట్లు౦చుఁడు. స్వయముగ నుచ్చరింపకుండినను కేవల మొక సాధుముఖమున వినినచో నాతఁడును వెంటనే తరింపఁ గలఁడు. తాను దరించుటయేకాక, ఇతరులనుగూడ తరింపఁ జేయును. నీనామములోనే యింతటి మహిమ ఉండఁగా, నీ చరణస్పర్శ చేయు దేవదుర్లభమగు భాగ్యము లభించిన వాఁడు శాపవిముక్తుఁడగుట తుచ్ఛాతి తుచ్ఛవిషయమే. నేఁడు నాకిది పరమ సౌభాగ్యమనుకొనుచున్నాను. మునులు నాకిచ్చినది శాపము కాదు. వారు నన్ననుగ్రహించిరి"

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఈ విధముగ స్తుతించి, వినయమొనర్చి. ఆతని ఆజ్ఞను బొంది, విద్యాధరులచేఁ బూజితుఁడై, సుదర్శనుఁడు భగవంతునకు ప్రదక్షిణ మొనర్చి తనలోకమునకుఁబోయెను. ఇచ్చట నందుఁడును సంకటమునుండి బయటపడి పరమ ప్రముదితుఁడయ్యెను. గోపగణములును భగవానుని యద్భుత ప్రభావమును, మహిమను గాంచి ఆశ్చర్యచకితుఁడయ్యెను. వారు మాటి

మాటికిని శ్రీకృష్ణచంద్రుని ఆలింగనము చేసికొనిరి. ప్రాతః కాలమయ్యెను. అందఱును ద్వారత్వరగా స్నానమొనర్చి దేవిని, శంకరుని బూజించిరి. అంత సానందముగ నన్నమును గూరలను, పప్పులు పరమాన్నములను వండుకొనిరి. నిన్న పగలంతయు నాఁకలితోడనే యుండిరి నేఁడందఱును బ్రాహ్మణులకు షడ్రసోపేతముగ సంతర్పణ మొనర్చి ప్రసాదమును స్వీకరించిరి. మూఁడు దినములవఱకు వారు తీర్థములో మిక్కిలి యానందముతో నుండిరి. చివర కందఱును వ్రజమునకు బోవ దమను కొనిరి.

వ్రజవాసులందఱును వ్రజమునకుఁబోవుట కుత్సహించు చున్నారని విని నందుఁడు వారికనుమతించెను. గోపగణము తమతమ బండ్లలో సామాను వేసికొని బయలుదేరిరి కొలఁది దినములకే వ్రజమునకు వచ్చిరి. మరల నందఱును సుఖముగ నచ్చటఁ బూర్వమువలె నుండిరి.

సూతుఁడిట్లనెను :- "మునులారా! నేను సంక్షేపముగ సుదర్శనోద్ధారకథను జెప్పితిని. భగవానుఁడు సర్పము నుండి నందునెట్లు రక్షించినాఁడో అట్లే గోపికలను శంఖ చూడ గుహ్యాకులనుండి ఉద్ధరించినాఁడు. ఆతనిని బరమ పదమునకుఁ బంపించెను.

అంత శౌనకుఁ డిట్లనెను :- "సూతా! ఈ శంఖచూడ గుహ్యాకుఁడెవఁడు? ఈతెఁడు గోపికల కేమి యన్యాయమును గావించినాఁడు? దయచేసి యీకథను మాకు తప్పక చెప్ప వలయును."

ఇది విని సూతుఁడిట్లనెను :- "మంచిది, స్వామీ! నేనిప్పుడు శంఖచూడోద్ధార కథను చెప్పుచున్నాను. దానిని మీరు సమాహితచిత్తులరై వినుఁడు."

## శంఖచూడోద్ధారము.

శ్లో॥ శంఖచూడ నిహత్యైవం మణిమాదాయ బాస్వరమ్॥
అగ్రజాయాదదా త్ప్రీత్యా పశ్యన్తీనాం చ యోషితామ్॥
శ్రీభాగ. ౧౦ స్కం. ౩౪ అ. ౩౨ శ్లో॥

వ॥ "శంఖచూడు నింజంపి వాని శిరోరత్నంబు దెచ్చి బలబద్రునికిచ్చి మెప్పించెను.

శ్రీమదాంధ్ర భాగవతము.

ప్రేమలో మధుర విషయము లేకాంతములోనే జరుగును. ఎవరైన నితరుఁడు వచ్చినా సంకోచము కలుగుచుండును. అందువలనఁ బ్రేమిసదా యేకాంతమును గోరుకొనుచుండును. వాస్తవముగఁ బ్రేమ నిభృత నికుంజములందే యుండును. అచ్చట ఈర్ష్యాద్వేషములు లేకుండు వారుండవలయును. సంకోచమును గలిగించు గురుజనులుండరాదు. అచ్చటఁగేవలము ఒక్క ప్రాణము. ఒక్కమనస్సు, ఒకే భావముఁగల అత్యంత ప్రేమికులుండవలెను, సమయము, దేశము, పరిస్థితి అనుకూలముగ నుండవలయును. అంతేకాను బ్రేమోద్దీపక భావములు కలవారుగ నుండవలయును. ఇఁకనప్పటి

సంగతి చెప్పవలసిన దేమున్నది? సరసతాధార ప్రవహించు చుండును. ఆనంద తరంగములు లేచును. ప్రేమయొక్క ఆటు పోట్లు వచ్చును. అంగ ప్రత్యంగములు శిథిలములై పోవును. శరీరము నిశ్చేష్టమగును. అప్పుడు ప్రేమలో భావసమాధి వచ్చినట్లుండును. అట్టి దివ్యసుఖసమయమున నానందము నకు విఘ్నము కలిగించినచో నంతకు మించిన దుష్టుఁడింకెవఁ డుండఁగలఁడు? ఆతఁడాతతాయి. వధార్హుఁడు. కాని శ్యామ సుందరుని యెడల దుష్టత్వమును జరుపువాఁడును బరమ పదవి కధికారియగును. అగ్ని నెవ్వు తాఁకినను గాల్చితీరును.

సూతుఁడిట్లనెను :– "మునులారా! మీరు నన్ను శంఖచూడు నుద్ధరించిన కథను గూర్చి ప్రశ్నించితిరి దానినే మీకిప్పుడు చెప్పుచున్నాను. భగవానుఁడు సదా గోపికలతో రాసవిలాసములను జేయుచుండును. బలరాముఁడును బోవు చుండెడు వాఁడు. బలదేవుని యూథము వేఱుగనుండెను. ఆతని గోపికలు వేఱు. అందఱును నప్పుడప్పుడు పాడుకొను టకు వెడలుచుందురు. అందఱును గలిసి మెలసి పాడు చుందురు. వాయించుకొనుచుందురు. చివరకు వేఱువేఱు నికుంజములకుఁ బోయెడువారు."

ఒక దినమున భగవానుఁడు బలరామునితోఁగూడి వనమున విహరించుచుండెను. వెన్నలరాత్రి పరమసుకు మారులు, వ్రజనారులు, రూపోజ్జ్వలగు సఖులు వెంట నుండిరి. ఆ చంద్రముఖులు, మృగనయనలు, కోకిల కంఠలగు కామినులు తమ కలకంఠములచే శ్రీకృష్ణుని కలితకీర్తిని

గానము చేయుచుండిరి. ఇద్దరును సుందరులే. రసవంతమైన వారే. మనోహరమైన వారే. ఆకర్షకులే. వారినిం జూడఁగనే కామినుల ధైర్యము సడలిపోవును. వారందఱును వీరి సంస్పర్శ సుఖమునకు అధీరులై యుందురు. ఇద్దరి వేషములును మనోజ్ఞములుగ నుండెను. కృష్ణుఁడు నల్లనివాఁడు బలరాముఁడు తెల్లనివాఁడు. శ్రీకృష్ణుఁడు పచ్చని పట్టు వస్త్రమును గట్టుకొనెను. బలరాముఁడు నీలపు పట్టు వస్త్రమును గట్టుకొనెను. ఇద్దర కంఠహారములును వనమాలలచే నలంకృతములైనవి. ఇద్దరి శరీరములందును బహుమూల్యములగు నాభూషణములు శోభించుచుండెను. వారిద్దరి వస్త్రములు సుందరముగను, స్వచ్ఛముగను, సుగంధియుక్తముగను, శోభాయుక్తముగను నుండెను. వారి విశాలబాహువులును, వక్షః స్థలములును, మస్తకములును, సర్వాంగములును దివ్యసుగంధ చందన చర్చితములై యుండెను. రామకృష్ణులెట్లు శృంగారమొనర్చుకొని వచ్చిరో, అదే విధముగ నిశారాణియును నేఁడు శృంగారము కావించుకొనెను. పూర్ణకళాయుక్తముగ నవ్వుచున్న దనపతియగు చంద్రుని వికసితాననమును గాంచి నిశాదేవి నవ్వుచుండెను. ఆతని హాస్య శుభ్రకణములు ముఖమునుండి వెలువడి ఆకాశమున వెల్లివిఱిసినట్లుండెను. నికుంజములపైన నల్లుకొనిన శ్వేత పీత పుష్పములుగల "మల్లిక" శుభ్రరక్త కుసుమావళితో నుండిన మాలతియు, మృదుపుష్పములు కలిగిన యూధిక మొదలగునవి నిశాదేవికి గంధప్రదాన మొనర్చుచున్నట్లుం

డెను. వానియందు జరించుచున్న మత్తమధుపములు నిశా రాణికి పాటలు పాడుచు నలరించుచున్నట్లుండెను. కుముద కుసుమ సుగంధముచే సువాసితమైన సమీరము శర్వరీ దేవికి వ్యజనమును వీచుచున్నట్లుండెను రాత్రి యొక్క మొదటి జాము యౌవనోత్పత్తి సమయమువలె నుండెను. ఈసమయ మును సద్వినియోగ మొనర్చుటకై నిశారాణియొక్క యౌవన మును సఫలమొనర్చుటకై వనమాలి తన ప్రేయసీలతోఁ గమనీయ క్రీడలను జేయుచుండెను. గోపికలు గానముచేసిన తరువాత వారిద్దరును గాన మొనర్పఁద్రొడంగిరి. వారి గాన మేమి ? విశ్వమందు మాదకతను నింపుచే. వారి గానము ప్రపంచములో సచరాచర ప్రాణుల అంతఃకరణ బాహ్య కరణ ములను నానందమొనర్చునవియై యున్నవి. వారి సంగీతము శాస్త్రీయనియమముల ననుసరించి స్వర, తాళ, లయ, తాన, రాగముల కనుకూలముగ నుండెను. స్వరముల ఆరోహణ అవ రోహణములతోఁగూడి అత్యంత సుఖకరముగ నుండెను. ఆకర్షకముగనునుండెను. అన్నదమ్ములిద్దరును గలిసిపాడు చుండిరి. వారు విశ్వమును సంగీతమయ మొనర్చుచుండిరి.

ఆ సోదరులిద్దర మనమోహక మాదక మధురగానమును విని గోపికలు శరీరస్పృహయును లేనంతగఁ దన్మయలైరి చాలమందియొక్క మేలిముసుఁగులు జారిపోయెను. శిరస్సున ముసుఁగు లేకుండ నయ్యెను. కొందఱి జడలమీఁదఁదురిమిన మాలలు జారిపోయినవి. కొందఱి అవిసెల ముడులూడి పోయెను. చాలమందియొక్క జడలు వదులయ్యెను. నల్ల

నల్లని కేశములు వాయువులో నెగురసాగెను. కాని వారి కెవరికిని స్పృహలేదు. వారు ప్రేమలో మునిఁగి అచేతనావస్థలో నుండిరి. ఆ సమయమున వారికి అభ్యంతరము కలిగెను. శృంగారములోఁ గరుణ ప్రవేశించెను. అనురాగమున వీర రసమావశ్యకమయ్యెను. వెంటనే కుబేరాను చరుఁడును, గుహ్యకుఁడునగు శంఖచూడుఁడను వాఁడచ్చటికి వచ్చెను.

శంఖచూడుఁడు గొప్ప స్త్రీలంపటుఁడును గామియునె యుండెను. అతఁడిట్టి సుందరి స్త్రీలు ప్రేమలో విహ్వాలులై యుండుటను గాంచఁగానే ఆతని మనస్సాతనిలో లేకుండెను. అనురాగములో నుండిన స్త్రీనిఁజూచిననే పురుషునకైనను ధైర్యముండఁబోదు. విశేషముగఁ గాముకుల కది బొత్తుగా నసంభవము. ఆ కాముకుఁడు శక్తిశాలియును, బలవంతుఁడును, సాహసియునైనచో నింకఁ జెప్పవలసిన దేమున్నది? శంఖచూడునకు బలగర్వము కలదు. వాఁడిట్లనుకొనెను :- "నేనుపదేవుఁడను. వీరు మానవ స్త్రీలు. వీరి కడ నెవ్వరును లేరు. ఇద్దరు చిన్న నల్లని, తెల్లని పురుషులు కూర్చుండియున్నారు. వీరు నన్నేమి చేయఁగలరు. వీరిలోఁ గొందఱ స్త్రీల నెత్తుకొని పోయెదను. ఇట్లాలోచనఁ రాగానే వానిసాహస మినుమడించెను. రామకృష్ణుల భుజాబలముచే రక్షింపబడు నీసుకుమారములను వాయువైనను జెడ్డభావముతో స్పర్శింపఁజాలదని వారి కిఁ దెలియదు వానికి మృత్యువు సమీపించినది. అదియే మరల

మరల నట్లు చేయుటకు వానిని ప్రేరేపించు చున్నది. ఈతని మనస్సున నేశంకయును లేదు, భయమును లేకుండెను. ఆతఁడా సోదరులు చూచు చుండఁగనే కొందఱ వ్రజబాలలను బలాత్కారముగ నెత్తుకొని తన భుజములమీఁదఁ బెట్టుకొని ఉత్తర దిశకు పారిపోయెను. తాము శంఖచూడుని పాలిపడుటను గాంచి, ఆ వ్రజాబాలికలు కురరీపక్షివలె రోదనము చేయనారంభించెను. ఏడ్చుచు నేడ్చుచు నార్తస్వరమున నరవఁదొడంగిరి :- "ఓ శ్యామసుందరా! మమ్ములను రక్షింపుము. ఓ వ్రజవల్లభా! నీవు అబలలమగు మమ్ములను జాలా విపత్తులనుండి రక్షించితివి. ఈ విపత్తులనుండియును మమ్ములను రక్షింపుము, మమ్ముల నీదుష్టుని బారినుండి రక్షింపుము. నీవు గొప్పగొప్ప దుష్టాసురులను జంపితివి. ఈ ఆతతాయి దుష్టుని యమసదనమునకుఁ బంపుము. దీనివలన వీని అవినయమునకు ఫలమొసంగుము."

స్త్రీలయొక్క యీ క్రందనమును విని ఆసోదరు లిద్దరు నిట్లనిరి :- "భయపడకుఁడు, భయపడకుఁడు. మేమీ దుష్టునిప్పుడే యమసదనము నకుఁబంపెదను. ఈ దుష్టుని బారినుండి యిప్పుడే వదలించెదము" అని పలుకుచు నాసోదరుడు లిద్దరును వీనినిఁదరిమిరి. బలరాముఁడొక శాలవృక్షమును బెఱికెను. ఆతని యీయద్భుత అమానుష పరాక్రమమును గాంచఁగనే శంఖచూడుని ధైర్యము సడలి, భయభీతుఁడై గాబరాపడి వెంటనే వ్రజబాలలను వీడి తన ప్రాణములను దప్పించుకొని పరువిడెను. అప్పుడు శ్యామసుందరుఁడు తన

సోదరుఁడగు బలరామునితో నిట్లనెను :- "నీ నీ దుష్టుని వెంట నేల వెంటఁబడెదవు? వీనికి నేను జాలును. నీవీ స్త్రీల ను జూచుచుండుఁడు. నే నిప్పుడే యీ దుష్టుని యమసదన మునకుఁబంపి వచ్చెదను."

బలరాముఁడవహేళనా స్వరమున నిట్లనెను :- "తమ్ముఁడా! నీచుని జావనిమ్ము. వానిపని య్యైనది."

తనమాటమీఁద బలము నొసంగుచు వనమాలి యిట్లనెను :-"కాదు అన్నా! చావనిచ్చుటెట్లు? ఆతతాయి వధార్హుఁడు. వీఁడు తాను జేసిన ఫలము ననుభవింపవల యును. వీని తలమీఁద నొక్క బహుమూల్య దివ్యమణి తళతళలాడు చున్నది. ఇది నీ శిరస్సున దాచుకొనఁదగినది. ఈ నీచుని జంపి మణిని లాగుకొని వచ్చెదను."

మణినిఁగాంచి బలరాముని మనస్సును లోభపడెను. ఆతఁడిట్లనెను :- "మంచిది. సోదరా! నీయిష్టమిదియైనచో నీ నీచునిఁజంపుము. ఎవనికడ నీయనుచితసాహసము చేయువ లయునో తెలిసికొనఁగలఁడు." అని పలికి బలరాముఁడు స్త్రీలను రక్షించుటకు నిలిచిపోయెను. భగవానుఁడాతని వెంటఁబడెను. ఆసన్నకాలమున మృత్యువెట్లు ప్రాణమును దీయుటకు ఆతఁడెచ్చటికిఁ బోయినను వెంటఁబడునో ఆతని నెట్లు విడువదో అదేవిధముగ నాతఁడెచ్చటికి పోయినను భగవానుఁడాతని వెంటనే పడెను. పిల్లి మూషకమును గొంచెము సేపాడించి, చివరకుఁ జంపివేయునో అట్లే కొంచె

ము దూరముపోయి భగవానుఁడాతని నేలకుఁగొట్టెను. భగవానుఁడాతని నణఁచి పిడికెడు పోటు పొడిచెను. వాఁడు నేలను అణఁచుకొని భూమిపైఁ బడిపోయెను. భగవానుని యంగము లన్నియును ఆయుధములే. అవే సర్వాస్త్రములు. ఆతని పిడికిలియే కరవాలము చేసినపని చేసెను. పిడికిలిపోటు తినఁగానే ఆతని శిరస్సు చూడమణితో సహా మొండెమునకు విడివడి దూరమునఁబడెను.

భగవానుఁడాతని శిరస్సునుండి ప్రకాశించు దివ్య మణిని దీసికొని వచ్చి తనయన్నకిచ్చి యిట్లనెను:- "అన్నా! ఇదిగో, దీనినిఁ దీసికో, ఇది విజయధనము."

బలదేవుఁ డిట్లనెను :– "సోదరా! నీవే ఉంచుకో"

భగవానుఁడిట్లనెను :– "నేనెట్లుంచుకొందును. నీవు పెద్దవాఁడవైతివి. పెద్దవారి యెద్ద చిన్నవారికేమియు నధికారముండదు. ఇది నీవస్తువే" అని పలికి స్త్రీల వైపు చూచి నవ్వెను. స్త్రీలును నవ్విరి. బలరాముఁడును నవ్వెను. నవ్వుచు నవ్వుచు నాతఁడామణిని దాను తీసికొనెను. నిశావసానము కాఁగా గోపికలందఱును దమ తమ యిండ్లకు వెళ్ళిరి.

సూతుఁడిట్లనెను :– "మునులారా! నేను శంఖచూడుని ఉద్ధార కథను జెప్పితిని. ఇప్పుడు మీరింకేమి వినఁదలఁచున్నారు. శ్రీకృష్ణుని ఒక్కక్షణమైనను వదలజాలనంతటి అనురాగమును గోపికలు శ్రీకృష్ణుని యెడలఁ గలిగియుండిరి."

# గోపికల కాలక్షేపము

౧౦౧౦

శ్లో॥ గోప్యః కృష్ణే వనం యాతే తమనుద్రుతచేతసః।
కృష్ణలీలాః ప్రగాయన్త్యో నిన్యుర్దుఃఖేన వాసరాన్॥
శ్రీభాగ. ౧౦ స్కం. ౩౫ అ. ౧ శ్లో॥

చ॥ మఱియొకనాఁటి రాత్రి బలమాధవులుజ్జ్వల వస్త్రమాలికా
ధరులును లేపనాభరణధారులునై చని మల్లికాది పు
ష్పరస నిమగ్నమత్తమధుపంబుల గీతము వించుఁదద్వనాం
తరమున వెన్నెలన్ ప్రజనితంబిను లుండఁగఁబాడిరింపుగన్॥
శ్రీమదాంధ్ర భాగవతము

ఎవఁడు తను, మన, ధనములను సరస్వమును శ్యామ సుందరునకు సమర్పించినాఁడో అట్టి వానికి కర్తవ్యమేమియు నుండదు. ఆతఁడు సాధనానుష్ఠాన మేమియును జేయఁడు. సాధనానుష్ఠానము మనస్సుతో జరుగును. మనస్సును మన మోహనుని పాదపద్మముల కర్పించినచో నింక సాధన మెవరి కొఱకు చేయవలెను. ఎవరు చేయవలెను. ఏలచేయవలెను. ఎవనిపై జీవన భారమునంతను సమర్పించిమో, యంత్రముగఁ జేసి తానే యంత్ర మయ్యెనో, నడుపుట ఆతని అధీనములో నున్నది. ఆతఁడెట్లు నడిపినను సరియే. ఎచ్చటికైనను దీసికొని పోవచ్చును. ఆతఁడు స్వయముగ నేదో ఫలాపేక్షచే సంకల్ప పూర్వకముగఁ గర్మలొనర్పఁడు. ఆతని సమస్త కర్మలు భగవత్కైంకర్య నిమిత్తములే యగును. కైంకర్యమునుండి అవకాశములభించినపుడు ఆతఁడు భగవత్సం

బంధమైన పలుకులే పలుకును. ఆతని లీలాగానమే చేయును. దీనినే ఆతఁడు కాలక్షేపమనును. భగవంతుని దర్శనమున్నంతవఱకు అప్పటివఱకు హృదయ వికసించును. నేత్రములు విప్పారును. కైంకర్యమున కవకాశముచిక్క భగవంతుని దర్శనము కానప్పుడు ఆకాలమును భగవత్స్మృతిలో విరహముతో దుఃఖపూర్వకముగ గడచును. గానమొనర్చుటకు భగవల్లీలలు లేకున్నచో సులలిత భాగవతకథలు లేకున్న అనన్యోపాసకునకు జీవితమే యుండదు. భగవల్లీలలే అనన్యకైక ఆధారము. ఆతనిగూర్చి పాడియే వారు జీవించెదరు."

శౌనకుఁడిట్లనెను:- "సూతా! భగవానునియొక్కయు. గోపికలయొక్కయు ప్రేమనుగూర్చి మేము వినిన లీలలు వాని వలన సిద్ధమగు నదేమనఁగా గోపికలు శ్రీకృష్ణునిఁ బ్రాణముల కంటె నెక్కుడుగఁ బ్రేమించెడివారు. ప్రాణి భోజనము లేకయైనను గొన్నిదినములు జీవింపఁగలఁడు, జలములేకను, బ్రదుకఁగలఁడు, కాని ప్రాణసంచారము లేకున్న నాతని జీవితముండుట అసంభవము. భగవానునకు వారి యెడల నిట్టి యనురాగమున్నప్పుడు ఆతఁడావులను గాయుటకు వనమునకుఁ బోయినపుడు వారెట్లు జీవించియుండిరి ?"

సూతుఁడిట్లనెను :- "స్వామీ ! మీ సందేహము చక్కఁగ నున్నది. వాస్తవమున గోపికలకు భగవంతుఁడు ప్రాణములకంటెను నధిక ప్రియమైనవాఁడు. ఏలననఁగా నాతఁడు ప్రాణములకు బ్రాణమైనవాఁడు. కాని ఆతఁడు వనమునకుఁబోయినపుడాతని లీలలే మిగిలెడివి. గోపికా

జీవనమున కవియే ఆధారములు. పరస్పరము శ్రీకృష్ణలీలా గానమొనర్చుచు వారాతని వియోగక్షణములను దుఃఖముతో గడుపుచుండెడువారు. శ్యామసుందరుఁడు ప్రాతఃకాలము నుండి మధ్యాహ్నము వఱకు ఇంటిలోనే ఉండెడువాఁడు. అప్పుడు వచ్చుచుఁబోవుచు పానఘట్టమునందును, భోజన సమయమునను దర్శనముచేసి పోయెడువారు. ఆతఁడు గోవులను దీసికొని వనమునకుఁ బోయినపుడు గోపికలు ఒకచోటఁ గూడి ఒకరొకరు కలిసి కృష్ణలీలాగీతములను బాడుకొనుచుండెడువారు. వారు పాడుచుండఁగానే గోధూళికావేళ యగును. అప్పుడు శ్యాముని వంశీనినాదము వినఁబడును. దానిని వినఁగానే వారిచిత్తము పచ్చబడును. అప్పుడు సమస్త దుఃఖములను మఱచెదరు."

శౌనకుఁడిట్లనెను :- "సూతా! విశ్వవందిత వ్రజాంగనలే గీతములను బాడెడువారు. కొన్నిటిని వానిలో మాకు వినిపింపుఁడు."

సూతుఁడిట్లనెను :- "స్వామీ! వారి గీతములను వారే పాడఁగలరు. నాకు చెప్పుటకు సామర్థ్య మెక్కడిది. అయినను నేను నాశక్తి ననుసరించి నేనాగీతముల ననుకరించెదను. గోపికలు కలిసి పరస్పరము ఒకరినొకరు సంబోధించుకొనుచుఁ బాడనారంభించిరి. వారు పాడుచుండఁగాఁ బ్రేమలో విహ్వాలు లగుదురు. అంత నిద్దరును గలిసి పాడనారంభించెదరు. ఇద్దరు గోపికలు కలిసి పాడుటకు యుగళగీతమందురు.

మ॥ లలనా యేటికిఁ దెల్లవాఱె రవి యేలా తోఁచెఁబూర్వాద్రిపైఁ
గలకాలంబు నహంబు గాక నిసిగాఁ గల్పింపఁడా బ్రహ్మ దా
వలఱేఁడుం గృప లేఁడు కీరములు దుర్వారంబు లెట్లో కదే
కలదే మాపటి వేళయుం గలుగునే కంజాక్షు సంభోగముల్.।

ఉ॥ ఎప్పుడు ప్రొద్దు గ్రుంకు హరి యెప్పుడు గోవుల మేపివచ్చు నా
కెప్పుడు తన్ముఖాంబుజ సమీక్షణ మబ్బు నతండు వచ్చి న
న్నెప్పుడు గారవించుఁదుది యెప్పుడు మద్విరహాగ్ని రాశికిం
జెప్పఁ గదమ్మ బోటి మరుచేఁతల నుల్లము దల్లడిల్లెడిన్.।

మ॥ చెలియా! కృష్ణుఁడు నన్నుఁబాసి వనముం జేరంగ నయ్యేక్షణం
బులు నాకన్నియు నంత నుండఁగదు నాపూర్ణంబులై సాగి లో
పలఁ దోఁచుం బ్రహరంబులై దినములై పక్షస్వరూపంబులై॥
నెలలై యబ్దములై మహాయుగములై నిండారు కల్పంబులై॥

మ॥ అదె భానుండ పరాద్రిఁజేరె నిదె సాయంకాల మేతెంచెన
ల్లదె గోపాద పరాగ మొప్పెసఁగె బృందారణ్య మార్గంబునం
దిదె వీతెంచె వృషేంద్ర ఘోషము ప్రియుండేతెంచె రండంచుఁదా
మెదురేతెంతురు మాపు కృష్ణునికి నయ్యింతుల్ పరిభ్రాంతలై॥

సూతుఁడిట్లనెను:- "మునులారా! గోపికలకు శ్రీకృష్ణ చంద్రుని యెడల నత్యంత ప్రగాఢ అనురాగము కలదు. ఆతఁడు లేకున్న వారికొక్కొక్క క్షణము యుగమువలెగడుచు చుండెను. మన మోహనుని మాధురియందెవరి మనస్సు తన్మయమై కలిసినదో వారిభాగ్యమునుగూర్చి యెవరు చెప్పఁ గలరు? వారి చిత్తము లింకొక వైపునకు పోనేపోవు. శ్యామ సుందరుఁడు వారి సమ్ముఖమునకు వచ్చెనా, వారాతని తదేక దృష్టితో నాతని రూపామృతమునఁ బానము చేయుచుందురు.

ఆతని సంస్పర్శ సుఖముచే సమస్త సంతాపములను మఱచు చుందురు. ఆతఁడు వనమునకుఁ బోయినపుడు వారు మనస్సుతో నాతని రూప మాధురిని, వేణు మాధురిని, లీలా మాధురినిఁ జింతించుచుందురు వాక్కు-ద్వారా ఆతని గూర్చి గానము జేయుచుందురు. పరస్పర మాతనిని గూర్చియే చర్చించుకొను చుందురు. వారందఱిలో రాధాభావ మత్యంత అలౌకికమైనది. ఆమెకు కృష్ణుఁడు లేకున్న సమస్త ప్రపంచమును శూన్యముగఁ దోచును. కృష్ణుఁడు లేకున్న సుందర స్వాదిష్ట పదార్థములామెకు విషతుల్యములుగ నుండును. శ్యాముఁడు లేకున్న సుమనశయ్య శూలశయ్యగ నుండును. శ్యాముఁడు లేకున్న సమస్త భోగములు రాజరోగము(క్షయ) వలె దుఃఖముగ నుండును. గోపికలపని రాధాదేవికి నిరంతరము శ్రీకృష్ణ చర్చను వినిపించుటయే గోపికలకు శ్యాముఁడు సమ్ముఖమున లేక ఒక్క క్షణమైనను గడచుట లేదు. శ్యామ సుందరుఁడు వారి సమ్ముఖమున లేకున్న నందనందనుఁడు వారి నయనములలో నిలిచియుండును. వారు గట్టిగాఁ గన్నులను మూసికొని శ్రీకృష్ణుని బయటకుఁ బోనియఁగూడ దనుకొను చుందురు. ఈ విధముగ నారమణులు నిరంతరమును రాసేశ్వరునితో రమించుచుందురు.

మునులారా! గోపికల అనురాగము అవర్ణనీయము. శ్యామసుందరుని లీలలకేకైక ఉద్దేశ్యము తన కనుగతులగు వ్రజవాసినులకు సుఖమును గలిగించుటయే. అసుర సంహార మాతనికి గౌణకార్యము. అనేక రూపములను ధరించి

అసురులు వచ్చుచుండెడువారు. అసురారి వారిని యమ సదనమునకుఁ బంపెడువాఁడు. ఒక అసురుఁడు ఎద్దుగనై వచ్చెను. ఆతనినిగూడ శ్యామసుందరుఁడు విడువలేదు. ఆతనికిని మృత్యుద్వారమును జూపించెను."

శౌనకుఁ డిట్లడిగెను :- "సూతా! భగవానుఁడు వృషభవేషధారియగు నసురునెట్లు చంపినాఁడు. దయచేసి యీ కథను గూడ మాకుఁ జెప్పుఁడు."

సూతుఁడిట్లడిగెను :- "మంచిది స్వామీ! ఇప్పుడు నేనరిష్టాసురోద్ధారకథను జెప్పెదను. మీరు సమాహిత చిత్తులరై శ్రవణ మొనర్పుఁడు."

## అరిష్టాసురోద్ధార కథ

౧౦౧౧

శ్లో॥ అథ తర్హ్యాగతో గోష్ఠమరిష్టో వృషభాసురః।
మహాఁ మహాకకుత్కాయః కంపయన్ ఖుర విక్షతామ్॥
శ్రీభాగ. ౧౦ స్కం. ౩౬ అ. ౧ శ్లో॥

చ॥ ఖురముల నేలఁద్రవ్వుచు నకుంఠితవాల సమీరణంబులన్
విరవిరఁబోయి మేఘములు విచ్చవిషాణము లొడ్డికొంచు దు
స్తర తరమూర్తియై వృషభ దైత్యుఁడు గన్నుల నిప్పులొల్కఁగా
దురదురవచ్చి తాఁకె రిపు దుర్మదమోచనుఁ బద్మలోచనున్॥
శ్రీమదాంధ్ర భాగవతము.

దుష్టులు మోహక వేషమును వేయుచుందురు. మంచి మంచి వారు వారి మాయలోఁ బడుచుందురు. యుధిష్ఠిరుని

కడకొక నాస్తిక బ్రాహ్మణుఁడు వేషమును వేసికొనివచ్చి అధర్మోపదేశము నొసంగఁ గడంగెను. ఆతఁడు వధింపఁ బడినాఁడు. హనుమంతునిఁ జంపుటకు కాలనేమి సాధువేష మును వేసికొనెను. వేషమునుగాంచి ఆతఁడును మాయలోఁ బడిపోయెను. ఆతనిని గురువుగాఁ జేసికొనుట కుద్యుక్తుఁ డయ్యెను. విషయము తెలియఁగానే గురుపూజతో నాతఁడు పరలోకమునకుఁ బంపఁబడెను. జగజ్జనని జానకియును రావ ణుని సాధువేషయమును గాంచియే అతనిబారిఁ బడెను. ఎవరి సంగతియో యేల సాక్షాత్తుగ మోహినీ రూపమును ధరించిన శ్రీహరియే సురవేషమును ధరించివచ్చిన రాహువు నకు అమృతమును బోసెను. దుష్టులు, ఏ వేషమును వేసి కొనిన నధిక ప్రతిష్ఠకలుగునో తమ స్వార్థ సిద్ధికొఱకు ఆ వేషమును వేసికొని లోకులను మోసగించెదరు. ఇది దుష్టుల స్వభావము. మాయవేషము లెన్నాళ్లో సాగవు. ఎవ్వడో ఒకప్పుడు ఆతని యథార్థరూపము ప్రకటమగును. అట్టి యెడ భగవంతుని కడ మోసమెట్లు సాగును. ఆతఁడు ఘట ఘటముల నెఱిఁగినవాఁడు. ఆతనికి ఛలకపటములును, మోస ములు ఏమియును జేయఁజాలవు; కాని భగవానునికడకు ఛలకపట వేషములను ధరించి వచ్చువారును అదృష్టవంతులే అని తలఁచెదము. సాంసారిక వస్తువులను బొందుటకై వేష ములు వేయు వారును, సాంసారికులను మోసము జేయుటకు ప్రయత్నించువారును నిందనీయులు. మోసము చేయఁదలఁ చిన భగవంతునే మోసము చేయవలయును. వేషమును

వేసికొనఁదలఁచిన దానినాతని సంతోషింపఁ జేయుటకో, కోపింపఁజేయుటకో వేషమును వేయవలయును. ఆతనితో నెట్టి వ్యవహార మొనర్చిన నట్టి మార్గముననే ప్రసన్నుఁడగును. చూడుఁడు. విభీషణుఁ డతనికి కొంచెము సేవ యొనర్చెను. దాని ఫలస్వరూపముగ లంకారాజ్యము నొసంగెను. రావణుఁడు వైరమును బూనెను. ఆతనికి పరమపదము నొసఁగెను. కావున శ్యామసుందరుని క్రోధింపఁ జేసినను, సంతోషింపఁ జేసినను శ్రేష్ఠములు. ఏదో విధముగ జీవుఁడేడ్చి లేక పాడి ప్రేమతోడనో, ద్వేషముతోడనో భగవంతునిసమీపమునకు బోయెనా ఆతనికి కల్యాణమే జరుగును.

సూతుఁడిట్లనెను :— “మునులారా! తీపికి తీపియే తినుట ఉచితము కాదు. మధ్య మధ్య కొంచెముగఁ బచ్చటిని నంజుకొనవలయును రసవత్తరమగు వస్తువులను దినుట వలన విసుఁగు పుట్టును. అప్పుడేదైన, నుప్పుకారములతోఁ జేయఁబడిన పదార్థములను గైకొనవలెను. స్వాదుమారిన మరలఁ దీపిమీఁద కోరిక గలుగును. ఇంతవఱకు మీరు రాసయొక్క సరసలీలలను వింటిరి. గోపికలయొక్క యుగళగీతములనుగూడ రుచి చూచితిరి. ఇప్పుడు మీరు అసురోద్ధారమునకు సంబంధించిన నుప్పు రుచిగల కథను వినుఁడు.”

కంసుని దూతలలో నరిష్టనాముఁడగు నొక యసురుఁ డుండెను. ఆతఁడెక్కడికిపోయిన నచ్చట విఘ్నముల నొనర్చును. దేవతలును నాతని పేరు చెప్పిన భయపడుచుందురు ఒక దినమునఁ గంసుఁడాతనితో నిట్లనెను :—

"అరిష్టా ! నీవు చాల బలశాలివని వింటిని. నీకు చాల మాయలుకూడ తెలుసుననియు వింటిని. నీమాయలేమి పనికి పనికివచ్చును ? కొంచెముగ మాపనిని గూడ చేయుము. దానివలనఁ దెలియఁగలదు."

అరిష్టుఁడిట్లనెను :- "రాజా ! నీవెట్టి మాటలను బలుకుచున్నావు. నీవాజ్ఞాపించినచో నేనెట్టి కఠినాతి కఠిన మైన కార్యములనైనను నీప్రీతి చేయఁగలను. నాకేమియును కఠినమైన కార్యములేదు"

కంసుఁడిట్లనెను :- "నాశత్రువొకఁడు నందవ్రజములో నివసించుచున్నాఁడు. వానినిఁ జంపుటకై నేను జాలమంది అసురుల వేషమును వేయించి పంపితిని. కాని అందొక్కరును తిరిగిరాలేదు. నీవు నాశత్రువునకేమైన ననిష్ట మొనర్చి నచో నీకు నేను జీవితాంతము వఱకు ఋణపడియుందును."

శీఘ్రముగ నరిష్టుఁడిట్లనెను :- "రాజా ! నేను నీకు సేవకుఁడను. ఇప్పుడు నీవు నిశ్చింతుఁడవు కమ్ము. నీశత్రువు చచ్చినాఁడని అనుకొనుము. నా సమ్ముఖమున నాతఁడు దక్కఁడు."

కంసుఁడిట్లనెను :- "ఓరీ ! అతఁడు చాల బలవంతుఁడు. నీవేమి మాయ చేయఁదలఁచితివో నాకు చెప్పుము."

అరిష్టాసురుఁడిట్లనెను :- "నేను కృష్ణుని యెఱుఁగు దును ఆతఁడు గోవులను గాయుచుండును. గోవులకు గొప్పభక్తుఁడు. గోవులను నింద్రుని కోపమునుండి రక్షించెను.

అందువలన సురభి ఆతని గోవిందుఁడను పేరునొసంగెను. కావున నేను గొప్ప యెద్దు వేషమును వైచుకొని పోయెదను. గోవులు, ఎద్దులు వర్ణాశ్రమములకు సర్వథా అవధ్యముగఁ జెప్పఁబడినవి. కావున నాతఁడు నన్నుఁజంపఁజాలఁడు. నేనాతనిఁ జంపి యమసదనమునకుఁ బంపెదను."

కంసుఁడిట్లనెను :- "అతఁడు అతి శీఘ్రముగ గుర్తింపఁగలఁడు. ఒక అసురుఁడు వత్సరూపమును ధరించిపోయెను. దాని నాతఁడు చంపివైచెను."

అవహేళనా స్వరమున నరిష్టాసురుఁ డిట్లనెను :- "అయ్యో! నీవు చిన్నచిన్న నిర్వీర్యులగు నసురులనుగూర్చి చెప్పుచున్నావు. వత్సమును జంపియుండవచ్చును. నేను వత్సముయొక్క తండ్రియగు ఆఁబోతు వేషమును ధరించి పోయెదను. ఆతఁడు నాయెదుటకు వచ్చెనా తప్పించుకొనఁజాలఁడు. నీవు విశ్వసింపుము."

కంసుఁడిట్లనెను :- "మంచిది, మిత్రవరా! నీవు నా శత్రువును జంపివచ్చితివా నీకు నేనర్ధరాజ్యము నొసంగెదను, నీకు విజయము కల్గుగాక!

సూతుఁడిట్లనెను :- "మునులారా! కంసుని ఆజ్ఞను, ఆశీర్వాదములను గైకొని అరిష్టాసురుఁడు బృందావనము వైపునకుఁ బోయెను. ఆతఁడు గొప్ప శరీరముగల యెద్దు రూపమును ధరించియుండెను. ఆతఁడు కదలుచుండిన నీల పర్వతమువలె నుండెను. వ్రజమునకు వచ్చి ఆతఁడు తన

గిట్టలతోఁ బృథివినిఁ ద్రవ్వనారంభించెను. అంకెలు వేయ నారంభించెను. గుఱుగుఱు మనుచుండెను. భయంకర శబ్దములొనర్ప నారంభించెను. గిట్టలతో నేలను గొట్టుచుండెను. కొమ్ములను విసురుచుండెను. అందఱను భయపెట్టసాగెను. గోపగోపికలను జూడఁగానే వారి వైపు పరువిడి, వారి పొట్టలమీఁదను దనకొమ్ములను విసురుచుండెను. చేలలోని కప్పలను, ఆవుల కొట్టములను, ఇండ్ల గోడలను ఆతఁడు తన కొమ్ములతోఁ బొడిచి క్రిందపడవేయ నారంభించెను. క్షణక్షణము మల మూత్రములను విడుచుచుండెను. కన్ను లెఱ్ఱఁజేసి వ్రజవాసులను భయభీతుల నొనర్చుచుండెను.''

ఆతని భీషణభయంకర శబ్దమువలన గోవులయొక్కయు స్త్రీలయొక్కయు గర్భములు జారిపోవునట్లుండెను. చాల మందికి గర్భస్రావము జరిగెను. చాలమంది మూర్ఛితులైరి. వ్రజవాసు లాభయంకర జంతువును జూడఁగనే భయపడి అటునిటుఁ బారిపోనారంభించిరి. చాలమంది యేడ్వసాగిరి. కేకలు వేయఁదొడంగిరి. అందఱును దానినిఁ గదలుచుండిన నీలాంజన పర్వతమనుకొనుచుండిరి. ఇతరుల సంగతియేల? వాయువులో నెగురుచుండిన మేఘమును దానినిఁ బర్వతమనుకొని దాని దగ్గఱ ఆగెడిది. ఏదో భయంకర విపత్తు వచ్చినదని వ్రజవాసు లనుకొనిరి. ఈ విపత్తునుండి శ్రీకృష్ణుఁడు తప్ప ఇంకెవరును నీ విపత్తునుండి రక్షింప లేరనుకొని వారందఱును శ్రీకృష్ణుని శరణువేఁడిరి. వా

రందఱును నార్తులై దీనస్వరమున నిట్లనిరి :- ఓ భక్తవత్సలా! ఓ ప్రణతపాలకా! ఓ భక్తభయహారి భగవాన్! మమ్ము లను రక్షింపుము. రక్షింపుము ఈ కాలరూపమగు వృష భమునుండి మమ్ములను రక్షింపుము."

భగవానుఁడు దూరమున నుండియే యిట్లనెను :- "భయపడకుఁడు. భయపడకుఁడు. నేనీ దుష్టునిప్పుడే యమ సదనమునకు బంపెదను. ఇప్పుడే వీని యీ దుష్టతకు ఫల మును రుచి చూపించెదను" అని పలికి భగవానుఁడు అరిష్టా సురు నెదుటకు వచ్చెను.

భగవానునిఁ జూడఁగనే దుష్టుఁడగు అరిష్టుఁడిట్లనెను: "బాఁ బాఁ"

శ్రీకృష్ణుఁడు "ఆఁ ఆఁ" అనెను.

గిట్టలతో భూమిని త్రవ్వుచుఁ దోఁకనెత్తుకొని, కన్ను లెఱ్ఱఁజేసి, శిరస్సును క్రిందకు వంచి, కొమ్ముల నాడించుచు నది ఱంకెలు వేయసాగెను. అది భగవానుని యుద్ధము కొఱకు కవ్వించుచున్నట్లుండెను. అప్పుడు భగవానుఁ డిట్లనెను :- "ఒరే, వినుచున్నావటరా దుష్టా! నేను నీకు జిక్కువాఁడనుగాను. నీవు తలఁచియుండవచ్చును నీ యెద్దు రూపమునుజూచి చంపనని. ఇది నీ పొరపాటు. నక్కసింహపు చర్మమును గప్పుకొనిన నది సింహము కాఁబోదు. చాఁకలి వాఁడు రాజ వస్త్రములను వేసికొనిన నాతఁడు రాజు కాఁజాలఁడు. ఉన్మత్త తాను కనక నామమును ధరించిన

నడి కనక కుండలాది ఆ భూషణములు కాఁబోదు. ఓసీ! మందమతీ! నేను నీ యొక్క అంతర్బాహ్య విషయయములను బాగుగా నెఱుఁగుదును. నీవు ఆఁబోతువు కాదు. నీవు అరిష్టాసురుఁడవు. నీవు యెద్దు వేషమును వైచుకొంటివి. నీవు మహాదుష్టుఁడవు. నీ అంకెలచే నీ అమాయకపు వ్రజ వాసుల నేల భయపెట్టుచున్నావు. దీనిలో నీ కేమి పురుషార్థమున్నది. నీలో నేమైన బలము పురుషార్థమున్నచో నీవు నా సమ్ముఖమునకు రమ్ము నీవు నాకు నీ బలమును జూపించుము. నీ మాయను నాకు జూపింపుము. నా హృదయమును గదలించుము. నేను నిన్నెదిరించుచున్నాను. మన మిద్దరమును జేతులను గలుపుదము. నేను నీ పని పట్టించెదను. నేను నిన్నుఁ బచ్చడి చేసెదను, నేను నీ దుష్టత్వము యొక్క ఫలమును రుచిచూపెదను. నేను నీ దర్పమును నాశనమొనర్చెదను. నేను నీ కన్నులలో దుమ్ము కొట్టెదను. నేను నీ గర్వము నణఁచెదను." ఇట్లు పలికి భగవానుఁడు గోచిబిగించి, తొడలు చఱచి నిలుచుండెను ఆతఁడు పోరుటకు విశేష ప్రయాసమేమియును గావింపలేదు. ఆతఁడట్లే ఆతనితోఁ బోరుటకు నవ్వుచునే ఉద్యుక్తుఁడయ్యెను.

అసలు విషయమేమనఁగా నాతఁడు నూనెను మర్దించుకొని, దండెముల వ్యాయామ మొనర్చి యమునా స్నానము కొఱకు వెడలుచుండెను. ఒక సఖుని భుజముపైఁ జేయివైచుకొని యుండెను. అదృష్టవంతుఁడగు నాగోప కుమారుని భుజముమీఁద సర్పమువలె గుండ్రముగా బల

ముగానున్న భుజములను వైచియుండెను. ఆవిధముగ భుజమున్మీఁదఁజేయి వేసియే అరిష్టాసురునిఁ గన్గొంచెను. అతని సవాలుచేఁ గ్రుద్ధుఁడై దుష్టుఁడగు నరిష్టాసురుఁడు సర్పమువలె బుసలు కొట్ట నారంభించెను. ఇంకను ముక్కులతో హుఁ హుఁ అని శబ్దము చేయసాగెను. ముందుకాళ్ల నెత్తి వెనుకకాళ్లతో దుమ్ము రేపుచుఁడన తోఁకను నాకాశముఁ ద్రిప్పుచు మేఘములను ద్రిప్పుచు నాతఁడు భగవంతుని వైపునకు పరుగెత్తెను.

భగవానుఁడు సఖుని భుజమును వదలి తాళమును గొట్టి యిట్లనెను :– "రారా ! నీచుఁడా ! నీవును నీతోడి వారగు నసురులకడకుఁ బోయెదవు"

ఇది విని ఆతఁడు గుంద్రముగను నెత్తుపల్లముగనున్న తన సూదివంటి కొమ్ములను కుందేలు రక్తమునంటి తన యెఱ్ఱని నేత్రములనుండి తీక్ష్ణ కుటిల దృష్టులతో దామోదరుఁ గాంచుచు శీఘ్రముగ నాతనివైపునకుఁ బరువిడెను. భగవానుని అంగములుపొంగెను ఆతఁడా దుష్టునితోఁ గలియఁబడెను. దుమికి ఆతఁడాతని కొమ్ముల రెంటిని బట్టుకొనెను. కొమ్ములను బట్టుకొనుటచే నాదైత్యుఁడు విదిలించుకొనసాగెను. భగవానుఁడాతని నొక్క దెబ్బ దీసెను. దానివలన నాతఁడు క్రిందఁబడెను; భగవానుఁడు వెంటనే నాని నలిపివైచెను. భగవానుని ప్రహారమును భరించలేక ఆదైత్యుఁడు నోటినుండి రక్తమును గ్రక్కుచుఁదన్నుకొన నారంభించెను. ఆతని గ్రుడ్లు వెళ్లుకొని వచ్చెను. పాద

ములు తన్నుకొన నారంభించెను. అల్పకాలములోనే ఆతఁడు చచ్చి క్రిందఁబడెను. ఆతఁడు చావఁగానే దేవతలు మిక్కిలి ఆనందించిరి. భగవానునిపైనఁ గల్పవృక్ష పుష్పములను వర్షింపసాగిరి.

సూతుఁడిట్లనెను :- "వినుఁడు దుష్టుఁడగు నరిష్టాసురుఁడు చాల గొప్ప బలవంతుఁడు. దేవతలకు శత్రువు. ఆతఁడు సమస్త హృదయములందును గంటకమువలె గ్రుచ్చుకొనుచుండెను. ఆతఁడు చావఁగా సమస్త ప్రజలును పరమానందమును జెందిరి. ఆతఁడు చావఁగా కంసుఁడు మిక్కిలి దుఃఖించెను. ఇప్పుడాతఁడసురులను బంపుట నాపివైచెను. ఆతఁడిట్లనుకొనెను :- "నేను మోసమునను గపటమునను బలరామకృష్ణుల నిచ్చటికిఁ బిలువఁగూడదు? అక్రూరుఁడు నాకు దానపతి. దానాధ్యక్షుఁడు. అతనినే వ్రజమునకుఁ బంపెదను. ఆతఁడేదోవిధముగ వారినిద్దరినిఁ దీసికొని రాఁగలఁడు. ఇచ్చటికి వచ్చిన తరువాత నేను వారి నిద్దరిని అనేకోపాయములచేఁ జంపించెదను." ఇట్లాలోచించుకొని ఆతఁడు మిక్కిలి ఆదరముతో నక్రూరునిఁ బిలిచెను. ఆతనితో వ్రజమునకుఁ బోవు ప్రస్తావమును గావించెను."

# కంసుఁడు మంత్రులతో నాలోచించుట

౧౦౧౨

శ్లో॥ అమాత్యాన్ హస్తిపాంశ్చైవ సమాహూయాహ భోజరాట్।
భో భో నిశమ్యతామేతద్వర చాణూర ముష్టికౌ॥
నందవ్రజే కిలాసాతే సుతావానక దుందుభేః।
రామకృష్ణౌ తతో మహ్యం మృత్యుః నిదర్శితః॥

శ్రీ భాగ. ౧౦ స్కం, 36 అ, ౨౨,౨౩ శ్లో॥

వ. మంత్రి భటగజారోహ చాణూర ముష్టిక సాల్వ కోసల ప్రముఖుల రావించి యిట్లనియె.

శా॥ ఎందున్ నన్నెదిరించి పోరుటకు దేవేంద్రాదులుం జాలరీ
బృందారణ్యము మంద నిప్పుడు మదాభీరార్భకుల్ రామ గో
విందుల్ వర్ధిలుచున్న వారఁట రణోర్విం గంసు మర్ధింతు మం
చుం దర్పంబులు వల్కుచుందురఁట యీ చోద్యంబులన్ వింటిరే॥

శ్రీ మదాంధ్ర భాగవతము.

ఏది జరుగనున్నదో ఆ సూచనలు ముందుగానే గోచరించుచుండును. అట్లే దానికి తగినట్లు త్రోవయేర్పడును. చెడ్డ జరుగవలసియుండిన దానికెన్ని ఉత్తమోపాయముల నాలోచించినను బ్రయోజనముండదు. మంచి జరుగనుండిన సాధారణోపాయములును నుత్తమోత్తమములగును. మానవుఁడు తన బుద్ధితోనే కార్యము నొనర్చినను సుఖముకొఱకే చేయును. దానివలన దుఃఖము సంభవించినచో నది ప్రారబ్ధకర్మయొక్క దోషమే. దొంగ దొంగతన మొనర్చినను,

జారుఁడు జారత్వ మొనర్చినను ఆ సుఖముకొఱకే చేయును. లోకులందఱును నీ కార్యములను జెడ్డవను చుండుటచే రహస్యముగఁ జేయుచున్నాఁడు. దానికిఁ జెడ్డ పరిణామము సంభవించినప్పుడు నరకాదులకుఁ బోయి యాతనల ననుభవించును. అప్పుడు దుఃఖము కలుగును. అయ్యో! నే నిట్టి పని నేలఁ జేసితినని అప్పుడు దుఃఖించును. ఏ కార్యమున దుఃఖము సంభవించు ననుకొనునో దానిని మానవుఁ డెన్నటికినిఁ జేయఁడు.

సూతుఁడిట్లనెను :— "మునులారా! ఇంతవఱకు మీకు నేను గోకుల బృందావన లీలలనుగూర్చి చెప్పితిని. బృందావన లీల లనంతములు. వాని వర్ణనమును నేను బూర్తిగాఁ జేయఁజాలను. ఇప్పుడిఁక మధురాలీలలనుగూడ వినుఁడు. కంసమామమీఁదఁ గొంచెముగ దృష్టి నుంచుఁడు."

ఎద్దు వేషము వైచుకొని పోయిన అరిష్టాసురుఁడును జంపఁబడెనను విషయమును గంసుఁడు వినఁగానే ఆతనికి మిక్కిలి చింతకలిగెను. ఆతని మనస్సు చింతచెందెను. ఆతఁడు మాటిమాటికి నిట్లనుకొన నారంభించెను :— "ఇప్పుడేమి జరుగవలెను. మన శత్రు వెట్లు చంపఁబడవలెను?" వ్రజమునఁ దన శత్రువు కలఁడని కంసునకుఁ దెలియును. నీ శత్రు విచ్చట నెచ్చటనో పుట్టినాఁడని యోగమాయ చెప్పనే చెప్పినది. అందువలనఁ బూతనచేఁ బదిరోజుల లోపు పిల్లల నందఱను జంపించిన వానిలోఁ దన శత్రువును జచ్చియుండునని ఆతఁడనుకొని పూతనను బంపెను. కాని పూతనయే

చంపఁబడినది. ఈ నందనందనుఁడే తన శత్రువని ఆతనికి ఆతనికి నిశ్చయమయ్యెను. ఇప్పుడకారణముగ నందకుమారు నెట్లు చంపింపఁగలఁడు? ప్రజ లందఱాతనికి విరుద్ధమయ్యెదరు. అందువలన నాతఁడనేకులను అసురులను విచిత్ర విశేషములను వైచి పంపుచుండెను. వారందఱును భగవానునిచేతఁ జచ్చు టచే నుద్ధారము కలిగెను. ఇప్పుడు కంసునకు మిక్కిలి చింత కలిగెను. ఆతనికి భయముచే రాత్రులందు నిద్ర పట్టుట లేదు. ఎప్పుడైన నొక్క కూర్కును వేసినను ఆత నికి మృత్యు సూచకములగు స్వప్నములు వచ్చుచుండెడివి. ఆతఁడు స్వప్నములో విచిత్రదృశ్యములను జూచుచుండెడు వాఁడు. ఒకానొక రాక్షసుఁడు వికరాళ వేషమునుధరించి ఆతని వైపునకుఁ బరువిడి వచ్చుచున్నట్లు కనఁబడెను. ఆతఁ డెఱ్ఱని వస్త్రమును ధరించి యుండెను. ఎఱ్ఱని గంధమును నలఁదుకొని యుండెను. ఎఱ్ఱని పూలమాలను ధరించెను. స్వప్నమందు రక్తవస్త్రమును ధరించిన స్త్రీనిగాని, పురుషుని గాని చూచుట అశుభము. ఒకానొకప్పుడొక చండాల విధవస్త్రీని నల్లని వస్త్రమును ధరించి ఆతని నాలింగన మొనర్చుటకుఁ బరువెత్తు చున్నట్లుండెను. ఒక్కొక్కప్పుడు మ్లేచ్ఛుఁడొకఁడు నరకపాలము నిచ్చు చున్నట్లుండెను. ఇంకొకప్పుడు ఒకానొక సౌభాగ్యవతియగు స్త్రీ పూర్ణజల కుంభమును బగులఁగొట్టి శాపమిచ్చు చున్నట్లు కనఁబడు చుండెను. ఒక్కొక్కప్పుడు ఒక బ్రాహ్మణుఁడెఱ్ఱని పూల మాలలను ధరించి, రక్తచందనము నలఁదుకొని శాప మొసంగు

చున్నట్లు చూచుచుండెను. ఒక్కొక్కప్పుడంగార వృష్టి యును, భస్మ వృష్టియును, రక్తవృష్టియును గలుగుచుండు టను గాంచెను.

ఒక్కొక్కప్పుడు స్వప్నములోఁ గ్రొత్త పెండ్లికూతురు కాకి, కుక్క, పంది మొదలగునవి అశుభ శబ్దములొనర్చు చుండుటను గాంచెను. ఇట్టి యశుభ స్వప్నములను గాంచు టచే నాతనికి భీతియును, జింతయును నెక్కుఁడయ్యెను. ఆతఁడు సదా ఉద్విగ్నుఁడై యుండెను. నేఁడాతఁడు ఖిన్న మనస్కుఁడై సభలోఁ గూర్చుండి యుండెను. ఇదే సమ యములో వీణను వాయించుచు, హరి గాన మొనర్చుచు దేవర్షి నారదుఁడచ్చటికి వచ్చెను. కంసుఁడు దేవర్షికి యథోచిత స్వాగత సత్కారము లొనర్చెను. మహాముని కంసుని పూజాసత్కారములను స్వీకరించి, ఆతని కుశలమడిగి యిట్లనెను :- "రాజా ! నేఁడు నీవు చాల దుర్బలుఁడవై నట్లు న్నది. ముఖము వాడిపోయినది. శరీరము పాలిపోయినది. ముఖముమీఁదఁజింతా చిహ్నములు స్పష్టముగఁ గనఁబడు చున్నవి. నాకు నీదుఃఖమునకుఁ గారణమును జెప్పుము."

చేతులు జోడించుకొని కంసుఁడిట్లనెను :- "భగవా మీరు సర్వజ్ఞులరు మీకు తెలియని విషయమేమ వ్రజములో నాశత్రువు ఉన్నాఁడని నేను విన్నాన గోపరాజగు నందుని పుత్రుఁడుట. ఆతఁడు నందలను జంపివైచినాఁడు. ఇంతలోనే

రులు పోఁగా నందఱును బరలోకవాసులైరి. ఒక్కరును తిరిగిరాలేదు. నందకుమారుఁడు చాల గొప్ప బలవంతుఁడని తోఁచుచున్నది."

నారదుఁడిట్లనెను :- "రాజా! కృష్ణుని నీవు నందుని కుమారుఁడని యేల పల్కెదవు? ఆతఁడు నందకుమారుఁడు కాఁడు."

ఆశ్చర్యముతోఁ గంసుఁడిట్లనెను:- "అయితే శ్రీకృష్ణుఁ డెవని పుత్రుఁడు స్వామీ!"

నారదుఁడిట్లనెను :- "రమ్ము, నేను నీకొక గుప్త విషయమును జెప్పెదను. ఇది అందఱును వినఁదగినది కాదు. లోపల నేకాంతమున నేను నీకన్ని విషయములను జెప్పెదను."

ఇది విని కంసుఁడు మిక్కిలి యుత్సాహముతో నారదునితోఁ గూడి లోనికి వెడలిపోయెను. అచ్చటికి పోయిన తరువాత నారదుఁడిట్లనెను :- "రాజా! నీ వెవరిని నందపుత్రుఁ డనియు నంద నందనుఁడనియు ననుచున్నావో ఆతఁడు నంద పుత్రుఁడు కాఁడు. వసుదేవుని పుత్రుఁడు."

ఆశ్చర్య చకితుఁడై కంసుఁడిట్లనెను :- "స్వామీ! మీరెట్టి మాటలు మాటలాడుచున్నారు? దేవకీ వసుదేవు లను నేను వివాహమైన తరువాతఁ గారాగృహములో బంధించితిని. ఆతని పుత్రులనందఱను నేను జంపివైచితిని."

నారదుఁడిట్లనెను :- "నీవాతని యేడ్గురు పుత్రులను మాత్రమే చంపితివి. ఎనిమిదవ వానినిఁ జంపలేదు. శ్రీకృష్ణుఁడాతని యెనిమిదవ పుత్రుఁడు."

కంసుఁడిట్లనెను :— "స్వామీ! ఎనిమిదవది కన్యక. కావలివాండ్రు నాకు చెప్పఁగానే నేను కారాగృహముకడకు బోయితిని అచ్చట నాకన్యను దేవకి వడినుండి బలవంతముగ లాగుకొని రాతిమీఁద వేసికొట్టితిని. అప్పుడామె చతుర్భుజ దేవియై యిట్లనెను :— "నీ శత్రువిచ్చటెచ్చటనో పుట్టినాఁడు."

నారదుఁడిట్లనెను :— "ఎచ్చటనో పుట్టలేదు. ఇచ్చట వసుదేవుని యింటనే పుట్టినాఁడు. పుట్టగానే వసుదేవుఁడాతని నందుని భార్యయగు యశోదయొక్క ప్రసూతి గృహమున నుంచి, అచ్చటనప్పుడే పుట్టిన కన్యనచ్చటినుండి తెచ్చినాఁడు. నీవే కన్యను జంపితివో, ఆమె నందుని కూఁతురు. వసుదేవుని అష్టమ పుత్రుఁడు శ్రీకృష్ణుఁడే. వసుదేవునకు రోహిణి యను నింకొక భార్యకలదు. ఆమె గర్భవతి. ఆమెనుగూడ మిత్రుఁడగు నందుని యింటికాతఁడు పంపినాఁడు. బలరాముఁడామె పుత్రుఁడు, ఈ రామకృష్ణులిద్దరే నీవు పంపిన నసురులందఱను జంపినారు."

ఇది వినఁగానే కంసునకు మిక్కిలి కోపమువచ్చెను. ఆతఁ డిట్లనుకొనెను :— "వసుదేవుఁడు సత్యవాదియని నే ననుకొన్నాను. ఈతఁడు నను మోసము చేసినాఁడు. నేఁడు నే నీతనిఁ జంపివేయుదును." ఇట్లని ఆతఁడు ఖడ్గమును దీసికొని వసుదేవునిఁ జంపుటకు బయలుదేరెను. అప్పుడాతఁడు నారదునితో నిట్లనెను :— నీ వందఱ యెదుటను వసుదేవుఁడు దోషియని ఋజువుచేసి, కారాగృహములో నాతని బంధింప

వలయును. చంపుట మంచిదికాదు. నీ వందఱి సమక్షమున వసుదేవ్రుఁడు మోసముచేసిన విషయమును చెప్పవలయును." నారదుని యీ మాటలను విని ఆతఁడు సమస్త మంత్రులను, సభాసదులను, ఇష్టమిత్రులను, ముఖ్యులగు సేవకులను బలిచెను. ముష్టిక, చాణూర, శల, తోశల, హాస్తిప, మొదలగు మంత్రులనందఱను బిలిచి ఆతఁడిట్లనెను:- "సోదరులారా! ఇప్పుడు నేను చెడ్డ చెడ్డ స్వప్నములను గాంచుచున్నాను. రాత్రులందు స్వప్నమున నాకు వానరములు కనఁబడుచున్నవి. ఆరిన నిప్పులు, కోపముతో లక్ష్మి, పాశహస్తుఁడగు యముఁడు, కనఁబడుచున్నారు. దిగంబరలై జడలు విరియఁబోసికొని నాట్యము చేయుచున్న స్త్రీలను గాంచుచున్నాను. వారు నన్నుఁగాంచి నవ్వుచున్నారు. ముక్కు తెగిన చండాలస్త్రీ దిగంబరయై కనఁబడుచున్నారు. నెత్తురును గ్రక్కుచున్న మనుష్యులు కనఁబడుచున్నది. రాహుగ్రస్తులగు చంద్రసూర్యులు కనఁబడుచున్నారు. ఉల్కాపాతములు, ధూమ కేతువులు, భూకంపములు, రాష్ట్ర విప్లవములు, ఝంఝా వాతములు ఇంకను నానా విధములగు మహోత్పాతములు నాకు గనఁబడుచున్నవి. తలలు తెగిన పురుషులును, వాయు కంపమునఁ బడుచుండిన పర్వతములును, తెగులబడుచుండిన ఘటములును. నాశ్రమములును గనఁబడుచున్నవి." ఇట్టి భయంకర స్వప్నములకుఁ గారణమేమి?"

కంసుని యీ వాక్యములను విని అందఱును మెదలకుండిరి. అందులో శుక్రాచార్యుని శిష్యుఁడు సత్యకుఁడను

బ్రాహ్మణుఁడుండెను. కంసుని పురోహితుఁడాతఁడే. ఆతఁడిట్లనెను:- "రాజా! నీవు భయపడకుము. నేనీ యనిష్టముల నన్నిటిని శాంతింపఁజేసెదను. నీవు ధనుర్యాగమను శివ యజ్ఞము నొనర్పుము. ఈ యజ్ఞమునకుఁ ప్రధాన దేవత రుద్రుడు. ఆ యజ్ఞ మొనర్చుటచే నాధి భౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక దుఃఖములన్నియును దూరము కాఁగలవు. అన్ని అశుభములును నాశనమగును. యజ్ఞ సమాప్తియందు సాక్షాత్తుగ శంకరుఁడు ప్రత్యక్షమై నీకు జరామృత్యు రహితమగు వరములొసంగును. నీవు సమస్త సంపదలను బొందఁగలవు నీ యశుభము లన్నియును నాశనమగును. ఈ యజ్ఞమును బాణాసురుఁడును, నందియును, పరశు రాముఁడును, ఇంకను ప్రసిద్ధులగువారును జేసిరి. నీ వద్ద నున్న శివధనుస్సును మొట్టమొదట శివుఁడు నందీశ్వరున కొసంగెను. యజ్ఞ మొనర్చి నందీశ్వరుఁడు బాణాసురున కొసంగెను. బాణాసురుఁడు పరశురామున కొసంగెను. పరశురాముని నుండి నీకు లభించినది. నీవీ యజ్ఞమున కందఱ నాహ్వానింపుము. శివధనుస్సు అమోఘమైనది. దాని నెవరును విఱువఁ జాలరు. ఈ ధనుస్సు నెవరైన విఱిచిన యెడల యజమానునకు నాశము కలుగును. యజ్ఞము నిర్విఘ్నముగ సమాప్తమైనచో నీవజరామరుఁడవును, వ్యాధి రహితుఁడవు నయ్యెదవు.

సూతుఁడిట్లనెను :- "మునులారా! కంసుని కిది నచ్చెను ఆతఁడు ధనుర్యాగము నొనర్చుటకు-శివచతుర్దశిని-

నిశ్చయించుకొనెను. దీనికొఱకై ఆతఁడన్ని చోట్లకును నాహ్వానమును బంపెను. ఆతఁడిట్లనుకొనెను :- "ఈ యవసరమున నేదో విధముగ రామకృష్ణులను బిలిచి వారినిఁజంపివేయుదును. కావున వారిని వ్రజమునుండి పిలిపించుటెట్లని ఆతఁడాలోచించుచుండెను."

## కంసుఁడు ధనుర్యాగముం జేయఁబూనుట

౧౦౧౩

శ్లో॥ ఆరభ్యతాం ధనుర్యాగ శ్చతుర్దశ్యాం యథా విధి।
విశసంతు పశూన్మేధ్యాన్భూత రాజాయ మీఢుషే॥

భాగ. ౧౦ స్కం. ౩౬ అ ౨౬ శ్లో॥

క॥ పశువిశసనములు సేయుఁడు
పశుపతికిం బ్రియముగాఁగ భావించి చతు
ర్దశినాఁడు ధనుర్యాగము
విశదంబుగఁ జేయవలయు విజయము కొఱకున్॥

శ్రీమదాంధ్ర భాగవతము.

ఎవరైన నేదైనఁ గోరికతో దేవపూజోపాసనములు చేయుచు నవి సవిధిగ నొనర్పఁబడినచో వారికా కోరిక నెఱవేరును. కాని దంభ మొనర్చుచుఁ బూజాయజ్ఞముల పేరనఁ బాపమొనర్చినచో, నెవరినైన హింసఁజేయఁదలఁచినచో వారే మరణించెదరు. ఎవరినిఁ బూజించుచున్నామో ఆతనికి మన మనోగతభావములు తెలియవా? కాని ప్రాణి స్వార్థమున నన్నిటిని మఱచునంతటి అంధుఁడగును. బంధు బాంధ

వులను, ఇష్టమిత్రులను, తన సంబంధులను ఇంతెందులకు సర్వజ్ఞుఁడగు భగవానునైనను మోసగింపఁదలఁచును. వారికిని నేదో లంచమిచ్చి తనవైపునకు లాగుకొనఁ జూచును; కాని భగవంతుని నెవరు మోసగింపఁగలరు? ఆతఁడు ఘటఘటము లలోని సంగతుల నెఱుఁగును. మోసగాండ్రకు మోసము రూపముననే దర్శన మొసంగును. సరళునకు సరళరూపమున దర్శన మొసంగును. నన్నెవరే రూపమున భజించెదరో వారికా రూపమున దర్శన మొసంగుదునని భగవానుఁడు ప్రతిజ్ఞను జేసియున్నాఁడు

సూతుఁడిట్లనెను :- "మునులారా! శుక్రాచార్య పుత్రుఁడగు సత్యకుఁడు కంసునితో ధనుర్యాగము చేయుమని ప్రస్తావింపఁగనే కంసుఁడందఱితో నిట్లనెను :- "మంచిది, ధనుర్యాగము శివచతుర్దశికి జరుగవలయును. ఇప్పటి నుండియే దానికేర్పాట్లు చేయవలసియున్నది. యజ్ఞముతోఁ బాటుగా దేశవాసులందఱును గాంచి సంతోషించునట్లైన మనోరంజక కార్యము నేర్పాటు చేయవలెను. అందఱకును మనోవినోదము కలుగవలెను. చెప్పుఁడు. ఏ కార్యక్రమము నేర్పాటు చేయుదుము?

అంతఁగంసుఁడు తయారుచేసిన మల్లుఁడిట్లనెను :- "మహారాజా! మల్లయుద్ధము జరుగవలెను. ద్వంద్వయుద్ధ మును జూచుట కన్ని శ్రేణులవారికిని ఇష్టముగ నుండును. దీనిలో అందఱకును మనోరంజనము కలదు. ఇద్దరు మల్లులు పోరాడుచుండిన దర్శకులకు జయాపజయముల విషయములో

నుత్సుకత యుండును. కొందఱొకఁడు జయింప వలయునని
యుఁ గొందఱింకొకరు జయింపవలయుననియు ననుకొను
చుందురు. ఈయజ్ఞముతోఁ బాటుగాఁ గుస్తీయును ఉండ
వలయును. సాధారణముగ ప్రజమందీ మల్లయుద్ధమే
మనోరంజకముగ నుండునని భావించెదరు. మల్లయుద్ధమున
గెలుచుటకై మల్లులు శరీరమును నెంతోకాలమునుండియో
పుష్టి యొనర్చుకొనుచుందురు." దీనివలన మనోరంజనమునకు
మనోరంజనమును గలుగును, ప్రజలయొక్క ఆరోగ్యమును
జక్కఁబడును."

ఇదివినియానందమును బ్రకటించుచుఁ గంసుఁడిట్లనెను:-
"మంచిది, యజ్ఞముతోఁ బాటుగా మల్లయుద్ధమును నుండు
గాక ! నేఁటి నుండియే యజ్ఞముయొక్కయు, మల్లయుద్ధము
యొక్కయును బ్రయత్న మొనర్పవలయును. చక్కని వెడ
ల్పైన గోదాను ద్రవ్వవలయును. దానినిఁ మెత్తని, పచ్చని
మట్టితో నింపవలయును. దానిని ప్రతిదినమును బాఱతోఁ
దిరుగవేయుచుండ వలయును. దానిలో నొక్క రాతిపలుకైన
నుండరాదు. దానికి నలువైపులను బొంగులను బాతవల
యును. గొప్పగొప్ప మొత్తైన నాసనములను దెప్పింపవల
యును. వానినిఁ జక్కఁగ నలంకరింపవలయును. వానిమీఁద
బహు మూల్యములగు నాసనములను బరువవలయును.
యోగ్యతల ననుసరించి వాని నలంకరింపవలయును. ఆసన
ములు గోళాకారముగ నుండవలెను అందఱును మల్లయుద్ధ
మును బాగుగాఁ జూడఁగలిగి యుండవలయును. స్త్రీలు

కూర్చుండుటకు వేఱుగా నేర్పాటు చేయవలయును. వారి ఘోషాను కాపాడుటకై అందఱును వారు చూడఁగలిగి యుండ వలయును. వారి నెవరును జూడకుండవలయును. రంగస్థల ములో సమస్త పురవాసులను, రాజ్యమందలి సమస్త జనమును సుఖముగఁ గూర్చుండి యుద్ధమును జూడఁగలుగునట్లుగ నతి విస్తృతముగ నుండవలయును. వ్రజమండలములో మల్ల యుద్ధమును జేయఁగలవారి నందఱను బిలిపింపవలయును. మల్లు లెచ్చట నున్నారు?"

రాజు మాటలను విని మల్లులు బాగుగాఁ బోట్లాడఁ గల మల్లుల పేర్లను జెప్పిరి. అంత స్వయముగఁ గంసుఁ డిట్లనెను:- "నందరాజ వ్రజమందును జాలమంది గోపకులలోఁ బ్రసిద్ధినిఁ జెందిన మల్లులున్నారని వింటిమి. నందుని కుమా రులు రామకృష్ణు లిద్దరును గొప్ప మల్లురని వినియున్నాము. ద్వంద యుద్ధమును వారితోఁ చేయఁగల వారెవరును లేరు. మీ రందఱు నిష్టపడుచో వారినిగూడ పిలిపింప వలయును నందుఁడు మనకు మండలీక సామంత రాజే. అతఁడు సమస్త గోపకులతోఁ గలిసి రాఁగలఁడు. ఆతని కడకు ప్రత్యేకాహ్వాన మును బంపవలయును. మనకుఁ బ్రతినిధియై ఎవరైన నొక ప్రసిద్ధమగు వ్యక్తి రామకృష్ణులను దీసికొనిరావలయును."

మంత్రులిట్లనిరి:- "మహారాజా! మీ ఆజ్ఞ ప్రకా రమే జరుగఁ గలదు" కంసుఁడుశుక్రాచార్యుని శిష్యుఁడును, దనకు పురోహితుఁడు నగు సత్యకునితో నిట్లనెను:- "విప్ర వరా! నీవు బృందావనమునకుఁ బోయి నందునితో సహా

ఆతని యిద్దరు పుత్రులగు రామకృష్ణులను దీసికొని రమ్ము. వారిని దీసికొని వచ్చుటకు నా సువర్ణమండిత రథమును దీసికొని పోవలయును."

సత్యకుఁడిట్లనెను :– "రాజా! మీ రేమి ఆజ్ఞాపించిన నేను దానినే చేసెదను; కాని యిచ్చట నాకు యజ్ఞకార్యము మిక్కిలిగ నున్నది. సమస్త సామగ్రులను బ్రోవుచేయవలయును; కావున నీ వసుదేవుని బృందావనమునకుఁ బంపిన బాగుండును. ఈతనికి నందునితో మైత్రియును గలదు. ఇద్దరికిని స్నేహామును గలదు. ఈతఁడు మన యదుకులమునఁ బ్రతిష్ఠను జెందినవాఁడు. మీకు బంధువు. మీకు ప్రతినిధి యీతఁడే కాఁగలఁడు. లేదా అక్రూరునేపంపుఁడు. వీరిద్దరును వచ్చుటకి వెళ్ళుటకు సర్వథా సమర్థులు."

ఇది విని కంసుఁడు వసుదేవునితో నిట్లనెను :– "బావగారు! మీ రేపొండు. మీరు నీతిశాస్త్ర విశారదులు. ధర్మజ్ఞులు. మాకు మాన్యులు. జ్యేష్ఠులు. శ్రేష్ఠులు. మీరు నా రథమును దీసికొనిపొండు. నందునకు నా సందేశమును జెప్పుఁడు. ధనుర్యాగ విషయము లన్నియును జెప్పుఁడు. నందుని వృషభానుని, నందనుఁడగు శ్రీకృష్ణ చంద్రుని, ఆతని యన్నయగు బలరాముని, అన్య సమస్త వ్రజవాసులగు గోపకులను మీరు తీసికొని రావలయును. కృష్ణచంద్రుని, బలరాముని ఆదర పూర్వకముగ నా రథమందు గూర్చుండఁ బెట్టుకొని తీసికొని రావలయును. ఇంక నితరులును జాల మంది దూతలకు ఆహ్వాన పత్రికలొసంగి నలుదిశలకును బంప

వలయును. రాజులను, యాజ్ఞిక బ్రాహ్మణులను, ముని గణమును సంఘమును నాదరపూర్వకముగఁ బిలుచుకొని రావలయును."

ఇది వినఁగానే వసుదేవున కానందమయ్యెను. యజ్ఞమను నది యుద్ధమునకు నెపమని ఆతనికిఁ దెలియును. వాస్తవమున నతఁడు నా పుత్రుఁడగు శ్రీకృష్ణుని నేదో విధముగఁ జంపఁ జూచుచున్నాఁడు. నేను వ్రజమునకుఁబోయి నందునితోఁ గృష్ణునిగూడ తీసికొనివచ్చినచో నవశ్యము ఇద్దరకును బోరు కలుగును. కంసుఁడు శ్రీకృష్ణునిఁ జంపినచో నీతఁడెక్కడ తండ్రియని అందఱును నా నోట నుమ్మివేయుదురు, నేను నా కుమారులను జంపించుటకు తెచ్చినాను గావున శ్రీకృష్ణుఁడే కంసునిఁ జంపినను బంధు వధాపవాదము నాకు సంభవించి తీరఁ గలదు. కావున నేనే విధముగఁ జూచినను వ్రజమునకుఁ బోరాదు." ఇట్లాలోచించుకొని వసుదేవుఁడిట్లనెను:- "రాజా? నందకుమారులను నీ యజ్ఞమునకుఁ బిలుచుట ఉచితము కాదని నా యభిప్రాయము. నేనును ఆ పిల్లలిద్దర విషయమును వినియుంటిని. ఆ యిద్దరును గొప్ప యుపద్రవ మొనర్చువారు. ఇచ్చటికి వచ్చిన నేదో యుత్పాతమును వారొనర్పక మానరు. యజ్ఞమునకు విఘ్నము కలుగును. కావున నందునిఁ బిలిచినఁ బిలువవచ్చును గాని ఆ పిల్లలను మాత్రము పిలువ వలదు. నందవ్రజమునకు నేను బోవుటంత మంచిది కాదని తోఁచుచున్నది. ఇంకొకరిని బంపుఁడు."

కసరి కంసుఁడిట్లనెను :- "ఇతరుల నేలఁబంపవలయును. నీవే పోవలెను."

వసుదేవుఁడు సాహసముతో నిట్లనెను :- "రాజా! నేను వివశుఁడను. నేనీకార్యముకొఱకు వ్రజమునకుఁబోను."

ఇది వినఁగానే కంసుని నేత్రము లెఱ్ఱనయ్యెను. ఆతఁడు క్రోధముతోఁ బెదవులను గొఱుక నారంభించెను. ఖడ్గమును దీసి ఆతని వధించుట కుద్యుక్తుఁడయ్యెను. సమీపముననే బందీగానున్న నుగ్రసేనుఁడు కూర్చుండియుండెను. ఆతని సోదరుఁడు దేవకుఁడును నుండెను. వారిద్దరును గంసుఁడిట్లు చేయుట నాపి యిట్లనెను :- "ఈతఁడు నీకు బావమఱఁది. ఈతని వధించుట ఉచితము కాదు."

ఇది విని కంసుఁడు వసుదేవుని వధించుటను మానుకొనెను. వసుదేవుఁడు తన సింహాసనమునుండి లేచి యింటికి వెడలిపోయెను. తర్వాతఁ గంసుఁడు వసుదేవ దేవకులను ఇంటికిపోయినమీఁదట ఇనుపగొలుసులతో గట్టిగా బిగించి కారాగృహమునఁ బడవైచెను. ఈతని పుత్రుఁడే తనకుఁ గాలుఁడని ఆతనికిఁ దెలియును. ఈతఁడు మోసముచేసి, నాకన్నులలో దుమ్ముకొట్టి తన అష్టమ బాలకుని నంద వ్రజమునకుఁబంపినాఁడు. ఈతఁడు స్వతంత్రముగ నుండినచో నింకను బన్నాగములు పన్నఁగలఁడు. కావున నీతని స్వాతంత్ర్యమును నాశము చేయవలయును. ఈతని బంధిశెనఁ

గావింపవలయును.” అని ఆ యిద్దరిని కారావాసమున కతిథు లను గావించి పంపివైచెను.

ఇప్పుడు కంసుఁడు యజ్ఞమున కేర్పాట్లు చేయుఁడని సేవకుల కాజ్ఞాపించెను. సేవకులందఱును సామగ్రులను గూర్చుటలో నిమగ్నులై యుండిరి. వేద విధి నెఱిఁగిన విప్రులు సమస్త సామగ్రులను వ్రాసిరి. దాని ననుసరించి వేఱు వేఱు వస్తువులను దెప్పించుటకై వేఱు వేఱు మంత్రుల నేర్పఱచెను. వారు వస్తువుల నన్నిటిని ప్రోవుచేసి తెచ్చు చుండిరి. వేదజ్ఞులగు బ్రాహ్మణులందఱును సత్కారసహిత ముగఁ బిలువఁబడిరి. మండలీకరాజు లందఱును బిలువఁబడిరి. నగరము మహోత్సవ దృశ్యములతో నిండియుండెను. వసు దేవుని కారాగృహమున బంధించుటచే నందఱును దుఃఖించు చుండిరి, కాని ప్రకటముగ నెవ్వరేమనుటకును సాహసము లేకుండెను. యజ్ఞమును విషయమును విని సమస్త దిక్కుల నుండియు ఋషులును, మునులును, వేదజ్ఞులగు బ్రాహ్మణు లును, నట, నర్తక, భిక్షుకులును, దానములను బట్టువారును వచ్చిరి. కంసున కొక్కటే చింత. అది శ్రీకృష్ణునెట్లైనఁ జంపవలయుననియే. అందువలన ముందుగాఁ దనరాజ్య మందలి పేరుపొందిన మల్లులను దన కడకు బిలిపించెను. వారిలోఁ జాణూర, ముష్టిక, శల, తోశల మొదలగు వారుం డిరి. వారితో నిట్లనెను:- “వ్రజములో నందునికడనుండిన రామకృష్ణులు నిజముగ నందుని పుత్రులుకారు. వసుదేవ పుత్రులు, నాకశత్రులు. వారిని నేను బోరునకుఁ బిలిచితిని.

మీరు వారితోఁ బోరాడి వారినిఁ జంపుఁడు. అట్లు చేసినచో మీరు నాకు మిక్కిలి ఉపకారము చేసిన వారగుదురు. నేను మీకు బాగుగా బహుమానము లిచ్చెదను."

మల్లు లిట్లనిరి :- "రాజా! మీరు నిశ్చింతగ నుండుఁడు. మేమే విధముగనైన వారిని బ్రదుకనీయము. వారు పిల్లలు. ఒకసారి యముఁడు మాతోఁ బోర వచ్చినను నాతని గూడ మేము పరాజితుల మొనర్చెదము." ఇది విని కంసుఁడత్యంత ప్రసన్నుఁడయ్యెను. అంత నాతఁడు తన మావటి వానినిఁ బిలిచి, ఆతనితో నిట్లనెను :- "ఓయీ! మావటీ! నీవొక్క పని చేయవలయును. రంగస్థలద్వారము కడకు నీవు కువలయా పీడగజమునకు బాగుగా సారాయిని ద్రావించి తీసికొనిపోవలెను. అసలే ఆతఁడత్యంత మదోన్మత్తుఁడు. పైఁగా సురను ద్రావించినచో నింక శరీరము తెలియదు. రామకృష్ణులు రాఁగానే నీవా యిద్దర నేనుఁగుచేఁ జంపింప వలయును."

మావటీఁడిట్లనెను :- "రాజా! మీరు నిశ్చింతగా నుండుఁడు. నేనవశ్యము రామకృష్ణులను నేనుఁగుచేఁ జంపించెదను."

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఈవిధముగ బాగుగా శ్రీకృష్ణునిఁ జంపుట కేర్పాటులను గావించి కంసుఁడు వ్రజమునకుఁ బోవుటకై అక్రూరునిఁ బిలిపించెను."

# కంసుఁడు - అక్రూరుఁడు

(౧౦౧౪)

శ్లో॥ గచ్ఛ నంద వ్రజం తత్ర సుతావానక దుందుభేః।
ఆసాతే తావిహానేన రథేనానయ మా చిరమ్ ॥

శ్రీభాగ. ౧౦స్కం. ౩౬ అ ౩౦ శ్లో॥

శా॥ అక్రూరత్వము తోడ నీవు మనఁగా నక్రూరనామంబు ని
ర్వ్యక్రత్వంబునఁ జెల్లె మైత్రి సలుపన్ వచ్చున్ నినుంజేరి ని
ర్వ్యాక్రోశుండవు మందలోన బలకృష్ణా భీరుఁ స్మద్వినా
శ క్రీడారతులై చరింతు రఁట యోజం దెచ్చి యొప్పింపరే॥

శ్రీమదాంధ్ర భాగవతము.

నీచుల నమ్రత భయంకరమైనట్లు వారి క్రోధము భయంకరము కాదు ఆతని కెవరివలనైన నత్యంత గురుతర కార్యము జరుగవలసి యుండినచో నాతఁడు వారి సమ్ముఖమున నమ్రతను బ్రకటించును. సమస్త విధముల నాతని వశమొనర్చుకొని తన స్వార్థమును సాధించుకొనఁ దలఁచుచుండును. ఆతని కధీనులుగను, ఆశ్రితులుగను, నెవరున్నారో వారు వారి మాట వినవలసివచ్చును. ప్రేమతో వినకుండినఁ గ్రోధముతో వినిపించెదరు. ఎవని యాశ్రయమున నుందురో వారి వాక్యములు ఉచితముకానిండు, అనుచితముకానిండు, విని తీరవలసి యుండును. మారీచుని కడకు రావణుఁడు పోయెను. పోఁగానే ఆతనిఁ గౌగిలించుకొని మిక్కిలిగ నాదర సత్కారములను గావించెను. ఏదో ఉన్నదని ఆతఁడుఁ దెలిసికొనెను. ఇంతటి ప్రేమలో లోపల నెంతో రహస్య

మిఱమిడి యుండును. ఈతఁడేదో చేయరాని పనినిఁ జెప్పఁ గలఁ డనుకొనెను. ఆతని యనుమానము సత్యమయ్యెను. రావణుఁ డాతని సీతాపహరణ మొనర్చుటకై కనకమృగమును గమ్మనెను ఆతఁడు మొదట నంగీకరింపలేదు. చాల బల వంత మొనర్చి చంపువఱకు వచ్చునప్పటికి ఆతఁడిట్లనుకొనెను:— "చావవలసియే యుండినచో భగవానుని చేతనే యేలఁ జావఁగూడదు? భగవానుఁడు ఘటఘటవాసి అన్నియు నెఱుంగును. నా ఆంతరిక ప్రేమ ఆతనికిఁ దెలియనిదికాదు." ఇట్లాలోచించుకొని ఆతఁడు రావణుని ప్రస్తావము నంగీక రించెను. ఆతఁడు చెప్పినట్లు విని పరమ పదమును బొందెను.

సూతుఁడిట్లనెను:— "మునులారా! వసుదేవునిఁ గారా గృహమున బంధించి కంసుఁడిట్లనుకొనెను:— "నాకుఁ గేశి యను నసురమిత్రుఁడు కలఁడు. ఆతఁడీ కృష్ణ బలరాములను జంపఁగలఁడను నాశ నాకులేదు. అయినను ఉపాయ మొనర్ప వలయును. అందువలన నాతని గూడ బలరామ కృష్ణులను జంపుటకుఁ బంపెను. కేశియును గుఱ్ఱపు వేషమును ధరించి వ్రజమునకుఁ బోయెను. అయినను గంసునకు శాంతి లేకుండెను. ఈ సాంసారిక భోగములలో విశేషత యిదియే. వీనిలో శాంతి యనునది యుండదు. భోగముల నెంతైనను భోగింపుము. తృప్తి యనునది యుండదు. లాలసయే మధిక ముగఁ బెరుగు చుండును. తమ విషయ భోగములు స్థాయిగా నుండవలయు ననియు, నధికాధికముగఁ బెరుగ

వలయు ననియు, తాము సదాజీవించి యుండవలయుననియు బ్రాణి ప్రబల ప్రయత్న మొనర్చుచుండును. వివిధోపాయముల నాలోచించు చుండును. కేశి వెడలిన తరువాతనైనను గంసునకు శాంతి కలుగలేదు. వసుదేవుఁడు వ్రజమునకుఁ బోవుటకు నిరాకరించెను. అందువలన నాతఁడు అక్రూరుని బిలిపించెను. కంసునియొక్క ఉగ్రశాసనమునకు దుఃఖితులై యదువంశీయులు చాలమంది సపరివారముగ నితరరాజ్యములకుఁ బాఱిపోయిరి. అతఁడు తన జాతీయులను ద్వేషించుచుండెను. రాజ్యములోని పెద్ద పెద్ద పదవులలో నాతని పక్షమువారగు నాసురీ ప్రకృతిగల పురుషులే నియుక్తులైరి. అందఱును వెడలిపోయినను అక్రూరుఁడు తన పదవికి త్యాగపత్ర మీయలేదు. ఆతఁడు ధర్మాధ్యక్ష పదవిలో నియుక్తుఁడయ్యెను. వంశపరంపరగా రాజ్యమందాతనికీ పదవి ప్రాప్తించెను. అక్రూరుఁడాతని మాటను గాదనకయే యెట్లో కాలమును గడుపుచుండెను. కంసునకును నాతనిపై విశ్వాసముకలదు; అందువలన నాతఁడాతని నేమియుననఁడు.

కంసుఁడు పిలువఁగానే అక్రూరుఁడు వచ్చెను. అక్రూరుఁడేకాంతమున వచ్చుటను గాంచి కంసుఁడు నిలుచుండెను. అక్రూరుఁడు నియమాను సారముగ రాజునకు జయ జయకారములొనర్చి, ఆతఁడు నీచాసనమునఁ గూర్చుండఁబోయెను. అప్పుడు కంసుఁడు ముందుకుఁబోయి బలవంతముగఁ జేతులను బట్టుకొని యిట్లనెను:- "అక్రూరా! ఇది రాజసభకాదు, మన యిల్లు. ఇంటిలో మనము పరస్పరము సంబంధులము.

నీవు శాఖలో మాకంటె గొప్పవు. ఇదిగో నా వద్దకు వచ్చి కూర్చుండుము."

అక్రూరుఁ డిట్లనెను :- "మహారాజా! రాజు అష్ట దిక్పాలకుల అంశలచేఁబుట్టును. ఆతఁడిట నుండినను, వనమున నున్నను, సింహాసనము మీఁదనుండినను, భూమిమీఁద నుండినను సర్వత్ర ఆతని సన్మానింపవలయును. రాజుతో సమానముగఁ బ్రజలు కూర్చుండరాదు."

కంసుఁడు బలవంతముచేయుచు నిట్లనెను :- "అట్లు కాదు. మా వంశములో నందఱును రాజులే. రమ్ము, నా దగ్గఱనే కూర్చుండుము." అని యిట్లు పలికి ఆతఁడు బలవంతముగఁ దన సమీపమున గూర్చుండఁ బెట్టుకొనెను. అంత మిక్కిలి ప్రేమతో నిట్లనెను :- "అక్రూరా! వృష్టి వంశీయులును, భోజవంశీయులునగు యాదవు లందఱును లోలోన నన్ను ద్వేషించుచుండుట నీ వెఱిఁగినదే కదా! చాలమంది నా రాజ్యమును వదలి వెడలిపోయిరి. ఇప్పు డున్న వారైనను నా మీఁదఁ బ్రీతిగలేరు. వారు సదా నా అనిష్టమునే కోరుచుందురు. వారికిని నాకును మనస్సులు కలియవు. నా హితమును గోరువాఁడవు నీ వొక్కఁడవే. నీ చేత నేఁడు నే నొక గురుతరమగు కార్యము నొనర్పవల యును."

అక్రూరుఁడు నమ్రతతో నిట్లనెను :- "రాజా! ఆజ్ఞాపింపుఁడు. నావలన నగు పనిని నేనవశ్యముచేసెదను."

కంసుఁడిట్లనెను :- "చూడుము నందవ్రజమున వసుదేవుని పుత్రు లిద్దరు నివసించుచున్నారు."

అక్రూరుఁడు నమ్రతతోఁ నిట్లనెను :- "రాజా! దేవకీ గర్భమున బుట్టిన వసుదేవ పుత్రులను మీరు చంపియుంటిరి కదా! నంద వ్రజమున నాతని పుత్రులెచ్చట నున్నారు?"

కంసుఁడిట్లనెను :- "అక్రూరా! నీవమాయకుఁడవు. మాయా ప్రపంచపు మాయల నెఱుఁగవు వసుదేవుఁడు చూచుట కమాయకుఁడుగానే యుండును. ఈతఁడు రహస్యముగ దేవకీ దేవి అష్టమ గర్భమునుండి పుట్టిన బాలకుని నందునికడకు బంపినాఁడు. నందుని కూఁతురును దెచ్చి నాకుఁ జూపించినాఁడు. ఈ సంగతిని నాకు నారదుఁడువచ్చి చెప్పినాఁడు. నేను పంపిన నసురుల నందఱను జంపిన శ్రీకృష్ణుఁడు నందకుమారుఁ డనుకొంటిని. దేవకీదేవి గర్భమునుండి ఆతఁడు పుట్టినాఁడనియు, రోహిణీదేవి గర్భమునుండి బలరాముఁడు పుట్టినాఁడనియు నాకు తెలిసినది. ఇద్దరును గొప్ప బలవంతులు. నీవు నా రథమును దీసికొనిపోయి వారినిద్దరిని నిచ్చటికిఁ బలుచుకొని రమ్ము."

అక్రూరుఁడిట్లనెను :- "మహారాజా! నేనెట్లు వారినిఁ దీసికొని రాఁగలను? నందుఁడు పంపకుండిన నేను దగవులాడుదునా?"

కంసుఁడు మమతాస్వరమున నిట్లనెను :- "ఓయీ! తగవులాడవలదు. ఆతని నిచ్చటికిఁ దీసికొనివచ్చి యుక్తితోఁ జంపింపవలయును."

అక్రూరుఁ డిట్లనెను :- "మీ కా బాలకులిద్దరేమి అపకార మొనర్చినారు? రాజా! నిరపరాధులగు నా బాలకుల నేల వధింపఁదలఁతువు?"

కంసుఁడిట్లనెను :- "నీవు నా చెల్లెలి వివాహకాలమున నాకాశవాణిని వినలేదా యేమి? విష్ణునాశ్రయించుకొనిన దేవతలు దేవకీదేవి అష్టమ గర్భమునుండి పుట్టిన బాలునిచే నాకు మరణమును నిశ్చయించినారు. ఆతని చేత నాకు మరణమున్నదఁట. అందువలన నేను దేవకియొక్క బాలురనందఱను జంపితిని. వారినిఁ గారాగృహమున నుంచితిని ఇట్లైనను వసుదేవుఁడు ధూర్తత్వమున నాకంట దుమ్ముఁ గొట్టి పిల్లవానిని నందవ్రజమునకుఁ బంపినాఁడు. ఇప్పుడాతఁడు పదునొకండేండ్లవాఁడైనాఁడు. వానిని నేను నీసహాయముననే చంపఁగలుగుదును. దేవతలందఱును విష్ణుసహాయముచే వారి పనుల నన్నిటినిఁ జక్కపెట్టుకొనిరో, అట్లే నేను నీ సహాయముచే నామనోరథములను బూర్తి కావించుకొనెదను. నన్నుఁజంపు వానినిఁ జంపించెదను. రాజు మిమ్ములను బిలుచుకొని రమ్మనినాఁడని సూటిగాఁ జెప్పుకుము."

అక్రూరుఁడిట్లనెను :- "అయితే అచ్చటికిపోయి యేమనవలెను?"

కంసుఁడిట్లనెను :- "నీవు నందుని కడకుఁబోయి యచ్చట శివచతుర్దశి నాఁటికి గొప్పధనుర్యాగము జరుగునని చెప్పవలయును. మీరందఱును పాలు, పెరుగు, నేయి మొదలైనవాటినిఁ గానుకలుగఁ దీసికొని యజ్ఞమునకు రావలయును.

గోపకులందఱకు నాహ్వానము బంపినారు. మహారాజు నీకుమూరు
లను సత్కారపూర్వకముగఁదీసికొని రమ్మని ఆహ్వానములను
బంపినాఁడు. ఈ రథముమీఁద నీకొడుకుల నిద్దరినిఁ బంప
వలయును." అని చెప్పవలయును, అమాయకులగు గోపకులు
మన మనస్సులోని మాటను గ్రహింపఁజాలరు. యజ్ఞోత్స
వము, మల్లయుద్ధము మాట వినఁగానే వారుత్సాహమున
నిండి కౌతూహలమున వచ్చెదరు. ఇచ్చటికి రాఁగానే నేను
కాలరూపమును మదోన్మత్తయునగు కువలయా పీడమను గజ
ముచేఁ జంపించెదను. ఒకవేళ గజమునుండి తప్పించుకొనిన
నావద్దనుండిన గొప్ప గొప్ప మల్లురు వారిని గోదాలో
మల్లయుద్ధమునఁ జంపెదరు."

అక్రూరుఁడిట్లనెను :- "రాజా ! వెనుకముందు లాలో
చించి బుద్ధిమంతులగువారు కార్యము లొనర్పవలయును.
వారు వసుదేవుని పుత్రులే అయినచో వారినిఁ జంపించినఁ
గులములో ద్వేషమధికమగును. పైకి యెవ్వరేమియు
ననకున్నను లోలోన నందఱును నసంతుష్టులగుదురు.

కంసుఁడు రహస్యముగ నిట్లనెను :- "అక్రూరా ! ఇది
నాకు తెలియదాయేమి ? వసుదేవుని పక్షమువారు కొందఱు
న్నారు; వీరిలో వృష్ణి భోజ, దాశార్హవంశీయులగు యాద
వులు చాలమంది కలరు. నాతండ్రి ఉగ్రసేనుఁడును నాదశ
మున నున్నాఁడు. వీరందఱును గలిసియే దేవకియొక్క అష్టమ
గర్భమును నందవ్రజమునకుఁ బంపినారు. నా కాతని వలన

నేల భయము జనించుచున్నదో కాని రాత్రియందు నాకు నిద్ర పట్టుటలేదు. ఆ భయముచేతనే నేని విరోధిదళమువారి యెడల నేమియుఁగాఠిన్యము వహింపఁజాలకున్నాను. వారి ద్దరు చంపఁబడినచో నేను సర్వథా నిర్భయుఁడనగుదును. వసుదేవుఁడు శోకాకులుఁడై కింకర్తవ్యవిమూఢుఁడు కాఁగ లఁడు విరోధి దళమునకు నాయకుఁడీ వసుదేవుఁడే. పుత్ర శోకమున నాతఁడు విహ్వలుఁడైనపుడు నేనాతనిఁ జంపించెదను. ఆతని దళములోని ముఖ్యులగు యాదవుల నందఱను హత్య చేయించెదను. నాతండ్రి కింకను రాజు కావలయునను గోరిక కలదు. అందుకనియే ఆతఁడు విరోధి దళములోనికిఁబోయి. చేరినాఁడు. వసుదేవాది వృష్ణుల సహాయముచే నాతఁడు మరల రాజ్యాధికారమును సంపాదింపఁ జూచుచున్నాఁడు. కావున నేను రాజ్యలోభియగు మాతండ్రినిగూడ చంపించె దను. అప్పుడు విరోధిదళము నిర్మూలనము కాఁగలదు. నాకు విరుద్ధ వాక్యమును బలుకువారే యుండరు. నా రాజ్యము నిష్కంటకము కాఁగలదు. ఒక్కకృష్ణునిఁ జంపి నచో నన్నిపనులును గాఁగలవు. మిత్రవరా! నీవు నాకు సహాయ మొనర్పుము. నేనన్ని చింతలనుండియు బయటఁ బడెదను. ఈ పృథివి యంతయును నిష్కంటకము కాఁ గలదు. నాకు బయట శత్రువులవలన భయములేదు. ఈ గృహ విరోధులను గూర్చియే నేను నిరంతరము చింతించు చుందును. చూచుటలేదా? ప్రపంచమున నావైపు వ్రేలు పెట్టి చూపింపఁ గలవాఁడెవఁడున్నాఁడు. నన్నెదిరించువాఁడె

వాఁడు కలఁడు ? ఇప్పుడు ప్రపంచమున సర్వశ్రేష్ఠుఁడగు బల
వంతుఁడు గిరి వ్రజాధిపతియగు జరాసంధుఁడు ఆతఁడు
నాకు మామయే. ఆతని రాజకుమారిక లిద్దరును నన్ను
వివాహమాడిరి వానర రాజగు ద్వివిదుఁడును బలవంతుఁడే.
ఆతఁడు నాకు మిత్రుఁడు. శంబరాసురుఁడును, నరకాసురుఁ
డును, బాణాసురుఁడును మహాపరాక్రమవంతులు. రాజు
లందఱు నాతో మైత్రిని నెఱపెదరు. వీరందఱును నాపక్ష
మున నున్న రాజులే. కొందఱు దేవతల పక్షముననున్న
రాజులును గలరు. వారిని నేను జయించెదను. నా మనస్సు
నకుఁ గంటకుఁడగు వీఁడు పోయినపుడే నేను జయింపఁగలుగు
దును. బలరామకృష్ణులు చంపఁబడినచోఁ బృథివియందు
నేనొక్కఁడనే కనఁబడెదను. నిన్నుఁ బ్రధానమంత్రిగా నొన
ర్చెదను. నీవు మేమును గలిసి సమస్త సుఖముల ననుభవింప
వచ్చును. కావున నింక నీవు పొమ్ము. ఆలస్య మొనర్పఁ
బనిలేదు. గోపకులను మాయ బుచ్చి నాయాజ్ఞను జెప్పి
యిచ్చుటకుఁ దీసికొని రమ్ము. ధనుర్యాగ మహాత్మ్యమును
గూర్చి చెప్పుము. మధురానగరముయొక్క అద్భుతశోభను
గూర్చియును వర్ణింపుము. మల్లయుద్ధ మహాత్మ్యమును
గూర్చియును వర్ణింపుము. మల్లయుద్ధ మహాత్మ్యమును
గూర్చియును జెప్పుము. ఇంతకు సారాంశమేమనఁగా 'నేదో
విధమున నా యిద్దరను నిచ్చుటకుఁ దప్పక తీసికొని రమ్ము."

ఇది విని అనన్య మనస్కభావముతో నక్రూరుఁడిట్లు
నెను :- "రాజా ! నీయాలోచన సాంసారిక దృష్టికి అనుకూ

లముగనే యున్నది. మృత్యువనిన నందఱకును భయమే. అందఱును దానినిఁ దప్పించుకొనుటకు యథాశక్తిగఁ బ్రయత్నించుచుందురు. కాని :-

కంసుఁడిట్లనెను :- "కాని యేమి?"

అక్రూరుఁడిట్లనెను:- "కాని మహారాజా! ప్రారబ్ధము నెవరును దప్పించుకొనఁజాలరు. జరుగవలసినదేదియో అది జరిగియే తీరును. దాని కన్యథా కాఁజాలదు. అట్లైనచోఁ బ్రపంచమున జ్ఞానులును, ధ్యానులును, బ్రయత్న శీలురును, సాహసులును నెన్నటికిని జావనే చావరు. కావున మానవుఁడు సిద్ధ్యసిద్ధులందు సమభావము నుంచియే తన కర్తవ్యపాలనము నొనర్పవలయును. ఏలననఁగా కర్మ ఫలములొసంగువాఁడు దైవము. జన్మించుటకు ముందే మృత్యువిధాన మేర్పడినది. ఎవని కెవని చేతిలో మృత్యువు కలదో వాని కట్టి మృత్యువే లభించును. దాని కన్యథా చేయుట కెవరికిని శక్తి లేదు. అందఱకును బూర్వజన్మాను సారముగ సుఖదుఃఖములు సంభవించును. ఈవిషయమున నేను మీకు పురాణేతిహాసము నొకదానినిఁ జెప్పెదను. మీరు దత్తచిత్తులరై వినవలయును."

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఇట్లు చెప్పి ప్రారబ్ధగతి ననుసరించి కంసునకుఁ జాలదృష్టాంతములను జెప్పెను. వానిలోఁ గొన్నిటిని మీకు నేను జెప్పెదను."

# కానున్నది కాక మానదు.

౧౦౧౫

శ్లో॥ మనోరథాన్కరోత్యుచ్చైర్జనో దైవహతానపి।
యుజ్యతే హర్షశోకాభ్యాం తథాప్యాజ్ఞాం కరోమితే॥
శ్రీభాగ. ౧౦స్కం. ౩౬ అ. ౩౮ శ్లో॥

ఉ॥ పంపిన బోనివాఁడనె నృపాల మానవు లెన్నఁదమ్మ నూ
హింపరు దైవయోగముల నించుక గానరు తోఁచినట్లు ని
ష్కంపగతింజరింతురది గాదన వచ్చునె యీశ్వరేచ్ఛఁ ద
ప్పింపఁగతాదు నీపగతు బిడ్డలఁ దెచ్చెదఁబోయి వచ్చెదన్॥
శ్రీమదాంధ్ర భాగవతము.

ప్రయత్నముచేఁ బ్రారబ్ధము పోదు. అయినను బ్రయత్న మొనర్పక యెవరు నుండఁజాలఁడు. శరీరమున్నంత వఱకేదో చేయవలెను. ఏమియును జేయక ఒక్కక్షణమైన నుండలేరు. సాత్త్వికప్రకృతి కలవాఁడు సాత్త్విక కార్యము లొనర్చును. రజోగుణ తమోగుణ ప్రకృతి కలవారు హింసా ప్రమాదాల స్యాదుల నొనర్చును. జన్మించిన వానికి మత్యువు నిశ్చితము, మృత్యువు నెవరును దప్పించుకొనఁజాలరు. అయినను బ్రాహ్మణు లన్నిటికంటె మృత్యువును గాంచి భయపడుదురు. తాను జీవించుటకై అనేక ప్రయత్నముల నొనర్చును. జీవనమంటఱకును బ్రియమైనదే. జ్ఞానులగు వారు శరీరమును బ్రారబ్ధమునకు విడిచివేయుదురు. వారు మృత్యువునకు భయపడరు. వారు హఠపూర్వకముగ మరణింపఁ దలఁపరు. మృత్యువునకు భయపడి పారిపోరు. కాలమును బ్రతీక్షించు

చుందురు. శరీరమెప్పుడంతము కావలెనో అది అవశ్యము
కాఁగలదు. మృత్యువాసన్నము కాకుండిన నాతఁడగ్నిలో
దుమికినను, జలమునఁ బ్రవేశించినను, పర్వతమునుండి పడినను,
విషపానమొనర్చినను, సింహసర్పముల ముఖములలోఁ బ్రవే
శించినను, పర్వతముక్రింద నణఁగినను జావఁడు. ఆతనికి
మృత్యువాసన్నమగుచో నెంతటి సురక్షిత స్థానమున నుంచి
నను, నచ్చటను జచ్చిపోవును. పరీక్షిన్మహారాజునకుఁ దక్షక
సర్పముచే మరణము వ్రాయఁబడియున్నది. ఆతని కుమారుఁడు
జనమేజయుఁడాతని రక్షించుట కనేక ప్రయత్నముల నొన
ర్చెను. అంతరిక్షభవనమును నిర్మించెను. ఆజ్ఞలేక అందెవ
రును బ్రవేశింపరాదు. చీమ ప్రవేశించుటకైనను అచ్చట
వీలులేదు. గొప్ప గొప్ప చికిత్సకులు విషనాశకౌషధములను
బెట్టుకొని అచ్చటఁగూర్చుండిరి. అయినను దక్షకుఁడు చిన్న
రూపమును ధరించి బ్రాహ్మణుల ఫలములోఁ బ్రవేశించెను.
బ్రాహ్మణుఁడు ఫలమును దీసికొని రాజు నాశీర్వదించుటకుఁ
బోయెను. ఆశీర్వాదమొసంగు బ్రాహ్మణు నెవరాపఁగలదు?
బ్రాహ్మణుఁడు ఫలమును ముందు పెట్టెను. తక్షకుఁడు
మెఱయుచుండెను. రాజు తక్షకునిఁ గుతూహల వశమునఁ
జేతిలోనికిఁ దీసికొనెను. నాగుల కొక ప్రతిజ్ఞకలదు. ఎవరైనఁ
గఱవమనినఁగాని కఱవరు. ఇప్పుడు ప్రారబ్ధ ప్రాబల్యమును
గమనింపుఁడు. రాజు కీటకమును గైకొని యిట్లనెను :-
"తక్షకుఁడు నన్నుఁ గఱవ రాలేదు. ఈ కీటకమే నన్నుఁ
గఱవఁగలదు. ముని వాక్కులు సిద్ధించుఁగాక!" అని పలికి

ఆతఁడా కీటకమును గంతమును వైచుకొనెను. అది తక్షక రూపమును ధరించెను. రాజు నది కఱచినది. రాజు చచ్చెను. రాజు తనకుఁదాను మృత్యువును బిలుచుకొనెను.

ఒక ప్రసిద్ధమగు కథ కలదు. వ్యాసుని తాత, సత్యవతి తండ్రి పల్లెవాఁడు. ఆతఁడు మృత్యువునకు మిక్కిలి భయపడుచుండెడువాఁడు. ఆతఁడు నారదునితో నిట్లనెను:— "నీవు యమునితో నొక్క విషయము చెప్పవలయును. చంపుట కాతనికిఁ గావలసినంత ప్రపంచము కలదు. నన్ను వదలి పెట్టుమని చెప్పుము." నారదుఁడిట్లనెను :— "ఇది నాకు వశమైనది కాదు. మీకు బంధువైన వ్యాసదేవుఁడే మైనఁ జేయఁగలఁడు." ఇప్పుడాతఁడు వ్యాసుని వెంటఁబడెను. వ్యాసుడెంతగాఁ జెప్పినను ఆతఁడు వినలేదు. ఆతఁడాతనిఁ గైకొని వ్యాసుని కడకుఁబోయెను. యముఁడిట్లనెను :— "ఇది నా పనికాదు. మృత్యువు కడకు బొమ్ము." పల్లెవాఁడిట్లనెను :— "మీరు కూడ నా వెంట రావలయును." ముగ్గురును గలిసి మృత్యువు కడకు బోయిరి. మృత్యు విట్లనెను :— "ఈపని వయోమాతది." పల్లెవాని వెంట మృత్యువును దీసికొని వయోమాతకడకుఁ బోయిరి. వయమాత యిట్లనెను :— "నేనేమియును జేయలేను. దైవమునుగూర్చి వ్రాయుదును. ఈతఁడు వ్యాసునకు తాత కాఁగలఁడని నాకు దెలియును. ఈతఁడు మృత్యువునకు భయపడును. కావున బాగుగా నాలోచించి నేనొక అసంభవ యోగమును వ్రాసితిని. అది ఘటింపకుండిన నీతనికి మృత్యువుండదు. నేను

యముఁడు, మృత్యువు, వ్యాసుఁడు, వయమాత వీరందఱును గలసికొని నపుడీతనికి మృత్యువు కలుగునని వ్రాసితిని. ఇది వఱలో నట్టి డెవరికిని సంభవింప లేదు. కాని యీతఁడు తన మృత్యువును బిలిచి తెచ్చుకొనినాఁడు" వయమాత ఇట్లు చెప్పుచునే యున్నది ఆ పల్లెవాఁడచ్చటనే పడి చచ్చెను. ఇంతకు సారాంశమేమనఁగా నెట్లు జరుగనున్నదో అట్లు అన్నియు సంఘటించును. మానవుఁడు వివశుఁడై అచ్చటికిఁ బోవును. మృత్యు సంయోగము నెవరును దప్పింపఁజాలరు.

సూతుఁడిట్లనెను :- "మునులారా! కంసుఁడక్రూరు నకు సమస్త విధముఁ జెప్పెను. తన మనోరథమును జెప్పి లోభపెట్టఁగా నక్రూరుఁడిట్లనెను :- 'రాజా! ప్రయత్న మొనర్చుట మంచిదే కాని బ్రహ్మ వ్రాతను దుడుప నెవ్వరి తరమును గాదు. హిరణ్యకశిపుఁడు తన మృత్యువును దప్పిం చుకొనుటకై యెన్నెన్నో ఉపాయముల నొనర్చెను. అయి నను నాతఁడు నృసింహుని చేతఁజచ్చెను. అంతదూర మెందు లకు, నీవు నీ విషయమునే చూచుకొనుము. ఆకాశవాణి నీకిది వఱకే సూచన నిచ్చియున్నది. నీవు దేవకినిఁ జంపు టకుఁ బ్రయత్నించితివి. అయినను ఆమె రక్షింపఁబడినది. నీవు వారిని బంధించితివి. వారి పిల్లల నేడ్గురను జంపితివి. అయినను నెనిమిదవ వాఁడు రక్షింపఁబడెను. విధి విధాన మిట్లున్నది నీవును వ్రజమునకు శ్రీకృష్ణునిఁ జంపుట కనేకు లగు నసురులను బంపితిని; కాని యెవరును నాతనిఁ జంపఁ జాలకపోయిరి. వారందఱును జచ్చిరి. రాజా! ముఖమున

వ్రాసిన వ్రాత జరిగితీరును. అందుకును బూర్వజన్మ సంస్కారముండును. ఈవిషయమున నీకు నేనొక దృష్టాంత మును జెప్పెదను. దానిని నీవు శ్రద్ధగా వినవలయును.

దక్షిణదేశమందు కృతమాలా నదీతీరమున నొక సమృద్ధిశాలియగు పురముండెను. ఆపురాధీశుఁడు, గొప్ప శూరవీరుఁడు, యశస్వి, పరాక్రమవంతుఁడు. అతని కెందఱో రాణులు కలరు. వారిలో నత్యంత పెద్దరాణి మిక్కిలి చక్క నిది. రాజామెను మిక్కిలి ప్రేమించెడువాఁడు. ఇద్దర కాలము సుఖముగ జరుగుచుండెను.

ఒక దినమున నొక మహాత్ముఁడు రాజుయొక్క రాజ ధానికి వచ్చెను. రాజు తన పురోహిత మంత్రులతోఁగలిసి మహాత్ముని దర్శింపఁబోయెను మధుపర్క, కంద, మూల ఫలాదులొసఁగి రాజు మునినిఁ బూజించెను. రాజుచేసిన పూజను స్వీకరించి ముని రాజుయొక్క రాజ్యపరివార, సేనా, కోశ, సమస్తాశ్రితులయొక్క కుశలము నడిగెను. ముని త్రికాలజ్ఞుఁడు. అందువలన రాజునకు రాజ్యసంబంధమగు నుపదేశము నొసంగెను. మాటలలో రాజిట్లు డిగెను:- "మునివరా! మీరు సర్వజ్ఞులరు. భూత భవిష్యద్వర్తమాన ములను మీరెఱుంగుదురు. నామృత్యువెవరి వలనఁగలుగునో నేను దెలిసికొనఁ గోరుచున్నాను"

మునియిట్లనెను:- "రాజా! నీవిట్టి వ్యర్థప్రశ్నల నేలవేసెదవు? ఎవనివలన మృత్యువు సంభవించునో అది

సంభవించితీరును. జరుగనున్నది జరుగక మానదు. జరుగని దాని నెవరును జరిపింపఁజాలరు. ఇది నిశ్చితమైనపుడు దీనిని గూర్చి చింతించుట వ్యర్థమగును."

రాజిట్లనెను :- "స్వామీ! ఇదంతయును సత్యమే. అయినను భవిష్యత్తును దెలిసికోవలయునను కోరిక అందఱి కుండును. అందులకనియే జన్మపత్రికను గూడ వేయించుకొందురు. చేతి సాముద్రికమును జూపించుకొందురు. వర్షఫలమును జెప్పించుకొందురు. దయయుంచి నామృత్యు వెట్లు సంభవించునో చెప్పుడు."

రాజు బలవంత మొనర్చుచున్నాఁడని ముని తెలిసికొని యిట్లనెను:- "రాజా! నీచావు నీ పెద్ద భార్య వలనఁ గలుగును."

రాజునకు మిక్కిలి ఆశ్చర్యము వేసెను. ఆతఁడిట్లనుకొనెను :- "రాణి నన్నుఁ బ్రాణాధికముగఁ బ్రేమించుచున్నది. ఈమె నన్నెట్లు చంపఁగలదు? అయినను మునివచనము అబద్ధము కాదు. నేనీరాజ్యమును వీడి యెచ్చటికైనను దాగ నేనెచ్చట నుండినది యెవరికినిఁ దెలియకుండునట్లుగను, ముఖ్యముగ రాణి అచ్చటికిఁ జేరఁ జాలనట్లుగనుండు నొక యజ్ఞాత స్థానమునకుఁ బోయెదను." అని అనుకొని రాజొక దినమున రాత్రియందు లేచి వెడలిపోయెను. ఆతఁడు వేషమును మార్చి వెడలుచుండెను. పోయిపోయి ఆతఁడు సముద్ర సమీపమునకుఁ బోయెను. అచ్చట నొక దోనెపై నెక్కి

సముద్రమున నొకద్వీపమునకుఁ బోయెను. అచ్చటికిఁబోయి ఆతఁడొక సాధారణ కృషికుని వద్ద నౌకరికిఁగుదిరెను.

ప్రాతఃకాలమయ్యెను. రాజశయ్య శూన్యముగనుండు టను గాంచి రాణి మిక్కిలి దుఃఖించెను. ఆమె రాజు నంతటను వెదికించెను. ఎక్కడను రాజుజాడ తెలియకపోఁగా నామె ఆత్మహత్యను జేసికొనుటకు నిశ్చయించెను. రాత్రియందే లేచిపోయి సమీపముననే ప్రవహించుచుండిన కృతమాలానది యందు ఆమె మునిఁగిపోయెను.

కొన్నిక్షణముల కామె తానొక స్మశానఘట్టమున నున్నట్లు తెలుసికొనెను. ఒకవ్యక్తి యెఱ్ఱని వస్త్రములను ధరించి, యెఱ్ఱని గంధమును బూసికొని, ఎఱ్ఱని పుష్పమాలను ధరించి యెఱ్ఱని త్రిశూలమును జేతిలోఁబట్టుకొని ఒక పీనుఁగు యొక్క ఱొమ్ముమీఁదఁ గూర్చుండి యుండెను, అట్లుండి ఒక బీజ మంత్రమును జపించుచుండెను. రాణి యీదృశ్యమును గాంచి భయపడెను. నదిలోఁ గొట్టుకొనిపోవు తన నీతఁడే తీసినాఁడనియు బలియొసంగఁదలఁచు చున్నాఁడనియు నామె తెలిసి కొనెను. ఆమె. చచ్చుటకు సిద్ధముగనే యుండెను. అందువలన నామె తదేక దృష్టితో నావ్యక్తి వైపునకుఁ జూచు చుండెను. ఆతని నేత్రములనుండి ఒక తేజస్సు వెలువడెను. దానివలన ఆమె మూర్ఛిత మయ్యెను. ఆ తాంత్రికుఁడు తంత్రముచే నామెను దనవశ మొనర్చుకొనెను. ఇప్పుడా తాంత్రికుఁడేమి చెప్పిన దానినిఁ జేయుచుండెను.

ఒకసారి యాతాంత్రికుఁడారాణినిఁ దీసికొని రాజుండిన ద్వీపమునకుఁబోయెను. అచ్చట నొక్క శక్తి పీఠముండెను. ఆతాంత్రికుఁడచ్చట నరబలి నీయఁదలఁచుచుండెను. దైవవశమున నారాత్రి ఆరాజా దేవీమందిరమునకు వచ్చెను. తాంత్రికుఁడాతనిఁ బట్టుకొని బలియిచ్చుటకు తీసికొనివచ్చెను. పశుబలి సంస్కారములన్నియు నొనర్చి, రాణి చేతికి ఖడ్గ మొసంగి నరబలి నొసంగుమని ఆతఁడనెను. రాణి ఆతని వశమున నుండెను. తాంత్రికుఁడు చెప్పఁగా రాజు శిరస్సు మొండెమునుండి వేఱయ్యెను. చంపునపుడు రాణి గుర్తింప లేదు తర్వాత నాతఁడు రాజని తెలిసికొనెను. రాణికి మిక్కిలి దుఃఖము కలిగెను. ఆఖడ్గముతో నామె తన శిరస్సును ఖండించుకొను నంతలో విగ్రహములో నుండి సాక్షాత్తుగ దేవి ప్రకటమై రాణియొక్క చేతినిఁబట్టుకొని యిట్లనెను:- "దేవీ! నీవిట్టి సాహస మొనర్పకుము. ప్రాణులందఱును ప్రారబ్ధమునకు వశులై కార్యము లొనర్చెదరు. నీవు నాసఖివి. ఒక దోషముచే నీకు గోజన్మ కలిగినది. ఈ రాజు పూర్వజన్మ మున వ్యాధుఁడు. రాత్రియందు పొరబాటున నిన్ను వధించి నాఁడు. ఆసమయమున సర్పమీతని గాటువైచినది. ఈతఁడు మరణించినాఁడు. దైవవశమున నీతఁడెచ్చటఁబడి చచ్చినాఁడో అచ్చట సాల గ్రామశిల యుండెను. చచ్చి సాల గ్రామ శిలపైఁ బడుటచే నీతఁడు పుణ్యలోకములకుఁ బోయెను. మరల వచ్చి రాజయ్యెను. ఈతఁడు గోవధను దెలియక చేసినాఁడు. తెలియక చేసిన పాపమైనను, పాపము పాపమే కదా! దాని

ప్రతీకారము కొఱకు నీవు రాణివైతివి. ఈతనికి నీవలన మృత్యువని తెలియఁగనే యీతఁడు రాజ్యమును వీడి యీ ద్వీపమునకు వచ్చెను. నీవును నీతని వియోగమునఁ గృత మాలా నదిలో మునిఁగి చావఁదలచితివి. కాని దైవవిధానము మార్చుట కెవరితరము? దైవవశమున మరల మీరిద్దరు కలిసికొంటిరి. తెలియక యాతఁడు నిన్నెట్లు వధించెనో అట్లే నీవును దెలియక ఆతని వధించితివి. ఇప్పుడు నీవు ఆత్మహత్యను జేసికొనకుము, నవరాత్రియందు నీవు తొమ్మిది దినములు వ్రతము నొనర్పుము. పదవ దినమున నీవు మరల వచ్చి నాగణములలో జేరఁగలవు."

రాణి ఆట్లేయొనర్చెను. పదవరోజున నామె ఆ శరీరమును దేవీ మందిరమున విడిచెను.

అక్రూరుఁడిట్లనెను:—"రాజా! ఇట్టి కథ లింకను నసంఖ్యాకములుగఁగలవు. చెప్పుమనిన వోఁ జెప్పెదను."

క్రోధముతోఁ గంసుఁడిట్లనెను :— "అక్రూరా! నిన్ను నేను నాకుపదేశమొసంగుటకుఁ బిలువలేదు. నాపని కొఱకై పిలిచితిని."

సరసతాస్వరమున నక్రూరుఁ డిట్లనెను :—"మహారాజా! నేనుపదేశించుటలేదు. నేను చెప్పినదియు నదియే. నీవు నీ యమంగళమును బోఁగొట్టు కొనఁదలఁచుచున్నావు. ఇది ఉచితమే యగును. ఎవరినైన వధించుట కానిండు ఎవరికైన నమంగళమును గోరుట మంచిదికాదు. మానవుఁడెంతటి

ప్రయత్న మొనర్చినను ప్రారబ్ధమును దుడిపి వేయఁజాలఁడు. నీవు రామకృష్ణులను జంపు యత్నము నొనర్పకుము."

కంసుఁడిట్లనెను:—"మేము రాజులము రాజ్యముకొఱకు రాజులన్నిటినిఁ జేయవలసియుండును. మేమేది చేయవలయునో, ఏది చేయరాదో అది మాకు బాగుగాఁ దెలియును. ఈ విషయములో మేము నీయుపదేశమును వినవలసినపని లేదు. నీవు బృందావనముకకు రామకృష్ణులను దీసికొని వచ్చుటకు పోయెదవా? లేదా?"

అక్రూరుఁడిట్లనెను :—"మహారాజా! నేను నాకర్తవ్యమిదియను భావముతో నీకు యథార్థవిషయమును జెప్పితిని. నేను నీకు సేవకుఁడను. నేను నీయాజ్ఞను పాలించి తీరవలయును. నీవేది ఆజ్ఞాపించినను దానిని నేను జేసెదను",

కంసుఁడిట్లనెను :—"అయితే నాయాజ్ఞ ఇదియే. నీవు వెంటనే బృందావనమునకుఁబోయి, గోపకులతో పాటుగా రామకృష్ణుల నిచ్చటకుఁ దీసికొనిరమ్ము."

అక్రూరుఁడిట్లనెను :—"మంచిది మహారాజా! రేపు నేను బృందావనమునకుఁ బోయెదను. బలరామకృష్ణులను రథముపై నెక్కించుకొని యిచ్చటకు తీసికొని వచ్చెదను."

సూతుఁడిట్లనెను :—"మునులారా! ఇట్లు పలికి కంసుని ఆజ్ఞను దీసికొని అక్రూరుఁడు తనయింటికిఁ బోయెను. కంసుఁడును నంతఃపురమునకుఁ బోయెను. ఇప్పుడిఁక నక్రూరుఁడే విధముగ బృందావనమునకుఁ బోయెనో ఆకథను జెప్పెదను."

# కేశీ సంహార కథ

౧౦౧౬

శ్లో॥ కేశీతు కంస ప్రహితః ఖురైర్మహీమ్
మహాహయో నిర్జర యన్మనోజవః
సటావధూతాభ్రవిమాన సంకులమ్
కుర్వన్నభో హేషిత భీషితాఖిలః॥

శ్రీభాగ. ౧౦స్కం. 33 అ. ౧శ్లో॥

సీ॥ ఖురపుటాహతిఁ దూలి కుంభినీ చక్రంబు
ఫణిరాజ ఫణములకు బరువు సేయ
భీషణ హేషా విభీషితులై మింట
నమృతాంధులొండొరు నంద గోనఁగఁ
జటుల చంచల సటాచ్ఛటల గాడ్పులమేఘ
ములు విమానములపై ముసుఁగుపడఁగ
వివృతాస్య గహ్వర విపుల దంతంబులు
ప్రళయాగ్ని కీలల పగిది మెఱయఁ

శ్రీమదాంధ్రభాగవతము

జీవులందఱును నదృష్టమున కధీనులై గుణానుసారముగఁ గార్యములొనర్చుచుందురు. సాత్త్విక ప్రకృతి గల భక్తులు సత్వభావముతో భగవంతుని భజించి, ఆతనిఁబొందుదురు. తమః ప్రకృతిగల వైరులు క్రోధ హింసాదుల ద్వారా భగవంతునిఁ బొందుదురు. గంగలో మంచినీరు, చెడ్డనీరు పడఁగానే అన్నియును పావనమైనట్లు భగవత్ప్రాప్తివలన నందఱకును నుద్ధారము కలుగును. సామాన్యాన్నమును దిన

నను, షడ్రసోపేతములగు రుచిగల పదార్థములు తినినను గడుపునిండును; కాని రసయుక్తములగు స్నిగ్ధ, మధురపదార్థములందు స్వాదువిశేషముగ నుండును. అదేవిధముగ భగవానునిఁ గామముచేఁగాని, ద్వేషముచేఁగాని, భయముచేఁగాని ప్రేమచేగాని భజించిన సంసారము నుండి విముక్తుఁడగును. కాని ప్రేమ మార్గమున రసము విశేషముగనుండును. అసురులు భగవానుని వైరభావముతో భజించెదరు. వారికదేమార్గమునఁ గల్యాణము కలుగును

సూతుఁడిట్లనెను :- "మునులారా! అక్రూరుఁడు బృందావనము పోవుట కంగీకరింపఁగనే కంసుఁడానందించి తన యింటికిఁబోయెను. అక్రూరుఁడు బృందావనము పోవుటకు సిద్ధపడు చుండెను."

అంత శౌనకుఁడిట్లడిగెను :- సూతా! కంసుఁడు, కేశి యను రాక్షసుని బృందావనమునకుఁ బంపెనని నీ విదివఱకే చెప్పితివి. అతఁడు పెద్ద గుఱ్ఱమురూపమును ధరించి వ్రజమునకుఁబోయెను. గదా! ఆ కేశి వ్రజమునకుఁబోయి యేమిచేసినాఁడు?"

అంత సూతుఁడిట్లనెను :- స్వామీ! నేనా ప్రసంగమును మఱచియే పోతిని. మంచిది. అయితే ముందుగా నేను మీకు కేశి కథనే చెప్పెదను. తదనంతరము అక్రూరుఁడు వ్రజమున కేవిధముగ నాలోచించుచుఁబోయెనో దానినిఁ జర్చించెదను.?

కంసుఁడు కేశిని బలరామకృష్ణులను జంపుటకుఁ బంపఁగా నాతఁడొక దినమున గొప్ప గుఱ్ఱము రూపమును ధరించి వ్రజమండలమునకుఁ జేరుకొనెను. అచ్చటికిఁబోయి వివిధోపద్రవములను గావింప నారంభించెను. అటునిటుఁ బరువిడ నారంభించెను. తనపాదముల గిట్టలతో భూమిని విదీర్ణము కావించుచుండెను ఎవరెదురుగా వచ్చిన వారిమీఁదకు గఱచుటకుఁ బరువిడుచుండెను. వెనుకటి పాదములను విదిలింప సాగెను. వ్రజవాసులాతని యిట్టి యుపద్రవమును గాంచి భయపడిరి. అందఱును "కృష్ణా! కృష్ణా! చూడవయ్యా! ఎచ్చటినుండియో గుఱ్ఱము వచ్చినది. ఈకేఁడును నొక అసురుఁడవి తోఁయుచున్నది"

భగవానుఁడు సర్వజ్ఞుఁడు. ఆతఁడు గ్రహించెను. ఈ గుఱ్ఱము మాటిమాటికిని సకిలించుచుండెను. వ్రజవాసులను భయపెట్టుచుండెను. ఈ ఉపద్రవమునంతను నీఖలుఁడు నాకొఱకే చేయుచున్నాఁడు. ఈతఁడు గుఱ్ఱపురూపమును ధరించినాఁడు. వీఁడు దైత్యుఁడు. నన్నుఁజంపుట కీతఁడు వచ్చినాఁడు. నన్నిపుడీతఁడు వెదుకుచున్నాఁడు. అప్పుడాతఁడు వాని యెదుటకు వచ్చి తాళమును జఱచి! సింహనాదము నొనర్చి, కవ్వించుచు నిట్లనెను :- "ఓరీ! దుష్టా! నీవీయమాయకపు వ్రజవాసుల నేల భయపెట్టుచున్నావు. నా యెదుటకు రారా, నేను నీపీచమణఁచెదను."

భగవానుని సింహనాదమును విని దైత్యుఁడు మండిపడెను. ఇది ఆతని కవమానముగఁదోఁచెను. భగవానుని

కవ్వింపును సహింపఁజాలక, ప్రచండ వేగశాలియును, దుర్జయుఁడును, దుర్ధర్షుఁడునగు నాదైత్యుఁడు మిక్కిలి క్రుద్ధుఁడై కన్నులెఱ్ఱఁగఁజేసి సకిలింపనారంభించెను, ఎగురఁదొడంగెను. నోరు తెరువ నారంభించెను. ఆతఁడాకాశమునే త్రాగివేయఁ దలఁచినట్లుండెను. భగవానుఁడీ గంతులకుఁ గొంచెమైనను భయపడలేదు. ఆతఁడచ్చటనే నిలిచియుండెను. ఆదుష్టుఁడును నోటినిఁ దెఱచుకొని భగవానుని వైపునకు దుమికెను. ఆతఁడత్యంత రోషమున సుకుమార శరీరుఁడును, కమలనయనుని వైపునకొక తన్నుతన్నెను. భగవానుఁడు మొదటినుండియును జాల సావధానముగ నుండెను. ఆతని తన్నును దప్పించుకొని, దుమికి, ఆతఁడు తన్నుట కెత్తిన రెండు కాళ్లను బట్టుకొని గిఱ్ఱునఁద్రిప్పి విసరివైచెను. గరుడుఁడు సర్పముఁను విసరి వేసినట్లుండెను. భగవానుఁడు విసరి వేయఁగా నాతఁడు నాల్గు నూర్ల బారల దూరమునఁ బోయిపడెను. దూరమునఁ బడుటచే నాతఁడచేతనుఁడయ్యెను. భగవానుఁడు నిలుచుండి నవ్వనారంభించెను. కొంచెముసేపటికి కాయసురుఁడగు కేశికి తెలివి కలిగెను తన పరాభవము ననుభవించి ఆతఁడలిగి, అత్యంత రోషమున నోటినిఁ దెఱచుకొని మరల భగవానుని పైఁబడెను.

ఇదివఱకు ఆతఁడు తన్ను తన్నగా భగవానుఁడాతని పాదమును బట్టుకొనెను భగవానుఁడు భక్తవత్సలుఁడు. ఆతని మీఁద నెవరు పూలను వేయుదురో వాటిని అతఁడు స్వీకరించును దెబ్బలు కొట్టిన వానినిఁగూడ గ్రహించును.

ఈసారి వాఁడు నోరును దెఱచుకొని భగవానుని వైపునకుఁ బరువిడెను. భగవానుఁడు ఆతని నోటివైపునకుఁ జేతినిఁ జాఁచెను. వానిని స్వీకరించుటకును, వానిని బట్టుకొనుటకును ఆతని అనంత కరకమలము నాతని ముఖమునఁ బ్రవేశించెను. పట్టుకొనుటకు నోటిలో నేవస్తువును దొఱకలేదు. ముఖాకాశమునఁ జేయి అట్లే పోనారంభించెను. పొట్టలోని క్షుద్రాకాశ వ్యవధానమును మహాకాశమున నేలఁగలపకూడ దనుకొనెను. ఈ వ్యష్టివ్యక్తిత్వమును సమష్టి వ్యక్తిత్వమున నేలఁగలుపరాదు. ఈ సంకల్పముతో భగవానుఁడు దాని నోటిలోఁ జేతిని దూర్చెను. భగవానునియొక్క భుజస్పర్శచే నాతని నోటిలోని దంతములన్నియును రాలిపోయెను. ఆతఁడు దంతములతోడనే కొరుకునది. అవియే ఆతని అస్త్రములు. ఇప్పుడాతఁడు కింకర్తవ్యవిమూఢుఁడయ్యెను. భుజములాతనికిఁ దప్తలోహమువలెఁ దోఁచుచుండెను. పెద్దసర్పము బిలములో దూరినట్లు భగవానుని చేయి ఆతని ముఖమునఁ బ్రవేశించెను. చికిత్సచేయని రాజరోగము పెరిగినట్లు దానినోటిలోనికి భగవానుని చేతులు పెరిగిపోవుచుండెను. ఒక గాజుసీసాకు బిరడా పెట్టి గాలి బయటకు రానట్లు భగవానుని బాహువు కేశి ముఖములోనికిఁబోయి పెరుగుటచే నాతని శ్వాస ఆగిపోయెను. రోమ రోమములనుండి చెమట బయలుదేరెను. ఆతని కన్నులు బ్రద్దలయ్యెను. ఆతఁడు భూమిపైఁబడి తన నాల్గు కాళ్లతోఁ దన్నుకొన నారంభించెను. ఆతని రాణము బయటకు వచ్చెను. పక్వమైన దానిమ్మపండు పగిలినట్లాతని

శరీరము బ్రద్దలై క్రిందఁబడెను. శ్వాస ఆగిపోవుటచే నాగు
ఱ్ఱము రూపమును ధరించిన యసురుఁడు చచ్చెను.

అసుర శరీరము ప్రాణహీనమగుటను భగవానుఁడు
కాంచి, తనకరమును వాని నోటినుండి బయటకుఁదీసెను.
భగవానున కన్నియును దెలియును. ఆతఁడు గుఱ్ఱముకాదు.
అసురుఁడు. అందువలన నాతని కేమాత్రమును విస్మయము
కలుగలేదు.

సూతుఁడిట్లనెను :- "మునులారా! మహాదైత్యుఁడగు
కేశి చావఁగానే దేవతలందఱును జాల ఆనందించిరి. భగవా
నునిపై వారు పుష్పవృష్టిని గురిపించిరి. ఈవిధముఁగ భగ
వానుఁడు కంసునిచేఁబంపఁబడిన కేశి దైత్యుఁడును జంపఁ
బడెను. నారదున కిటునిటు మాటలందించుట యనిన మిక్కిలి
యానందము. చోరునితోఁ జోరత్వ మొనరింపుమని చెప్పును.
ధనికునితో దొంగలు వచ్చెదరు జాగ్రత్తగా నుండుఁడని
చెప్పును. ఇదేవిధముగఁ గంసుని కడకు వచ్చి కృష్ణ బలరా
ములు వసుదేవుని పుత్రులనియు, నాతనికి శత్రులనియు
వారినిఁబలిపించి చంపింపుఁడనియుఁ జెప్పెను. భగవానుని కడకు
వచ్చి కంసునిఁజంపుమని చెప్పెను.

శౌనకుఁడిట్లడిగెను :- "సూతా! నారదుఁడు మధ్యలో
నెచ్చటినుండి వచ్చినాఁడు. నీవు మాకు అక్రూరుని వ్రజగమన
మును గూర్చి చెప్పుచున్నావు."

సూతుఁడిట్లనెను :- స్వామీ! నారదుఁడు సూచన చేయుటకు వచ్చియుండెను. నేను అక్రూరుని వ్రజగమనకథని ప్పుడు చెప్పుచున్నాను. వ్యోమాసురోద్ధారకథ ఒకటి మిగిలి పోయినది. దానినిఁజెప్పి తర్వాత నక్రూరుని కథను జెప్పెదను. ఇప్పుడు మీరు వ్యోమాసురోద్ధార కథను వినుఁడు."

# శ్రీ కృష్ణ నారదులు.

౧౦౧౨

శ్లో॥ విశుద్ధ విజ్ఞానఘనం స్వసంస్థయా
సమాప్త సర్వార్థమ మోఘ వాంఛితమ్।
స్వతేజసా నిత్యనివృత్తమాయా
గుణప్రవాహం భగవన్తమీమహి॥
శ్రీ భాగ. ౧౦స్కం. 32 అ. ౨౨ శ్లో॥

సీ॥ జగదీశ యోగీశ సర్వభూతాధార
సకల సంపూర్ణ యీశ్వర మహాత్మ
కాష్ఠగతజ్యోతికైవడి నిఖిల భూ
తములందు నొకఁడవై నీవు మాయ
సద్గూఢుఁడవు గుహాశయుఁడవు సాక్షివి
నీయంత వాఁడవై నీవు మాయఁ
గూడి కల్పింతువు గుణముల వానిచేఁ
బుట్టించి రక్షించి పొలియఁజేయుదు"

శ్రీమదాంధ్ర భాగవతము

నారదుఁడు భగవానుని మనస్సు. సత్యసంకల్పుఁడగు భగవానుఁడేది చేయఁదలఁచినను దాని ప్రేరణ మొదటమనస్సునకు లభించును. మనస్సు చాల దూరము వఱకాలోచించును. రాఁబోవు విషయములనుగూర్చి మననమొనర్చును. జీవుల మనస్సుతో నాలోచించు విషయము లొకప్పుడు నెఱవేరును, ఒకప్పుడు నెఱవేరవు; కాని భగవానుని మనస్సగు నారదుని ఆలోచన లన్నియును సత్యములగును. ఏలననఁగా భగవానుఁడమోఘవీర్యుఁడు. సత్యసంకల్పుఁడు కావున నారదునకుఁ దెలియని విషయములుండవు. ఆతఁడెవరికిని భయపడఁడు. భయము పాపమందుండును నిష్పాపులకు భయమేలనుండును? ఆతఁడెల్లప్పుడును నిర్భయుఁడుగ నుండును. ఆతఁడందఱితో సత్యవిషయములనే చెప్పును. అందఱు నాతని నాదరించెదరు.

సూతుఁడిట్లనెను :_ "మునులారా! కేశిదైత్యుఁడు మరణింపఁగనే నారదమహామునికి విశుద్ధ సత్యస్వరూపుఁడగు, వాసుదేవభగవానుని వ్రజమునకుఁబోయి దర్శింపవలయునను సంకల్పముకలిగెను. ఇప్పుడాతఁడు బృందావనమందలి ప్రకటలీల నుపసంహరింపఁదలఁచెను. ఇప్పుడు మధురా ద్వారకా లీల లొనర్పఁదలఁచెను. సంధి సమయమున ధ్యాన, జప, పూజ మహాత్మ్యమెక్కుడుగనుండును. అందువలననే యోగులు సంధి సమయమున ధ్యానమొనర్చెదరు. ద్విజులు సంధ్యాసమయమందే సంధ్యావందన మొనర్చెదరు. తాంత్రిక పూజలందును సంధిపూజ ప్రధానపూజగ నెన్నఁబడుచున్నది. ఇది భగవానుని సంధిలీల. బృందావనలీలయైన తరువాత మధురాలీల నొన

ర్చును. ఆతఁడాతనికి భవిష్యలీలాస్మృతిని గలిగింపవలయును. ఇదంతయు నాలోచించుకొని నారద భగవానుఁడు వీణను మీటుచు హరిగుణగాన మొనర్చుచు బృందావనమునకు వచ్చెను. భగవానుఁడు కేశినిజంపి ఏకాంతమున నుండెను. అచ్చట నెవ్వరును లేకుండిరి. ప్రేమచర్చ ఏకాంతములోనే జరుగును. రహస్యవిషయములకు వివిక్తస్థానమత్యంతావశ్యకము. ఇట్టి సుయోగమునుగాంచి, నారదుఁడు భగవానుని పాదపద్మములకుఁ బ్రణామమునుగావించి, అక్లిష్టకర్ముఁడగు భగవానునిస్తుతించెను:-"ప్రభూ! నీస్వరూపమప్రమేయమైనది. అచ్చటికి ప్రమ ప్రవేశించదు. నీవందఱను నీవైపున కాకర్షించుచుందువు, నీవు యోగేశ్వరుఁడవు మీరు సమస్తజగత్తునకును బ్రభువులు. నీవు సర్వవ్యాపకుఁడవు. సర్వాధిష్ఠానుఁడవు. నీవు యదుకుల పుంగవుఁడవు. నీవు సర్వజ్ఞుఁడవు. సర్వవిదుఁడవు, సర్వస్వరూపుఁడవు. క్షీరములందంతటను ఘృతము వ్యాపించినట్లును, ఆకాశమున వాయువువ్యాపించినట్లును, ప్రాణులందు బంచభూతములు వ్యాపించినట్లును, కాష్ఠములలో నగ్నివ్యాపించినట్లును, నీవు సర్వభూతాంతరాత్మవై యున్నావు. బుద్ధికాశ్రయుఁడవును, సాక్షియునై యున్నావు. పురుషోత్తమా! నీవు మహాపురుషుఁడవు. అందఱకీశ్వరుఁడవు. ఈ గుణముల సహాయముచేతనే నీవు ప్రపంచమునుత్పన్న మొనర్చుచున్నావు. ఉత్పన్నమైన బ్రపంచమును బాలన మొనర్చుచున్నావు. చివరకు దానినంతము నొనర్చుచున్నావు, త్రిగుణాతీతుఁడవు. అయినను నీవు త్రిగుణాత్మిక జగత్తునందు అవతరించుచున్నావు. దైత్య

లును, రాక్షసులును రాజవేషములనుత్పన్నమై పృథివీభారము నినుమడింపఁజేయఁగా, సాధువులకుఁ గష్టమును గల్పింపఁగా, ప్రజలను బీడింపఁగా నీవు మర్యాదరక్షణము కొఱకీ త్రిభువన విమోహన రూపమును ధరించితివి. ఈరూపముతో నస్త్రశస్త్రములులేకయే అనేకులగు నసురులను జంపితివి. నేఁడే నీవీయశ్వరూపమును జెందిన నసురుని లీలగాఁజంపితివి. వీఁడు సాధారణ గుఱ్ఱముకాదు. వీని సకిలింపులనువిని దేవగణమును స్వర్గలోకమునువీడి పాఱిపోయినారు. ఇప్పుడిచ్చట నింక వ్యోమాసురునిఁజంపి యిచ్చటి ప్రకటలీలను సమాప్తమొనరింపవలెను. రేపు నీవు మథురాపురికి విచ్చేయుదువు. ఎల్లుండి నేను స్వయముగ నీచేతఁ జాణూర, ముష్టికాది మల్లులు చచ్చుటను గాంచెదను"

భగవానుఁడిట్లనెను :- "నారదా! నీవేమనుచున్నావు. నేను జిన్నపిల్లవాఁడను. నేనింతటి గొప్పమల్లుల నెట్లు చంపఁగలను ?"

నవ్వినారదుఁడిట్లనెను - "స్వామీ! నీవు బాలకుడవు కావు,అసురకుల ఘాలకులు. సమస్తవిశ్వప్రతిపాలకులు. మల్లులు నీముందేమి లెక్క. నీవు మదోన్మత్తమగు గువలయాపీడ గజమునుగూడ నాశమొనర్చెదవు. ఇంకెవరిసంగతియో యేల? నీవు పదివేల యేనుఁగుల బలముగల కంసునిగూడ చంపెదవు. చచ్చినగురుపుత్రునిఁ దెచ్చుటకై సముద్రములోనుండు శంఖాసురునిఁజంపెదవు. కాలయవనుని నీచేతఁజంపక ముచుకుందుని

దృష్టి చేఁ జంపించెదవు. నీ ప్రియురాలి సంతోషముకొఱకు స్వర్గమునుండి పారిజాతవృక్షమును బెకలించి తెచ్చెదవు. అచ్చటికిఁబోయి నీవు దేవేంద్రునిఁ బరాజితుఁ గావించెదవు. నీవు వివిధవేషములతో వివిధవిధముల వీర్యమునుజూపించిరాజ కన్యలను జాలమందిని వివాహమాడెదవు. నృగమహారాజు నుద్ధరించెదవు. సత్రాజిత్తుని కుమార్తెయగు సత్యభామను వివాహమాడెదవు. శ్యమంతకమణిని అరణముగఁబొందెదవు. రుక్మిణీ, సత్యభామ, జాంబవతి, కాళిందీ, నాగ్నజితి మొదలగు ననేక రాజకన్యకల వివాహమాడెదవు"

భగవానుఁడిట్లనెను :- "నారదా! నీవు నావివాహము లను జాల లెక్కించితివి."

నారదుఁడిట్లనెను :- స్వామీ! నేనుజాలకొలఁదిమందినే చెప్పితిని. నీవుపదునాఱువేలనూటయెనిమిది వివాహములను జేసి కొనెదవు. చచ్చిన బ్రాహ్మణపుత్రుని గాలునినుండి తెచ్చెదవు. పౌండ్రకు నుద్ధరించెదవు. సుదర్శన చక్రముచేఁగాశీకాపురినిఁ గాల్చెదవు. దంతవక్త్రునిఁ జంపెదవు. రాజసూయ యాగమున శిశుపాలుని శిరమును నరికెదవు. ఎంతని చెప్పఁగలను. ద్వారకా పురిలోనుండి నీవనేకవిధములగు శ్రుతమధురలీలలను జేయుదువు నీవేదిచేసినను గర్మబంధనమునకులోఁబడిచేయవు. కర్మఫలములు నిన్ను స్పృశింపనైన స్పృశింపవు. ప్రపంచమున నుండియును నీవు సంసార కర్మఫలములకు దూరముగనుందువు. నీదివ్య కర్మలు ప్రపంచమున దివ్యముఖప్రసార మొనర్చుటకై యేర్ప

డును. కవిగణములు నీకలితకీర్తిని, నీదివ్యలీలలను దమతమ కార్యములందు పఠించెదరు. వాని నెవరు వినెదరో వారి కర్మబంధనములు తొలఁగిపోవును. నీ వెప్పుడు వ్రజలీలలను, మధురాలీలలను, ద్వారకాలీలలను నుపసంహరింపఁదలఁతురో అప్పుడు రాజులకు బరస్పరము పోరించెదవు. నీవస్త్రముఁను బట్టకయే భూభారమును హరించుటకై కాలరూపుఁడవై అర్జునునకు సారథివై అక్షౌహిణీలకొలఁది సైనికులను జంపించెదవు."

శ్రీకృష్ణుఁడిట్లనెను :- "నారదా! నీవు మాబలరామ అన్నగారి వద్దకు పోయిరాలేదు. నీవేమియును తిక్కమందు త్రాగిరాలేదు గదా! కొంచెముసేపు నన్ను నీవు కాలుఁడనందువు. జగత్పాలకుఁడనందువు. రక్షకుఁడను, సంహారకుఁడ నందువు. ఇంత గొప్ప గొప్ప కార్యములను నేనెట్లు చేయఁ గలను?"

నారదుఁడిట్లనెను :- "ప్రభూ! నీవు పరమానంద స్వరూపుఁడవు. విశుద్ధవిజ్ఞానఘనుఁడవు. నిత్యుఁడవు అమోఘ వీర్యుఁడవు. షడైశ్వర్య సంపన్నుఁడవు. సర్వేశ్వరుఁడవు. సర్వ స్వతంత్రుఁడవు. నీమాయచే సమస్తభేదకల్పనములను రచించు వాఁడవు. నీవు లీలకొఱకే యీమానవ శరీరమును ధరించితివి. నీవేమైనను జేయఁగలవు. నీకసంభవమనునది లేదు. నేను సర్వే శ్వరుఁడవగు నీపాదపద్మములకుఁ బ్రణామమొనర్చుచున్నాను.

ఇప్పుడిఁక నాకు పోవుట కాజ్ఞనిండు, ఇంతవఱకు నేను నీ వ్రజ లీలను గాంచితిని. రేపటినుండి నీమథురాలీలలను జూడఁ గోరుచున్నాను.”

సూతుఁ డిట్లనెను :- “మునులారా! భగవద్భక్తులలో సర్వశ్రేష్ఠుఁడగు నారదమహాముని భగవచ్చరణములకుఁ బ్రణామముకావించి, ఆతని దర్శనముచే నత్యంతానందమును జెంది, తన వీణను సవరించుకొని, దానినానందముతో వాయించుచు, భగవానుని మాటిమాటికినిఁ గాంచుచుఁదన యిచ్ఛానుసారముగ వైకుంఠలోకమునకుఁ బోయెను. ఇప్పుడే విధముగ వ్యోమాసురు నుద్ధరించినదియు మీకుఁ జెప్పెదను. మీరందఱును సమాహితచిత్తులరై వినుఁడు.”

## వ్యోమాసురోద్ధారము

౧౦౧౮

శ్లో॥ మయపుత్రో మహామాయో వ్యోమోగోపాల వేషధృల్
మేషాయితానపోవాఁహ ప్రాయశ్చారాయితో బహూన్॥

శ్రీభాగ. ౧౦ స్కం. 32 అ. ౩శ్లో॥

శ్లో॥ ఆలో దొంగలలో మయాసురసుతుండాద్యుండు వ్యోముండుగో
పాలుండైచని మేషకల్పనలతో భాసిల్లి క్రీడించుత
ద్బాలవ్రాతము నెల్ల మెల్లన చతుః పంచావశిష్టంబుగా
శైలాంతర్గుహలోనికింగొనిచనెం జౌర్యం బవార్యంబుగన్॥

—శ్రీమదాంధ్రభాగవతము.

ఏరహస్యములులేనివాఁడే సఖుఁడు, ఆతనితో విడమఱచి ఆడుకొనుటయును, హృదయలోని విషయములను అడుగుట యును, హృదయములోని విషయములను జెప్పుట యునుజరుగును. అట్లు సుహృదుఁడుకాక, కపటసుహృదుఁడై కపటవేషమును ధరించినచోఁ గొంతకాలమునకు వాని మాయ సాగినసాగవచ్చునుగాని ఆతని మాయ బయటఁబడినపుడు వాని కంతము కలుగును. జీవుని తనమాయచే జీవుఁడు మోసగింప వచ్చునేమో కాని భగవంతుని మాయచే మోసగించు టెట్లు సంభవింపఁగలదు?

సూతుఁడిట్లనెను :_ "మునులారా! భగవానుఁడు చాల మంది అసురులను బడనైచి చంపఁగాఁగంసుఁడు మయాసుర పుత్రుడుఁను మహామాయావియునగు వ్యోమాసురునిఁబిలిచి యిట్లనెను:_ "మిత్రవరా! నేను నందకుమారుఁడగు శ్రీకృష్ణునిఁజంపుటకై చాలమంది అసురులనుబంపితిని. వారు భిన్నభిన్నరూపములను ధరించి ఆతని కడకు బోయిరి. ఆతఁడు నేనుబంపిన మాయావులగు నసురులనందఱను జంపివైచినాఁడు. ఇప్పుడు నీవొక్కఁడవే నాకాధారము. నీవు నాకుగొంచెముగ సహాయమొనరించెదవా?"

వ్యోమాసురుఁడిట్లనెను ._ "రాజా! నీవేది యాజ్ఞా పించిన దానినే నేను జేసెదను."

కంసుఁడిట్లనెను :_ శ్రీకృష్ణుఁడెట్లైనఁ జంపఁబడవల యునని నాకోరిక"

వ్యోమాసురుఁడిట్లనెను :- "నేను వానినిఁజంపెదను."

కంసుఁడిట్లనెను:- "ఓయీ! ఆతఁడు చాలబలవంతుఁడు. ఆతఁడు గొప్పగొప్పబలశాలురను, మాయావులగు రాక్షసులను నిమిషములోఁ జంపినాఁడు."

వ్యోమాసురుఁడిట్లనెను:- "ఇంతవఱకు నీవుమాయావులగు నసురులను మాత్రమే పంపితివి. కాని నేను మహామాయావిని. ఆయసురులు పొరపాటుచేసినారు. వారు విజాతీయ వేషమునుధరించి వెడలిరి. ఒకఁడు వత్సమైపోయెను. ఇంకొకఁడు కొంగయై, మఱియొకఁడ జగరుఁడై, వేఱొకఁడు గాడిదయై' అన్యుఁడు గుఱ్ఱమై పోయిరి. విజాతీయ వేషములలోఁ బ్రీతియుండదు. అందువలన శ్రీకృష్ణుఁడు వారినందఱను గుర్తించినాఁడు. నేనాతని జాతివాఁడగు గోపకుఁడనై పోయెదను. వందలకొలఁది గోపకులున్నారు. వారిలో నేను నొక్కఁడనయ్యెదను. సమయమునుజూచి నేనాతనిఁజంపివైచెదను."

కంసుఁడిట్లనెను :- "మంచిది నీవును నీశక్తినిఁ బ్రయోగింపుము. భగవానుఁడు నీకు మంగళ మొనర్చుఁగాక!"

ఇది విని వ్యోమాసురుఁడు బృందావనమునకుఁ బోయెను.

శ్రీకృష్ణుడు నిత్య నియమానుసారముగ గొల్లపిల్లలను వెంటఁబెట్టుకొని వనమునకు గోవులను మేపుటకుఁ బోయెను. నియమానుసారముగ్రసఘన వనమునకుఁజేరి యమునా పులినమందు పచ్చిగడ్డిమీఁదను మేయుట కావులను విడిచెను. బాలకులు సుఖముగ నాటలలో నిమగ్నులై యుండిరి.

గోపకులిట్లనిరి :- "కృష్ణా ! నేఁడేమి యాటనాడు కొందుము ?"

భగవానుఁడిట్లనెను :- "సోదరులారా ! మీకే యాట యిష్టమైన దాని నాడు కొందము. నాకోరిక నేఁడు గొఱ్ఱెలను దొంగిలించు నాట నాడు కొందుము."

గోపకులిట్లనిరి:- "గొఱ్ఱెల దొంగాట యెట్లుండును?"

భగవానుఁడిట్లనెను :- "ఓరీ! మీరు మఱచితిరా యేమి ? కొన్ని వేఁప యీనెలను దీసికొనిరండు. దాని యాకులను దూయుఁడు. కొన్నిటికి దీయవలదు, చేతిలో దాచుకొనుఁడు. అందఱును దానిని లాగుచుండవలెను. ఎవరి చేతిలోనికి ఆకులున్న యీనెలు వచ్చినవో వారు దొంగలు. మిగిలినవారు గొఱ్ఱెలు. ఇద్దరు ముగ్గురు వానినిఁ గాయువారుందురు. పిల్లలందఱును గొఱ్ఱెలై ఒక మందగా నుండిరి. పాలకులగువారు వస్త్రములను త్రాడుగాఁ జేసి వానికిఁ గొరడాలుగాఁ జేసిరి ఆ కొఱడాలతో గొఱ్ఱెలను రక్షింపవలయును. కాపలా కాయవలయును. కాపలా కాయువారు, నిద్రించినను, అజాగ్రత్తగ నుండినను దొంగ లైన పిల్లలు గొఱ్ఱెలైన పిల్లలను దీసికొని పోవుదురు. మేల్కొని నచోఁ బాలకులైన పిల్లలు దొంగలను బట్టుకొనుటకు బరువిడెదరు. మేల్కొనినచోఁ బాలకులైన పిల్లలు దొంగలను బట్టుకొనుటకు బరువిడెదరు. అప్పుడితర దొంగలు వెనుక నున్న గొఱ్ఱెలను గొని పోవుదురు."

గోపకులిట్లనిరి :_ "మంచిది, కృష్ణా! నీవును, బల రాముఁడును, దమ్ముడును, సుదాముఁడును బాలకులు కండు. చోరులైనవారు చోరులగుదురు. మిగిలినవారు గొర్రెలగు దురు. నేఁటి ఆటయిదియే."

పిల్లలందరును గలిసి దొంగలపేర్లను బిలువ నారంభిం చిరి. ఆదినమున నొక గోపబాలకుఁడు రాలేదు. వ్యోమా సురుఁడా గోపబాలకుని వేషమును ధరించి బాలకులలోఁ గలిసెను. ఇంకెవరును నాతని గుర్తింపలేదు. వీఁడసురుఁడని భగవానుఁడు కనిపెట్టెను. వీఁడు గోపబాలకుఁడై వచ్చి నాఁడు. సరే, వత్సా! నీవాటలోనికి వచ్చినావా? నేను నీయాటను బూర్తికావించెదనులే."

పిల్లలాటలో దొంగలైరి. వాఁడు యథార్థమగు చోరుడు. చోరుఁడు తన యథార్థ వేషమును దాచుకొనును. ఆతఁడు తన యసురవేషమును దాచుకొనెను. ఇప్పుడాతఁడు బాలకులను దీసికొనిపోయి చాల లోతగు నొక పర్వత గహ్వ రమునఁబడవైచి దానికడ్డముగ నొక గొప్ప శిలను నడ్డముగ వైచెను. ఈ విధముగ నాతఁడు బాలకుల నందఱను గుహాలో దాచెను, కేవలము నలుగురైదుగురు బాలకులు మాత్రము మిగిలి యుండిరి.

పిల్లలాటలలో మగ్నులై యుండిరి. కాని శ్యామసుం దరుని దృష్టి గొల్లపిల్లవాడుగ నుండిన నాయసురుని మీఁ దనే యుండెను. గుహాలో బంధింపఁబడిన యా గోపకుల

వివశత ఆతని స్మరణకు రాఁగానే శ్యామసుందరునకు దుఃఖము కలిగెను. భక్తవత్సలుఁడగు భగవానుఁడు వాని కుకృత్యమును స్మరించి క్రుద్ధుఁడయ్యెను. ఆతఁడు మెదలక నొక గోపాలుని దీసికొని పోఁగానే భగవానుఁడు పరుగెత్తుకొని పోయి వానినిఁ బట్టుకొని దొంగ దొంగ యనుచు వానిని నలుప నారంభించెను. ఆతఁడిట్లనెను :- "కృష్ణా! ఆటలో నిట్లు కొట్టెదవేల? ఆటలో నెవరును నిట్లు కొట్టరు. నేను నిజముగ దొంగనని నిజముగఁ గొట్టుచున్నావు. సింహము గొఱ్ఱెలనణఁచి వేయునట్లు వానినణఁచుచు భగవానుఁడు వానితో నిట్లనెను :- "దొంగలకుఁ గొమ్ములుండవు. నీవు చోరుఁడవుకాదు మహాచోరుఁడవు. ఇప్పుడు నీవు నీజీవితమంతమైనట్లు భావించుము. అని పలికి భగవానుఁడు వాని గొంతును బిసుక నారంభించెను.

కృష్ణుడు తన చాతుర్యమును గ్రహించినాఁడని ఆతఁడు గ్రహించెను. ఇప్పుడాతఁడు తన మాయవేషమును త్యజించెను. ఇప్పుడాతఁడు విశాల పర్వతమువంటి మహాభయంకర వికట రూపమును జెందెను. శ్రీకృష్ణుడు వానినిఁ గాంచి కొంచెమైనను భయపడలేదు. ఆ మహాబలవంతుఁడగు దానవుఁడు భగవానుని చేతిలోఁబడుటచే వ్యాకులుఁడై ఆతని చేతినుండి తప్పించుకొనుటకుఁ బ్రయత్న మొనర్ప నారంభించెను. కాని ఆతఁడు సఫలుఁడు కాలేదు.

భగవానుఁడు నవ్వి యిట్లనెను :- "ఓరీ! ఇప్పుడు నీవేల లాగుకొనుచున్నావురా? నేను పట్టుకొనిన వదలి

పెట్టుట యెఱుఁగను. ఒక్కసారి పట్టుకొంటినా వానినిఁ విడుచునది లేదు.” ఇట్లు పలికి భగవానుఁడాతని రెండుచేతుల చేఁబట్టుకొని నేలమీఁదఁ బడవైచెను. అంత నాతనిపైఁ గూర్చుండి ఆతని నలుప నారంభించెను. వాని కంఠమును నలిపి పిడికిలితో గ్రుద్ది బలి పశువువలె నాతని నిర్జీవునిఁ గావించెను. గోపాలురైన పిల్లలా యసురునియొక్క భయంకర విశాలరూపమును గాంచి చకితులై సంభ్రమముతో భగవానునితో నిట్లనిరి :- “కృష్ణా! వీడు గోపకుఁడు కాఁడు. రాక్షసుఁడు. నీ వతని నెట్లు గుర్తించితివి?”

శ్రీకృష్ణుఁడిట్లనెను :- ఓరీ! మీరేమి ఆటగాండ్రు! మీరు మీ అనుచరులను గూడ గుర్తింపలేరైరేమి? వానిని నేను మొదటనుండియును గనిపెట్టియే యున్నాను. ఈ దుష్టుఁడు మన సహచరుల నెచ్చట దాచినాఁడో, అచ్చట నుండి వారినిఁదీసికొని వచ్చెదము.” ఇట్లు పలికి యే గోవర్ధన గుహాలో వీరు దాచఁబడిరో అప్రాంతమున కా గోపకులతోఁ గూడి భగవానుఁడు వచ్చెను. అచ్చటికిఁ జేరి ఆతఁడాగుహకు వైచిన శిలను దీసివైచెను. జీఁకటిలో నాగోపబాలురు విల విలఁగొట్టుకొనుచు భయపడి యేడ్చుచుండిరి.

భగవానుఁడు నవ్వుచు నిట్లనెను :- “ఓరీ! ఏడ్చెద రెందులకురా! మీ అమ్మమ్మ చచ్చిపోయినదా యేమి? భగవానుని వాక్కును వినఁగానే అందఱ హృదయకమలములు వికసించెను. వారు ప్రేమ రోషమున నిట్లనిరి :- “ఓయీ!

కృష్ణా ! నీవుండినను ఆటలో నింతటి అన్యాయమా ? ఆట లలో నిట్లు దాచెదరేమో చెప్పుము. ఇంకను గొంచెము సేపటివఱకు మీరు రాకుండినచో మేము జీవించెడు వారము కాము. ఇచ్చటికి గాలిగాని వెలుతురుగాని వచ్చుటలేదు. ఇట్లన్యాయ మొనర్చినదే గోపకుఁడు ? నీవు వానిని దండింప వలయును."

భగవానుఁడిట్లనెను :- "ఆ త డు గోపకుఁడుకాఁడు రాక్షసుఁడు. ఆతఁడు గోపకుని వేషము వేసికొనినాఁడు. వాఁడీ లోకములోని లీలను సమాప్త మొనర్చుకొనునట్లు వానిని నేను దండించితిని. పోయి మీరు చూడుఁడు, పర్వ తమువలె వాని శరీరమచ్చటఁ బడియున్నది. మీరు పోయి దానినిఁజూడుఁడు."

అందఱానందమును బ్రకటించుచు నిట్లనిరి :- ఓరీ ! కృష్ణా ! నీవు మమ్ములను బాగుగా రక్షించితివి. తప్పక యీ కార్యము రాక్షసునిదే. కాకున్న నిట్టి కార్యమును మన సహచరులలో నెవరును జేయఁజాలరు." ఇట్లు పలుకుచు వారందఱును గుహనుండి బయటకు రాలేదు. అంత నందఱును గలిసి వ్యోమాసురుని భయంకర శరీరము పడియుండిన చోటునకు వచ్చిరి. దానినిఁగాంచి అందఱును నాశ్చర్యచకితు లైరి. పైన విమానములమీఁద నుండి దేవతలు భగవా నునిఁ బ్రశంసించుచుండిరి. కల్పవృక్ష పుష్పములను వర్షించు చుండిరి. క్రింద గోపబాలురు మదన మోహనునిఁ గౌఁగిలించు కొనిరి. ఆతనిఁ బ్రశంసించుచుండిరి.

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఈ విధముగ వ్యోమాసురునిఁజంపి భగవానుఁడు గోపబాలకులతోఁగూడి గోవులను దీసికొని సాయంకాలమునకు వ్రజమునకు వచ్చిరి. ఇది బృందావనమందలి ఆతని అంతిమ అసుర సంహారము. అంతిమ గోచారణము. ఇప్పుడిఁక బృందావనమందలి ప్రకట లీల నుపసంహరించి మధురకు విచ్చేసెనో ఆవర్ణనమును నేను జేసెదను. కంసుఁడు చెప్పఁగా నక్రూరుఁడెట్లు వ్రజమునకు వచ్చెనో ఇప్పుడా ప్రసంగమును శ్రవణము చేయుఁడు."

## వ్రజమున కక్రూరుఁడు

౧౦౯

శ్లో॥ అక్రూరోఽపిచ తాంరాత్రి మధుపుర్యాం మహామతిః।
ఉషిత్వా రథమాస్థాయ ప్రయయౌ నందగోకులమ్॥

శ్రీ భాగ. ౧౦స్కం. 35 అ, ౨ శ్లో॥

వ. అంత నారాత్రి మధురానగరంబున నక్రూరుండు వసియించి మఱునాఁడు రేపకడ లేచి నిత్యకృత్యంబు లాచరించి రథంబెక్కి కదలి నంద గోకులంబునకుం జనెను."

—శ్రీమదాంధ్రభాగవతము.

మనము సదా యెవరిని స్మరించు చుందుమో, ఎవని కీర్తిని వినుచుఁ గర్ణకుహరములను నింపుకొనుచుందుమో, ఎవరిని దర్శనముకొఱకు కన్నులు తృప్తి చెంది యుండునో,

దైవవశమున నాతని దర్శనము సంభవించినచో నాసమయముల నంతఃకరణముయొక్క స్థితి యెట్లుండునో దానినిఁ బ్రేమభక్తుఁడు తప్ప యింకెవరును దెలిసికొనఁజాలరు. దీనినే పూర్వానురాగమందురు. కవియొక్క భావమును కవితను విన్నను, ఒకానొక మహాపురుషుని హృదయస్పర్శియగు జీవితమును విన్నను, ఒకానొక సాధుపుంగవుని కవితకీర్తిని విన్నను వారిని దర్శింపవలయునను నాంతరికేచ్ఛ సహృదయుల కందఱకుండును, కాని మనమెవరినిఁ గలిసికొనఁదలఁచుచున్నామో ఆతని కనేక లోకబంధనముల వలన గలిసికొనఁజాలము. ప్రేమికులయొక్క ప్రథమ సమ్మేళనము జరుగుటయే కఠినము. సమ్మేళనము కలిగినను నొక్కచోట నధికదినములు కలిసి మెలసి యుండుట అత్యంత కఠినము. మానవుఁడు పరిస్థితులకు వివశుఁడై కోరికయున్నను దను ప్రేమించినవారితోఁ గలిసికొనఁజాలఁడు. మధ్యలో లోకబంధనము లేనిచో గోపికలింత విరహక్లేశమును సహింపవలసిన పనియుండెడిదికాదు. బృందావనమునుండి మధుర రెండుక్రోసులైనను లేదు. రోజునకు నాలుగుసార్లు రాకపోకలను జరుపవచ్చును; కాని శ్రీకృష్ణుడును స్వయముగ వ్రజమునకు రాలేదు. గోపికలును నచ్చటికిఁబోయి ఆతనిఁ గలిసికొనెడువారును గారు. ఇద్దరును విరహమునఁ గొట్టుకొను చుండిరి.

అక్రూరుఁడు భగవానుని యొక్క పరమభక్తుడు. శ్రీకృష్ణుఁడు పరాత్పర బ్రహ్మయనియు, నాతఁడు వ్రజమందు నివసించు చున్నాఁడనియు నాతనికిఁ దెలియును. కాని

పదునొకండు సంవత్సరములైనను కోరికయుండియు నాతఁ
డొక్కదినమైనను భగవద్దర్శనమునకై వ్రజమునకు రాఁజా
లకపోయెను. మనస్సులోని కోరికను మనస్సులోనే ఉంచు
కొనెను. దైవవశమునఁ గంసుఁడు రామకృష్ణులను దెచ్చు
టకై ఆతని వ్రజమునకుఁబంపెను. దీనివలన నాతని హర్షము
నకు మేరలేకుండెను. దప్పిక చెందినవానికి చక్కని శీతల
సుగంధిత జలము దొరకినట్లును, అత్యంతాఁకలిచే బాధపడు
వానికి చక్కని రుచిగల షడ్రసోపేతాన్నము దొరకినట్లును,
గ్రుడ్డివానికి కమల సదృశములగు నేత్రములచ్చినట్లాతని
కుండెను. ఆతఁడు శత్రువునకు దూతయై పోయినప్పటికిని
శ్రీకృష్ణుఁడు సర్వజ్ఞుఁడని ఆతనికిఁ దెలియును. తన మనో
గతభావము లాతనికిఁ దెలియకపోలేదు. కావున నాతని కేవిధ
మగు శంకయును లేకుండెను. ఆతఁడు ప్రియుని దర్శించుటకై
అత్యంతోత్కంఠతతోఁ బోయెను.



సూతుఁడిట్లనెను :- "మునులారా! ఇంతవఱకు మ
ధ్యలో కేశీవ్యోమాసురుల కథలను బ్రసంగవశమునఁ జెప్పి
తిని. నేనిప్పు డక్రూరుని కథనుగూర్చి చెప్పెదను వినుఁడు.
కంసుని యాజ్ఞను బొంది అక్రూరుఁడింటికిఁ బోయెను. నేఁడా
తని హృదయము ప్పొంగుచుండెను. అంతఃకరణముయొక్క
ఆనందము ముఖముపైనఁ బ్రతిబింబించును. అక్రూరుని
పత్ని యిట్లడిగెను :- "ప్రాణనాథా! నేఁడు మీరు మిక్కిలి
ఆనందముగఁ గనఁబడుచున్నారే! నేఁడట్టి వస్తువేమి లభించి

నది? కంసమహారాజు మీ కేమైనఁ బారితోషికము నిచ్చి నాఁడా యేమి?"

తన యానందమును దాచుచు నక్రూరుఁడిట్లనెను :- "లేదు. అట్టిదేదియును లేదు. మహారాజు రేపు నన్నొక విశేషకార్యముమీఁద వ్రజమునకుఁ బొమ్మని ఆజ్ఞాపించి నాఁడు. రేపు ప్రాతఃకాలముననే నేను వ్రజమునకుఁ బోవల యును. దీనిని గూర్చియే విచారించుచున్నాను. నందుని, ఇతరగోపకులను గలిసికొనవచ్చును. నీ పెద్ద తోడికోడలు రోహిణీదేవి అచ్చటనే యున్నది. ఆమెపుత్రుఁడగు బలరా ముని, నందనందనుని రథము మీఁదఁగూర్చుండఁ బెట్టుకొని యిచ్చటకుఁ దెచ్చెదను."

అక్రూరుని భార్య యిట్లనెను :- "ప్రాణనాథా! కంసునకు దుష్టవిచారము లేదుకదా! కంసుఁడు రామకృష్ణుల మీఁదఁ బట్టించినాఁడని నేను వినుచున్నాను. ఆతఁడా యిద్దర పిల్లలను జంపఁదలఁచు చున్నాఁడఁట."

అక్రూరుఁడిట్లనెను :- ఇట్టిమాటను నోటితో ననఁ గూడదు, ఎవరైన వినినచో మనకు విపత్తు వచ్చి పడును."

అక్రూరపత్ని యిట్లనెను :- "ఇచ్చట నెవరు వినఁ గలరు."

అక్రూరుఁ డిట్లనెను :- గోడలకు చెవులుండును. నోట వచ్చినమాట ఎన్నటికైనను బ్రకటమగును. నీవేమియును శంకింపకుము. సర్వాంతర్యామియగు ప్రభువు సర్వమంగళ ముల నొనర్పఁగలఁడు."

ఇది విని అక్రూరపత్ని మెదలకుండెను. సాయంకాల కృత్యము లొనర్చుకొని అక్రూరుఁడు శయ్యపైఁబరుండెను. నేఁడాతని కంటనిద్దురలేదు. ఆనందముచే నాతని హృదయము పొంగుచుండెను. అటునిటుఁ బొర్లుచు నెట్లో ఆతఁడా రాత్రిని గడిపెను. అరుణోదయమునకు ముందే ఆతఁడు లేచెను. లేవఁగానే ఆతఁడు విష్ణుస్మరణమును గావించెను. అఱచేతినిఁజూచుకొని భూమికి వందన మొనర్చి ఆతఁడు లేచెను. ప్రాతఃకాల కృత్యము లొనర్చుకొని ఆతఁడు చొక్కాను దొడుగుకొని నడుమునకుఁగట్టు కట్టుకొనెను. తలపాగను ధరించి రథమును దీసికొని చీఁకటితోనే ఆతఁడు మధురాపురి బయటకువచ్చెను.

జీవి సాంసారిక కార్యములందున్నంత వఱకు వాని హృదయమందు సాంసారిక పదార్థములే యుండును. ఆతఁడు నడుమును బిగించి శ్రీకృష్ణుని సమీపమునకు వెడలుట కుద్యుక్తుఁడు కాఁగానే అప్పుడాతని హృదయమందు కమల నయనుఁడగు శ్రీకృష్ణుని యందుఁ బరాభక్తి ప్రాదుర్భావ మయ్యెను. సాంసారిక పదార్థములనుండి మనస్సును మఱలించుట చాల కష్టము. సాంసారిక సంకల్పముల నుండి మనస్సును మఱలించి భగవత్సన్ముఖ మొనర్చి భగవానుని వైపునకుఁ బోయినచో నాతని హృదయము భావుకభక్తుల వలె నగును. అక్రూరుని హృదయమందు రాజకార్యము లొనర్చుచున్నను భగవద్భక్తి యుండెను. కాని ఆతఁడు రథమును దీసికొని భగవానుని వైపునకుఁబోఁగానే ఆతనికి

మార్గమునఁ బరాభక్తి ప్రకటమయ్యెను. ఇప్పుడాతనికిఁ దన సౌభాగ్యమునకు గర్వము కలిగెను. జీవి సంసారమున నున్నంతవఱకు వానిని నానావిధములగు నభిమానములు చుట్టు ముట్టును. నేను బ్రాహ్మణుఁడను. పండితుఁడను. సుందరుఁడను, కులీనుఁడను, ఈశ్వరుఁడను, సిద్ధుఁడను, బలవంతుఁడను, సుఖిని, ధనవంతుఁడను. భోగించు భాగ్యవంతుఁడనని అనేకవిధములగు నభిమానములలోఁ బడిపోవును; కాని ఆతఁడు భగవంతుని వైపునకుఁబోయినపుడు, భక్తిమార్గమున నడుగిడినపుడు ఆతనికి దీనతాపాలకి వచ్చును భక్తిమహారాణిని మోయునది దీనతా దేవి. భక్తులకుఁ దనసాధనము మీఁద నెన్నటికినివిశ్వాసముండదు వారే సాధన చేసినను నభిమానమునకు వశీభూతులై చేయరు. తమ ప్రాణనాథుఁడు తమచే నేమి చేయించుచున్నాఁడో దానినే చేయుచున్నామని వారు భావించెదరు. వారెన్నఁడును తాము భగవత్సన్నిధికిఁబోవుటకధికారమున్నదని అనుకొనరు. భగవానుఁడు వారినిఁ దమ వైపునకు లాగుకొనిన, వారు భగవంతుని భక్తవత్సలతను స్మరించి ఆనందమగ్నులగుదురు. వారు మాటిమాటికిని దాము దీనాతిదీనుల మనుకొనుచునిట్లను కొందురు :- "మేము దీనికి సర్వథా అయోగ్యులము. భగవానుఁడే దయతో మమ్ములను దనవైపునకు బిలిచినాఁడు."

అక్రూరుఁడును మార్గమున నిదే తలఁచు చుండెను :- "నేఁడు నాకు భగవద్దర్శనమగుట నిజమేనా? నేను స్వప్నమును గాంచుట లేదుకదా?" అని యిట్లాలోచించుకొనుచు

మాటిమాటికి కన్నులను నులుముకొనుచుండెను :- "ఇది స్వప్నముకాదు. నేను మేల్కొనియే యున్నాను. రథము మీఁదఁగూర్చుండి యున్నాను. గుఱ్ఱములు పరువిడుచున్నవి. అవి వ్రజమువైపునకు వేగముగఁబోవుచున్నవి. గుఱ్ఱములిట్లే పోవుచో నివి తప్పక నందగోకులమునకుఁ జేరగలను. బృందావన పరమ పావన భూమిలో నాకు ప్రవేశము కలుగును. బృందావనములో నందుని యింటికిఁ జేరుకొనఁగలను. అచ్చట శ్రీకృష్ణుని దర్శనము కలుగును; కాని పాపులకు ప్రభు ప్రాప్తి అత్యంత దుర్లభము. ఈ జన్మలో నేనే పుణ్యకార్యమును జేసియుండలేదు. జీవితమంతయును నితరులకు సేవ చేయుటలోనే గడచిపోయినది. రాజు ఉచితములగు నాజ్ఞ నొసంగినను అనుచితమగు నాజ్ఞ నొసంగినను బాలించి తీర వలసి వచ్చెను. ఇట్టి పాపులకును భగవద్దర్శనమగుట అత్యంతాశ్చర్యకరమగు విషయము.

ఉ॥ ఎట్టి తపంబు సేయఁబడె నెట్టి చరిత్రము
లబ్ధమయ్యెనో
యెట్టి ధనంబు లర్థులకు నీఁబడెనో
తొలిబాము నందు నా
యట్టి వివేకహీనునకు నాదిమునీంద్రులు
యోగదృష్టులం
బట్టఁగ లేని యీశ్వరుని బ్రహ్మయున్ హాఁ
జాడఁగల్గెడిన్॥

శ్రీమదాంధ్రభాగవతము.

మరల నిట్లనుకొనెను :– "భగవానుఁడు శుభకర్మల చేతను, తపముచేతను, దానాది సాధనములచేతను బ్రాప్తింపఁడు. శుభకర్మల ఫలము స్వర్గాది సుఖములు. శుభకర్మల చేతనే ప్రభువు లభించుననుట అబద్ధము. నేను జపతపాది పుణ్యకర్మలను జన్మజన్మాంతరములలోను జేసి యుండను. అట్టి కర్మ లేవైనఁ జేసియుండిన నేను దాసత్వమును నీ నీచ వృత్తి నేలఁ జేయుదును? మానవునియొక్క వర్తమాన స్థితి మూఁడుజన్మలను జెప్పును. పూర్వజన్మమందు జెడ్డకర్మ లొనర్చినవాఁడీ జన్మమున దరిద్రదుఃఖము ననుభవింపవలసి యుండును. దరిద్రము వలననే మానవుఁడు దానాది పుణ్యకర్మ లొనర్పడు. చెడ్డకర్మలలోఁ బ్రవృత్తినిఁ జెందును. రాఁబోవు జన్మయందును నాతనికి నీచజన్మ వచ్చును; కావున నేను పూర్వజన్మమున నేసుకృతమును జేసియుండలేదు. ఇప్పుడును నే సుకృతమును జేయుట లేదు. నాకు భగవంతుని దర్శన మెట్లు కాఁగలదు?"

ఆతఁడింక నిట్లు తలఁచెను :– "కాని భగవంతుఁడు శుభకర్మలొనర్చు పుణ్యాత్ములకే లభించునను మాటయును లేదు. బాగుగ నీదఁగలవాఁడే నదిని దాఁటఁగలఁడు. ఒక్కొక్కప్పుడు నదియొక్క ప్రబల వేగమునఁ బ్రవాహమునఁ గొట్టుకొని పోవుచుఁ దృణాదులును దైవిచ్ఛచే నావలి యొడ్డునకుఁ జేరును. అదేవిధముగఁ గాలనదిలోఁ గొట్టుకొని పోవు జీవులనుండి ఒక్కొక్కప్పుడు డొకానొక జీవి భగవత్కృపచే నకస్మాత్తుగ సంసారమునుండి శాశ్వతముగఁ దరిం

చును. ఒక్కొక్కప్పుడు బాగుగా నీదఁగలవారే దురదృష్ట మాయలోఁబడి మునిఁగిపోవుచుందురు. భగవంతుని కృప యెప్పుడెవనిమీఁద నెట్లు కలుగునో దానికి నిశ్చిత నియమము లేదు, బహుశః నాకా న్యాయముచే నీయధమునకును భగవ ద్దర్శనము కలుగుచుండవచ్చును నాపైనను సరసఘనశ్యా ముని కృపావృష్టి కురియునేమో! నేనుగూడ ఆతని కరుణా పాత్రుఁడ నయ్యెదను. భగవద్దర్శనము తప్పక కలుగునని నాకు నా అంతఃకరణము చెప్పుచున్నది. ఏలననఁగా నెట్లు జరుగనున్నదో అది మొదటినుండియును గనఁబడుచుండును. ముందుగానే అట్టి శకునములు కలుగుచుండును. చూడుఁడీ శ్యామయను పక్షి నా కుడివైపున సంతోషముతో నఱచు చున్నది. సౌభాగ్యవతులగు స్త్రీలు జలపూర్ణ ఘటములను గైకొని నాకెదురుగ వచ్చుచున్నారు. బ్రాహ్మణులు పుస్తక ములను బట్టుకొని నాకెదురగుచున్నారు. మంగళముఖులగు మహిళల దర్శనము నాకైనది. బయలుదేరునపుడు నాముం దుగా నుదికిన వస్త్రములను, బెరుగును. చేఁపలను దీసికొని వచ్చుచున్నారు. నాయంతఃకరణము స్వయముగఁ బ్రఫుల్లిత మైనది. ఈ మృగగణము నాకుడివైపుగాఁ బోవుచున్నవి. నేను నారదాది మునుల ద్వారా మదనమోహనుని త్రిభువన విమోహన రూపప్రశంసను గూర్చి వినియుంటిని. ఆహా! నేఁడు నాజన్మ సఫలమైనది. నాజన్మాంతరమునందలి పాపతాపము లన్నియును నాశముకాఁగలవు. నేను కృతార్థుఁడనగుదును. ఏలననఁగా విశ్వమును బావనమొనర్చు ప్రభుని పునీత పాద

పద్మములకుఁ బ్రణామ మొనర్చెదను. ఆతని పాదరజమును నాశిరస్సున ధరించెదను. ఆతని చరణధూళియందు బొరలాడి నాశరీరమందలి రోమకూపములను బావన మొనర్చుకొందును.

నేను భగవానుని భువనవిమోహన స్వరూపమును దర్శించెదను. గుండ్రని సుందరములగు లోలకపోలము లుండిన నాతని యనుపమాననమును దర్శించెదను. శుకమువలె మొన దేలిన ముక్కు కలిగి, చారు మందహాసామృత వీచికలు జీవరూపములగు మత్స్యములకు జీవనరూపమైనవి. ఏ వికసితారుణ కమల సదృశములగు నేత్రద్వయము వెలిఁగి జగత్తునందలి తమమును హరించుచున్నదో అట్టి భగవానుని యుంగరములు తిరిగిన నలినీలాలకములు గల శిరస్సును దర్శించెదను.

ఆహా! కంసుఁడు నాపైఁగృపఁజూపినాఁడు ఒక్కొక్కప్పుడు పైకి అమంగళములుగఁ గనఁబడు కార్యములును సమంగళ ప్రదములగుచుండును. కంసుఁడు నన్ను దుష్టభావముతో వ్రజమునకుఁ బంపుచున్నాఁడు. కాని అది నాకు బరమ మంగళమయమైనది. యోగిజను లేపాదపద్మములను యోగసమాధిద్వారా చింతించు చుందురో, ఏ పాపపద్మములనుండి త్రైలోక్యపావనమగు గంగ యుద్భవించినదో, ఏ పాదపద్మ మకరందము కొఱకు లక్ష్మీదేవి సదావ్యాకులతను జెందియుండునో, నిరంతర మే పాదపద్మములను దనకోమల కరములచే లక్ష్మీదేవి పాదసేవన మొనర్చుచుండునో, ఏ పాదములయొక్క ఉజ్జ్వల రక్తాభ నఖముల నిర్మలకాంతిని ధ్యానించి, మహామహులగు వారీ యపారమస్త్ర అజ్ఞానాంధ

కారమయ సంసార సాగరమును నిమిషములోఁ దరింతురో, ఏ చరణకమలముల యొక్క సేవను సదాశంకరుఁడును, సృష్టి కారకుఁడగు బ్రహ్మయును జేయుచుందురో, ఏవి సమస్త సురాసుర, యక్ష, నాగ, గుహ్యక కింపురుష, రుద్ర, భూత, భేతాళాదిజీవులందఱకును వందితమైనవో, ఏవి ప్రాణిమాత్రులకుఁ బూజితములైనవో ఏ పాదముల ద్వారా శ్యామసుందరుఁడు బృందావన పుణ్యభూమియందు గోవుల వెనుక వెనుక నడుచుచుండెనో, ఏ చరణములు వ్రజాంగనల కుచకుంకుమచే రంజితములైనవో ఆ పాదపద్మములను నేను దర్శింపఁగలను.

భగవానుఁడు ప్రాకృతపురుషులవలెఁ గర్మాధీనుఁడై జన్మింపలేదు. ఆతని జన్మము దివ్య చిన్మయ, అప్రాకృత, మాయాగుణరహితమైనది. ఆతఁడు తనయిచ్ఛచేఁ దనకనుగత అనన్యాశ్రితుల ననుగ్రహించుటకై భూమిమీఁద నవతరించినాఁడు. ఆతని యవతారముచే భూంభారమును దిగిపోవును. భక్తులకు లీలాగాన మొనర్చుటకై ప్రపంచమున సంగ్రహితము కాఁగలదు. కావున దివ్య మాననీయ లీలల కొఱకై యెవఁడవతరించినాఁడో అట్టి లావణ్యధాముఁడగు వాసుదేవ భగవానుని నేను దర్శించెదను. నేను దర్శించెదను. నాకన్నులను సార్థక మొనర్చుకొందును. ఆతనిఁగాంచు కర్మను సార్థక మొనర్చుకొందును. ఈ జీవితమందే సర్వోత్తమ దర్శనీయ వస్తువును సాక్షాత్కరింపఁ జేసికొందును.

ఈ కార్యము కారణరూప జగత్ప్రపంచ త్రివిధాహంకారములచే నిర్మితమైనది. కాని ఆ నిఖిలరసామృత సింధు

వగు నందనందనుఁడు సర్వథా అహంకార రహితుఁడు. ఆతఁడు కేవల మీసమస్త ప్రపంచమునకు ద్రష్టా మాత్ర స్వరూపుఁడు. ఆతఁడు తన దివ్య చిన్మాత్ర తేజముచే నహంకార మమకారయుక్తములగు నీయజ్ఞాన జన్య భేదభ్రమను నాశము గావించును. ఇట్టివాఁడయ్యును నాతఁడు బృందావన కుంజ కుటీరము లందును, నిభృత నికుంజములందును వివిధ వనము లందును గోపాంగనా గృహములందును బ్రాకృతశిశువువలె నిత్యనూతన లీలలను జేయుచుండును; ఆతఁడు యోగమాయ నాశ్రయించి, కేవలము తన సత్య సంకల్పముచే - ఈ క్షణ మాత్రముచేత నే పంచప్రాణములను, ఏకాదశేంద్రియము లను బుద్ధ్యాదులను దనయందే రచించుకొని బాలకుఁడు తన ప్రతిబింబమును జూచుకొని వివిధ విధములఁ గ్రీడించునట్లు జీవులతోఁ గ్రీడించుచుండును.

ఆగుణాగారుని సమస్త అఘనాశకములును పరమ మంగళమయములునగు దివ్యగుణములు శ్రుతమధురము లును, బరమ పావనములును, అప్రాకృతములగు కర్మలును, ఆతఁడజన్ముఁడైనను జన్మించినట్లు చెప్పబడు కమనీయ కలిత కథలు ప్రాకృత ప్రాణుల వాణిని సరసమొనర్చును. అవియే అశుభ, అనిత్య, క్షణభంగుర దుఃఖమయ సంసారమును మంగళమయ, శుభ, శోభనముగ నొనర్చును.

ఎవ్వనివాక్కు వాసుదేవుని కథలను జెప్పక ఆయా నిందాస్తుతులందు నిరతమగునో, ఆయా ప్రాపంచిక కథలచేఁ బ్రాకృత పురుషుల మనోరంజనము కావించునో, అట్టివాఁడ

లంకరింపఁబడిన శవసదృశుఁడు. కాగితపు బొమ్మవంటివాఁడు. మట్టితోఁ జేయఁబడిన సుందరివంటివాఁడు, ఘృతహీనదుగ్ధము వంటివాఁడు. బాహ్యాడంబర యుక్తుఁడగును.

భగవంతుఁడు సృష్ట్యాదియందీ విశ్వప్రపంచమును సుచారు రీతినడుచుటకై వర్ణాశ్రమ ధర్మమర్యాదను స్థాపించి నట్లు నేను నారదమహర్షి నోట వినియుంటిని. మానవులకును దేవతలకును బరస్పరము యజ్ఞాదుల ద్వారా సంబంధమును స్థాపించి వర్ణాశ్రమ ధర్మములను నడుపుట కాజ్ఞాపించి నాఁడు, వర్ణాశ్రమ ధర్మమర్యాదచిన్నాభిన్నము కాఁగానే నర పతివేషమున నసురులుద్భవించి, యిష్టము వచ్చినట్లు అత్యా చారములను ననాచారములను జేయుటకుఁ గడంగఁగా నప్పుడు దేవతల ప్రార్థనచే యుగయుగము లందనేక రూపములతో నవతరించు నచ్యుతుఁడు నేఁడు దేవతలకును సమస్త ప్రాణు లకును గల్యాణ మొనర్చుటకై మా యీయదుకుల మందవత రించినాఁడు. అతఁడు తన యిచ్ఛచేతనే మథురను బరిత్యజించి గోకులమునకుఁ బోయినాఁడు. అతఁడు సర్వసమర్థుఁడు. సర్వే శ్వరుఁడు. అతని మంగళమయ యశమును సురగణము నిత్య నిరంతరము శ్రద్ధాసహితముగ గాన మొనర్చు చుందురు. పుణ్యశ్లోక శిఖామణియగు నా దేవకీనందనుఁడు నేఁడు బృందా వనమందు విరాజమానుఁడై తనకీర్తిని విస్తరించుచున్నాఁడు, నేఁడు నాకా దయామయుని దర్శనము కాఁగలదు.

అతఁడు మహాజ్జనముల కేకైకాశ్రయుఁడు. అతని ఆశ్రయ ముచే భక్తజనులు సదా నిర్ద్వంద్వులై నిర్భయులై యుందురు.

ఆతఁడే అందఱకును గురువు. నియామకుఁడు, పథ ప్రదర్శకుఁడు. ఆతఁడెంతటి సుందరుఁడో ఊహించుటకే వీలుకాదు. ఇఁకఁ జెప్పుట అసంభవమే. ఆతఁడు సౌందర్యరసమునకు సాకార విగ్రహుఁడని కొందఱు చెప్పుచుందురు. కొందఱు కోటికందర్ప దర్పదళనుఁడని పల్కుచుందురు. ఆతని కృపా కటాక్షము కొఱకు బ్రహ్మాది దేవతలు సదా ఉవ్విళ్లూరు చుందురు. విశ్వమోహిని యును జగన్మాతయు నగు నా లక్ష్మీదేవి కాతఁడే కైకాశ్రయుఁడు. ఆతఁడు తన యిచ్ఛతోడనే త్రైలోక్య సుందర స్వరూపమును ధరించినాఁడు. ఆతని రూప మనుపమేయము. ఆతని రూప మప్రాకృతమగుటచే దానిని ప్రపంచ మందలి యేవస్తువుతోడను బోల్చి చెప్పుటకు వీలులేదు. ఇట్టి శ్యామసుందరుని దర్శనము నేఁడు నాకు కాఁగలదు. ఈ సంగతిని నా అంతఃకరణము నాకుఁ జెప్పుచున్నది. నాహృదయమం దానంద తరంగములు లేచి రాఁబోవు సుఖమును సూచించు చున్నవి. నేను నా యింటి నుండి బయలుదేరి నప్పటినుండి నాకు శుభశకునములే గోచరించుచున్నవి."

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఈ విధముగ నక్రూరుఁడు భగవత్సంబంధమైన నాలోచనములే చేయుచుండెను. ఆతఁడు గుఱ్ఱముల పగ్గములను బట్టుకొని నాఁడుకాని, గుఱ్ఱములు తమ యిచ్ఛానుసారముగఁ బోవుచుండెను. స్వయముగ వానిని నడుపు అక్రూరుఁడు భగవచ్చింతనమందే నిమగ్నుఁడై యుండెను. ఆతఁడు మనస్సును

రథమునెక్కి సుఖమనోరథములను గావించుచుండెను. ఆతఁడు మార్గమున నేయే మనోరథములను గావించుచుండెనో వానిని దిగ్దర్శనముగ నేను మీకుఁజెప్పెదను. మీరందఱును సమహిత చిత్తులరై శ్రవణ మొనర్పుఁడు."

# నందగ్రామ మార్గమున అక్రూరుని మనోరథము.

౧౦-౨౦

శ్లో॥ అథావరూఢః సపదీశయో రథాత్
ప్రధానపుంసోశ్చరణ స్వలబ్ధయే ।
ధియా ధృతం యోగిభిరప్యహం ధ్రువమ్
సమస్య అచాఖ్యాం సఖీన్వ నౌకసః ॥
శ్రీభాగ. ౧౦ స్కం. 35 అ. ౩౧ శ్లో॥

ఉ॥ ఎట్టి తపంబు సేయఁబడె నెట్టి చరిత్రము లబ్ధమయ్యెనో
యెట్టి ధనంబులర్థులకు నీఁబడెనో తొలిబామునందు నా
యట్టి వివేక హీనునకు నాదిమునీంద్రులు యోగదృష్టులం
బటఁగ లేని యీశ్వరుని బ్రహ్మమయుణ్ హరిఁజూడఁగల్గెడిన్ ।
—శ్రీమదాంధ్రభాగవతము

వస్తువును జింతించుటలో నున్నంత సుఖము వస్తుప్రాప్తిలోలేదు. రసగుల్లా అనుపిండివంటను దినవలయునను కోరికలో గల సుఖము దానిని దినుటలో లేదు. కలిసికొనవలయునను గోరికలో నున్నసుఖము కలిసికొనుటలో లేదు.

కోరిక యెంతటి బలవత్తరముగ నుండునో సుఖమంత యెక్కు-వగనుండును. సంయోగసుఖముక్షణ భంగురము. చింతన సుఖము శాశ్వతముగనుండును. అందువలననే రసశాస్త్రము నందు విరహామే సర్వశ్రేష్ఠమని చెప్పఁబడినది. ప్రియునిఁ జింతించుటయే ప్రేమయొక్క- పరాకాష్ఠ. ఇదియే ఉపాసన యొక్క- సారము. విరహము లేకున్న సుఖములేదు. వియోగము లేకున్న యథార్థమగు రసాస్వాదనము లభింపనే లభింపదు. ఉత్కంఠత రసమున కభివృద్ధి గావించును. ఉత్కంఠత రెండురకములుగ నుండును. అయోగజన్య ఉత్కంఠత, వియోగజన్య ఉత్కంఠత.

ఇంకను ప్రియుని దర్శనము కాలేదు. లేక దర్శనమై పోయినది. కాని అతని పరిచయము కాలేదు. ఆసమయమునఁ ప్రియునిఁగలిసికొనుటకు, ఆతని తోఁ ప్రగాఢ పరిచయ మొనర్చుకొనుటకు గలుగు నా ఆతురతయే అయోగజన్య ఉత్కంఠత. దీనిలో నిరంతరము ప్రియుని చింతనముండును. గురుజనులవలన నాతని రూపమెట్లున్నదని విన్నామో అట్టి ధ్యానమే కలుగును. అదొక్క- అపూర్వమగు రసానుభూతి. ప్రియునితోఁ బరిచయమై అతని యంగసంగము కలిగి, సమ్మిళన సుఖరసాస్వాధనము లభించినది, కాని ప్రారబ్ధవశమున నొకరొకరికి వియోగము కలిగినది. - వేరైరి - ఆదశలోఁ ప్రాచీన సుఖములను స్మరించి పునర్మిల నేచ్ఛకలుగఁగా దానికి వియోగజన్య ఉత్కంఠత యందురు. ఈ రెండును గాక ఇంకొకటి గలదు. అది సంయోగమందును వియోగము. ప్రేమ



అత్యంతాధికమై పొంగి పొరలి, అది హద్దులను దాటును. ఈస్థితిలోఁ దమప్రియతముఁడు సమీపమున నున్నను గనఁబడఁడు. నేత్రములనుండి నిరంతర మశ్రువులు ప్రవహించుచుండును. ఆతని ముఖమును జూచుచుండ భావసమాధి కలుగును. ముఖమును గనఁబడదు. ఆసమయమున హృదయమునఁదడిగుడ్డను బిండినట్లుండును. దీనిపేరు మిలన వియోగ జన్యమగు నుత్కంఠత. ఈ ఉత్కంఠతలన్నిటిలో నయోగ జన్యమగు నుత్కంఠత ప్రబలముగ నుండును. దానిలోఁ బ్రాణి అనేక మనోరథము లొనర్చుచుండును. నిరంతరము వివిధములగు విషయము లాలోచించుచుండును :- "ప్రియుఁడు కలిసికొనఁగలఁడు. కలిసినప్పుడు నే నీ మాటలను మాట్లాడుదును. ఇట్లు పూజించెదను. ఇట్లు పూలను వైచెదను. ఆతఁడెట్లు కలియునో. ఆతఁడిట్టి పని యొనర్చిన నేనిట్లు కలిసికొందును ఈ పని చేసినట్లైన నీమాటను బలుకుదును." అని యీ విధముగ నిరంతరము మనోరథము లొనర్చుచుందును. ఈ మనోరథములు కలవారు ధన్యులు, మానవ జీవితము యొక్క ఫలముల నాతఁడే ప్రాప్తించిన వాఁడగుచున్నాఁడు.

సూతుఁడిట్లనెను :- "మునులారా! అక్రూరుఁడు పోయిన కొలఁది ఆతని ఉత్కంఠత ప్రబలమగుచుండెను. ఇంతవఱకు ఆతఁడు భగవద్దర్శనము చేయలేదు, కేవలము ఋషుల వలనను మునులవలనను నతని కీర్తిని వినెను. ఆతఁడాతని రూపమును గూర్చి యెట్లు వినెనో దానిని ధానించుచుండెను. ధ్యానము చేయఁగాఁ జేయఁగా నాతని మనస్సున

వెంటనే యీభావము వచ్చెను — "నేను భగవానుని సర్వ ప్రథమముగ నెట్లు కలిసి కొందును?" ఇప్పుడు దీనిమీఁద విచారధారసాగెను.

అతఁడిట్లనుకొనెను :— "దూరమున నుండఁగానే నాకు నందుని గోష్టము కనఁబడును. వెంటనే నేనప్పుడు రథమునుండి దిగెదను. గోష్టమునకుఁ జేరఁగానే నవజలధర సదృశ శరీరుఁడును, నీలేందీవరలోచనుఁడును, పీతాంబర ధారియునగు వనమాలి కనఁబడును. ఆసమయమున నాతఁడాడుకొను చుండినచో నాతనిశరీరము పావనమగు వ్రజరజముచే ధూసరితమై యుండును. అతఁడు స్నానమొనర్చి సుఖపూర్వకముగ స్వస్థుఁడై కూర్చుండి యుండినచో సమస్త శరీరమునఁ గస్తూరికా యుక్త సుగంధ చందనము పూయఁబడి యుండును. అతఁడు తల్లినడిగి యడిగి నవనీతమును దినుచుండినచో నాతని గుండ్రని బుగ్గలమీఁద వెన్న అతుకుకొని యుండవచ్చును. శరీరమున నితరచోట్లను నతుకుకొని యుండవచ్చును. ఒకవేళ నే నా మురళీధరుని మధురమధురముగ మురళిని వాయించుచుఁ ద్రిభంగలలిత గతిచే నిలుచుండినను, బోవుచుండినను జూచెదను. నేను గోధూళివేళకు ముందే అచ్చటకుఁ జేరి యుండినచో గోవిందుఁడు గోవులను మేపుచుండఁగాఁ జూడగలను. వ్రజమునకుఁ జేరి నేను సుఖముగఁ గూర్చుండియు, పరుండియు, నవ్వుచుండియు, వినోద మొనర్చుచుండియు, ఆవులను బాలుపితుకుచుండియు, సఖులతో నాడుచుండియున్న శ్యామసుందరుని దర్శించెదను. ఆహా! ఎవని పాదపద్మ ధ్యానమును బ్రహ్మ,

విష్ణు మహేశ్వరులును, ఇంద్రాది లోకపాలురును నిరంతర మును జేయుచుందురో, అట్లు చేసినను ధ్యానమున కెవఁడు రాఁడో, అట్టి సర్వేశ్వరుఁడును బరాత్పరుఁడునగు ప్రభువును నేను ప్రత్యక్షముగ దర్శించెదను. అచింత్యమహామహిమగల మాధవుని వేదములు 'అణోరణీయాన్ మహతోమహీయాన్' అని పలికి పిలుచును ఎవనియొక్క రోమకూపమునుండి అసంఖ్యాకములగు బ్రహ్మాండములును, అగణిత బ్రహ్మవిష్ణు మహేశ్వరులను నుత్పన్నమైనారో, అనిఖిల బ్రహ్మాణ్యప్రభువు యొక్క చరణారవిందములను నేఁడు నేను ప్రత్యక్షముగ దర్శించెదను. ఏపాదపద్మములను నిష్కల్మష యోగి జనము యమని యమాసన ప్రాణాయామ ప్రత్యాహార పూర్వక దారణధ్యాన సమాధులచే ననుభవపూర్వకముగఁ దెలిసికొందురో, ఎవని యొక్క భావమయమూర్తియందు మనస్సును నిలిపి సబీజ సమాధిద్వారా రసాస్వాదన మొనర్చెదరో, ఆత్మలాభము కొఱకు వారు కేవలమెవరి ధ్యానమొనర్చెదరో, నేనట్టి అవాఙ్మనస గోచరుఁడగు మాధవుని పాదపద్మములందు ప్రత్యక్ష ప్రమాణమొనర్చెదను. నేనీ చర్మచక్షువులచే నాతని త్రిభువన విమోహకరూపమును గాంచెదను. ఈ కర్ణములతో నాతని శ్రుతమధురశబ్దములను శ్రవణమొనర్చెదను. శ్రీబలరాముని శ్రీకృష్ణచంద్రునియొక్క చరణములందు నాశిరస్సు నుంచెదను. ఆతని వెంట నుండిన సుహృద గోపబాలకులను ప్రణామమొనరించెదను. ఆహా! నామస్తకము సార్థక మగును. మస్తకముయొక్క సార్థక్యము భగవంతుని భాగవతులను నభివాదించుటలోనే కలదు.

నేను భగవంతుని శ్రీచరణారవిందములందు అహంకార మమకారములను బరిత్యజించి పడఁగా భగవంతుఁడు తన సుకోమల కరకమలములను నాశిరస్సున నుంపఁగలఁడు. ఆకర కమలములు వికరాళ కాలరూపమగు వ్యాళముయొక్క వేగముచే వికలమై యుండిన జీవులకు సర్వథా అభయ ప్రధానమొసంగును.

భగవానుని చరణారవిందములందు శ్రద్ధతో నొక కణము జలమును, ఒక్క తులసీ పత్రమును నర్పించినచో నాతఁడు వానిని సహర్షముగ స్వీకరించి, దానికి ఫలస్వరూపముగ సమస్తమును నొసంగును. బంధన యుక్తుని బంధ విముక్తునిగా నొనర్చును. సాంసారిక ద్వంద్వములనుండి దుఃఖితులైన ప్రాణులకు శాశ్వతముగ నభయప్రదాన మొనర్చును.

అమరాధిపతియగు నింద్రుఁడు ప్రేమ పూర్వకముగ నీపాదారవిందములందు పాద్యముల నర్పించెను. దానికి ఫలస్వరూపముగ నాతనికి బోయిన త్రిభువనరాజ్యము మరలఁ బ్రాప్తించెను. బలిచక్రవర్తి పూర్తిగాఁ బ్రణామమును జేయనే లేదు. ప్రణామము చేయుటకుపక్రమించెను. దీనికే ప్రభువు ప్రసన్నుఁడయ్యెను ఆతనికి సుతల లోకములో స్వర్గమందు కంటె నధిక సుఖమును బ్రసాదించెను. రాఁబోవు మన్వంతరమున నాతని కింద్రత్వము నొసంగి ముక్తికి అధికారిగా నొనర్చెను. ఏకరకమలిందములనుండి నిత్యమును దివ్యగంధము వెలువడు చుండునో, బృందావనమందు రాసవిలాస సమయమున, విహారవేళయందు రతిశ్రమచే శ్రమితులైన వ్రజాంగనల

స్వేదకణములను దుడిచి వారి శ్రమను బోఁగొట్టనో ఆకర కమలములతోడనే ఆతఁడు నామస్తకమును స్పృశింపఁగలఁడు. అప్పుడు నేను కృతకృత్యుఁడ నయ్యెదను. మానవ జన్మను బొందినందులకు సమస్త ఫలమును బ్రాప్తించెదను.

ఆతఁడు నన్నుఁగంసుని దూతగా భావించి నన్నుఁ దిరస్కరించు నను భయమును లేదు. ఆతనికి నామనోగత భావములు తెలియవా? అంతఃకరణమునకు లోపలను బయటను జరుగు వ్యాపారముల నన్నిటిని నాతఁడు క్షేత్రజ్ఞరూపమునఁదన జ్ఞానదృష్టి ద్వారా చూచుచుండును. నామనోగత భావములను నేను దాచెదమన్నను నెట్లు దాచఁగలను. నేనతని కనన్యాశ్రితుఁడననియు, నాతని భక్తుఁడననియు నాతనికిఁ దెలియదా?

సర్వాత్మనమున నేను బరువిడిపోయి ఆతని చరణములమీఁదఁబడెదను. ఆతఁడు నా శిరస్సునఁదన వరదహస్తము నుండి నపుడు నేను ధూళి ధూసరిత దేహముచే నంజలిని బంధించి, శిరస్సును వంచుకొని, అశ్రువిమోచన మొనర్చుచు నాతని యెదుట నిలుచుండెను. ఆ సమయమున నాతఁడు తన మధుర మందహాసమయ దయాదృష్టితో నా వైపునకుఁ జూచును. ఆతని కృపా దృష్టి పడఁగానే నా సమస్త పాప సంతాపములు తత్కాలమున నశించును. పాపపుణ్యముల నుండి విముక్తుఁడనై నేను నిత్యపరమానంద సుఖసాగరమున నిమగ్నుఁడ నగుదును.

ఆతఁడు సమస్త భూతములకు సుహృదుఁడైనను చరాచర విశ్వమున కేకైక స్వామియయ్యును, నాతఁడు యదుకులమున నవతరించినాఁడు. నేనును యదుకులములనే పుట్టితిని. ఈ సంబంధమున నేనాతని దాయాదుఁడను ఆతని తండ్రికి బంధువును, ఆతని కనన్యాశ్రితుఁడను. ఈసంబంధమున నాతఁడవశ్యము చరణములఁబడిన నన్ను నధముని ఆదరపూర్వకముగ లేచి ఆలింగన మొనర్చుకొనును. ఆతఁడు తన బలిసిన దీర్ఘ బాహువులచేఁ బట్టుకొని నన్నుఁదన హృదయమునకుఁ గౌఁగిలించుకొనును. అప్పుడు నా అపావన శరీరము పరమపావనమగును. అప్పుడు నాసమస్త కర్మ బంధనములన్నియు అగ్నిజ్వాలలచే సువర్ణమందలి మలమంతయును బోయి విశుద్ధమగు కనకము మిగిలినట్లు భిన్నభిన్నమై పోవును.

ఆతఁడు నన్ను బలవంతముగ లాగుకొని ఆలింగనము చేసికొనినచో నేను నాశరీరమునంతను విడిచి వేయుదును. ప్రేమచే నాఅంగ ప్రత్యంగములు శిథిలములై పోవును. ఆతని భారమును నేను సహింపఁజాలక అసమర్థుఁడనై తూలి పడఁబోఁగా నాతఁడు తన మధుమయ వాక్కులతో నన్ను మిక్కిలి ప్రేమతో నన్ను మిక్కిలి ప్రేమతో "బాబాయీ! ఏమి సమాచారము?" అనును. ఆహా! ఆతని నోటినుండి 'అక్రూర బాబాయీ' అను శబ్దమును వినఁగానే నేను దేహధారులలో నందఱికంటె సర్వశ్రేష్ఠుఁడ నగుదును. ప్రపంచమున నెట్టి సమ్మాన సూచకములగు నుపాధులు

ప్రాప్తించినను అవి భగవంతుని కాదర పాత్రములు కాకుండి నచో, ప్రభువు వానిని దనవిగా ననుకొని స్వీకరింపకుండినచో నాతని జీవితము వృథా. ఆతని మాన, సమ్మాన, పద, ప్రతిష్ఠా కీర్తులన్నియును వ్యర్థములు.

సాధారణ రీతిగాఁ జూచినచో భగవానునియొక్క కృపాదృష్టి జీవులందఱపై సమానముగనే యుండును. ఆతని దృష్టిలో నాతనికిఁ బ్రియులుగాని, అప్రియులుగాని, సుహృదులుగాని, దుహృదులుగాని, శత్రువులుకాని, మిత్రులు కాని, ఉపేక్షణీయులుగాని లేరు. అందఱును నాతనికి సమానులే అయినను నాతని శరణమునకు వచ్చిన ననన్యాశ్రితులగు భక్తులమీఁద విశేష కృపను జూపును. కల్పవృక్షమునీడ కెట్లుపోయినను నది వాని మనోవాంఛ లను బూర్తిగావించును ఈ న్యాయముచే యాదవులందఱును నాతని దాయాదులే. కాని నేనాతని సమీపమునకుఁ బోవు చున్నాను. నాతనికి నామీఁద విశేష కృపయుండును; అతఁడు వనములోఁ గానిండు, గోశాల ద్వారమునఁ గానిండు; గోప బాలురలోఁ గానిండు, ఎచ్చటఁ గలిసినను నన్నాద రించును. అంత మిక్కిలి ప్రేమతో నిట్లనును - "బాబాయీ! అలసిపోయి యుందువు. పొమ్ము ఇంటిలోనికిఁబోయి చేతులు కాళ్లను గడిగికొని, భోజనముచేసి కొంచెము విశ్రాంతిఁ దీసికొనుము. ఆ సమయమున నమాయకపు బాలుఁడు ముగ్ధ భావమునఁ దండ్రి వెనువెనుకనె పోవునట్లు చేతులను జోడించుకొని నేనాతని వెనువెంటనే పోయెదను.

ఆతఁడు తన వెనువెంట నతని యింటిలోనికిఁగొనిపోవును. అచ్చటికిఁబోయి నాకు యథోచిత స్వాగత సత్కారములను గావించును. కుశలము లడుగును. తనకు వియోగమును జెందిన బంధు బాంధవుల ఆపత్తు విపత్తులనుగూర్చి అడుగును. కంసుని దుర్వ్యవహారమును గూర్చిన సమస్త విషయములను ధ్యానపూర్వకముగ వినును. శిష్యుఁడు గురువు కడ దాను జదివిన పాఠమును నప్పగించినట్లు నేనాతనికి సమస్త విషయములను జెప్పెదను."

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఈవిధముగ నక్రూరుఁడు మార్గమందు ననేక విధములగు మనోరథములను గావించుకొనుచు రథముపైఁగూర్చుండి నందగ్రామము వైపునకుఁ బోవుచుండెను. పోఁగాఁ బోఁగా నాతనికి దారిలోనే సూర్యాస్తమయమయ్యెను."

అంతశౌనకుఁడిట్లనెను :- "సూతా! నీవిదివఱలో నక్రూరుఁడు అరుణోదయమునకుఁ బూర్వమే లేచి నందవ్రజమునకుఁ బోయెనని చెప్పితివి. ఆతఁడు కాలినడకను వెడలె నందమా అట్లు కాదు. రథమునెక్కిపోయెను. రథమైనను విఱిగినదియునుగాదు, గుఱ్ఱములును జచ్చిపోనుఁగులుకాదు. నాలుగు గుఱ్ఱములు కట్టఁబడి, వాయువేగములతోఁబోఁగల సర్వశ్రేష్ఠమగు కంసుని రథము, మధురనుండి నందగ్రామము ఆఱేడు క్రోసులున్నది ఇంత తక్కువ దూరము పోవుటకు అక్రూరునకుఁబూర్తిగా నొక్కరోజేల పట్టినది? అరుణోదయమునకు బయలుదేరిన సూర్యోదయమెట్లైనది?"

నవ్వి సూతుఁడిట్లనెను :- "స్వామీ! గుఱ్ఱములను నెట్టి యపరిచిత స్థానమున వదలినను నవి పోఁగలవు. గుఱ్ఱములు సారథియధీనమున నుండును. సారథి మత్తుఁడైనచో గుఱ్ఱములు గుంటలోఁబడవేయును. అక్రూరుఁడు తనకు శరీర స్పృహయైనను లేనంతగఁ బ్రేమమగ్నుఁడయ్యెను. గుఱ్ఱపుపగ్గముల నాతఁడు వగలుగఁ బట్టెను. గుఱ్ఱము విష్టానుసారముగ రథమును లాగుచుఁ బరువిడ నారంభించెను. మధురనుండి అవి సరిగా హరియానము వైపునకుఁ బోయెను. వానికే దిక్కున మార్గము చిక్కిన నామార్గమునఁ బరువెత్తెను. దైవవశమున మూఁడవ జామున నాతఁడు నందగ్రామము వైపునకుఁ దిరిగెను. అతఁడెంత చుట్టు దిరిగెనో చెప్పఁజాలము. ఏదో విధముగ భగవదేచ్ఛచే నాతఁడకస్మాత్తుగ నందగ్రామ సమీపమునకు వచ్చెను. గోవులను జూడఁగనే అక్రూరునకుఁ దెలివివచ్చెను అరే, నేను వ్రజమునకు వచ్చితినే. అప్పుడు వెంటనె ఆతఁడు రథమునుండి దూకెను. అచ్చట భూమిమీఁద భగవంతుని చరణచిహ్నములను గాంచెను. ఆ చరణ చిహ్నములనుగాంచి ఆతఁడెట్లు దొర్లి గింతలుపెట్టెనో, ఆ నీ యుత్కృష్టపావన ప్రసంగము శ్రవణ మొనర్పుఁడు."

# అక్రూరుఁడు కృష్ణచరణ చిహ్నదర్శనము.

౧౦౨౧

శ్లో॥ దేహం భృతామియానర్థో హిత్వా దంభం భియం శుచమ్
సందేశాద్యో హరేర్లింగ దర్శన శ్రవణాది భిః।

శ్రీభాగ. ౧౧ స్కం. 35 అ ౨౮ శ్లో॥

క॥ జలజాంకుశాది రేఖలు
గల హరి పాదముల చొప్పు గని మోదముతోఁ
బులకించి రథముడిగి యు
త్కలికన్ సంతోష బాష్ప కలితాక్షుండై॥

—శ్రీమదాంధ్రభాగవతము

శరీరములో బలమున్నను గనఁబడనట్లు హృదయములో నుండియును ప్రేమ కనఁబడదు. సూదంటు రాయినిఁ జూడఁగానే యినుపముక్క యెగిరివట్లు దాని నంటుకొనుటకుఁ బ్రయత్న మొనర్చినట్లును, చంద్రునిఁగాంచి చంద్రకాంత మణి కరిగినట్లు ప్రియతముని వస్తువును గాంచఁగనే ప్రేమాస్పదుని హృదయమందు భావోద్దీపనము కలుగును. ప్రియునకు సంబంధించిన వస్తువు కనఁబడినపుడు, దానినిఁ గాంచఁగనే ఆతనికి స్మృతి కలుగును. ఆభావమునే రసశాస్త్రజ్ఞులు ఉద్దీపనమందురు. తన ప్రియునివలె నెవని రూపమునైనఁ జూచినను, నడక, వైఖరి, సంభాషణము, స్వభావము మొదలగు వానినిఁగాంచిన నాతని స్మృతి కల్గును. ఆతని వస్త్రములను గాంచినను, ఆతనికి సంబంధించిన నితర వస్తువును గాంచినను స్మృతి జాగృతినిఁ జెందును. కృష్ణుఁడు నెమిలి పింఛమును ధరించునుగదా! అట్లే యెచ్చటనైనా నెమిలి

యాకఁగనఁబడినను, భగవానుఁడు వేణువును వాయించును గావున వేణు ధ్వనిని విన్నను, భగవానుని చరణ చిహ్నము లను గాంచినను, ఆతనికిఁ బ్రియమగు తులసి కనఁబడినను, ఆతని క్షేత్రము స్మరణకు వచ్చినను, సారాంశ మేమనఁగాఁ బ్రియుని సంబంధముగ నేవస్తువు కనఁబడినను భావమునకు ఉద్దీపనము కలుగఁజేయును. ప్రియుని స్మృతిని నూతనము గావించును. భావుకభక్తుఁ డాస్మృతియందు నిమగ్నుఁడగును. హృదయ మెంతటి అధిక కోమలముగను, సరసస్నిగ్ధముగను, భావమయముగను నుండునో భావోద్దీపన మంత యధిక మగును. నీరసహృదయునందు ఉద్దీపనము కలుగదు. వీణను వినఁగానే మృగియే ఆత్మ విస్మృతినిఁజెంది దొరలును. గేదెలు నిలుచుండి అట్లే నెమరు వేయును రసశాస్త్రమునందు ఉద్దీపనభావమున గొప్ప మహత్వము కలదు.

సూతుఁడిట్లనెను :- "మునులారా! ప్రియుని స్మృతి లో నెంతటి సుఖముకలదో కలిసికొనుటలో నంతటి సుఖముండ దని నే నిదివఱకే యీవిషయమును మాటి మాటికిఁజెప్పితిని. ఆహా! నాప్రియతముని స్మృతిని హృదయమున ధరించి నప్పుడు శరీర స్మృహాయుండదు. రాత్రియందు గాఢాంధ కారముననను నాతని భావమయ విగ్రహము ప్రత్యక్షముగఁ గనఁబడును. అట్టియెడ నేదైన నాతని వస్తువు ప్రాప్తించి నచో నింకఁజెప్పవలసిన దేమున్నది?

అక్రూరుఁడు మనస్సులో వివిధ సుఖద మనోరథము లను జెందును వ్రజమునకుఁ బోవుచుండెను. భువనభాస్క-

రుఁడు అస్తాచలము చాటునకు నిశారాణితో మేలమాడుటకు ఉంకించుచుండెను. ఆతని వెదుకుటకై ప్రాచీదిశ నుండి చంద్రుఁడు బయలు వెడలి నలువైపులను దన దృష్టి రూపమగు కిరణములను వ్యాపింపఁజేయుచు నవ్వుచుండెను. రథము ముందునకుఁబోయిన కొలఁది ప్రేమయందంత అధిక దయనీయముగఁ జూడఁజాలక పోయెను. ఆతఁడు పశ్చిమ దిశా రక్తాంచలమున దాగుకొనెను. వెంటనే అక్రూరుని దృష్టి ఒక మెఱయుచుండిన వస్తువుమీఁదఁబడెను. వ్రజమందలి పరమ పావన రజమందలి భగవానుని చరణ చిహ్నములు కనఁబడుచుండెను. అవి నేలమీఁద స్పష్టముగఁ గనబడుచుండెను పృథివీ దేవి వానినిఁ దన వక్షఃస్థలమున ధరించుటచేఁ బరమ ప్రముదితయయ్యెను. పచ్చపచ్చని తృణరూపమున నామె శరీరము రోమాంచిత మయ్యెను. భూమిపై నున్న నా పాద చిహ్నములందు వజ్రాంకుశ, ధ్వజా, కమల, యవాది చిహ్నములు స్పష్టముగఁ గనఁబడుచుండెను. ఆ చిహ్నములను జూడఁగనే యవి తన పరమ ప్రేమాస్పద ఘనశ్యాముని చరణ చిహ్నములని అక్రూరుఁడు గ్రహించెను. ఏ చరణములయొక్క పరమపావన నిర్మల పదరజమును సమస్త లోకపాలకగణము తమ మణిజటిత ముకుటములందు శ్రద్ధాభక్తి సహితముగ ధరించెదరో, అట్టి ఆనందకందుఁడగు శ్రీకృష్ణ చంద్రుని చరణ చిహ్నముల దర్శనముచే నాతనిరోమరోమములు నిక్కఁబొడిచెను. అత్యంతాకర్షక పదచిహ్నదర్శన జనితానందముచే నత్యంత విహ్వలుఁ

డయ్యెను. ప్రేమాధిక్యముచే నాతని సమస్త శరీరమందలి రోమములు కంటకములవలె నిలువఁబడెను. శ్రావణ భాద్రపదములందలి వర్షమువలె నాతని రెండునేత్రములనుండి అశ్రువులు ప్రవహించుచుండెను. ఆతనికి సంకల్పములేకయే వెంటనే రథమునుండి దుమికి ఉచ్చస్వరమున నిట్లరచెను:- ఆహా! ఇవియే నా ప్రియతముని పరమపాదపద్మ చిహ్నములు. ఈ వ్రజరజము మీఁదఁగనే గోవులవెంట శ్యామసుందరుఁడు వెడలి యుండవచ్చును. ఆహా! ఈయవని ధన్యమైనది. మదన మోహన ఘనశ్యాముని పదముసోకిన నీరజమందలి కణకణములు పరమపావనములు." అని యిట్లు పలుకుచు నాతఁడా రజమందు దొరలుట కారంభించెను. మాటిమాటికి జిహ్వతో నాక నారంభించెను. కాటుకవలెఁ గన్నులకు రాచుకొన సాగెను. హృదయమునకు రాచుకొని ప్రియమిలన సుఖము ననుభవించుచుండెను. ఆతనికి శరీర స్పృహ లేదు. కాలము గుర్తులేదు. తన గొప్పతనమును మఱచిపోయెను. శ్రేష్ఠుఁడనను నభిమానములేదు. ఆతఁడు మాటి మాటికిని రజములోఁ బొరలాడి, తాను కృతార్థుఁ డనుకొనుచుండెను. ఈ విధముగ నెంతసేపేడ్చుచుండెనో, ఎంతవఱకు అశ్రు విమోచన మొనర్చుచుండెనో, ఎంతవఱకు ప్రియుని స్మృతి సుధను పానము చేయుచుండెనో యెవ్వరికినిఁ దెలియదు.

కొంతసేపటికి ఆతనికి శరీరస్మృతి కలిగెను. దూరమున నుండియే ఆతఁడు గోవులఅచుటయును, గోపకుల అఱపులును, ఆఁబోతుల ఱంకెలను వినెను. అప్పుడాతఁ డిట్లనుకొన

సాగెను :- "అయ్యో! నే నింకను నిచ్చటనే యున్నానే! నిశాదేవి పృథివియందు దన యాధిపత్యమును స్థాపిత మొనర్చుకొనినట్లు కనంబడుచున్నది. గోపగణము ఆవులను బాలు పితుకుచుండిరి. శ్యామ సుందరుఁడు బహుశః నాకు గోష్ఠమందు పాలు పిదుకుచు దొఱకవచ్చును. ఆహా! ఆతఁడు చిన్నచిన్న దూడలను లాగుచు లాగుచుఁ గట్టివేయుచుండిన నప్పుడాతని శోభ యెంతటి అనుపమానముగ నుండునోకదా! నాకు గోపాలుని దర్శనము గోవుల మధ్యలోనే అయినచో నా జీవితము సఫలమగును." అని యిట్లాలోచించుకొనుచు నాతఁడు లేచి నిలుచుండెను. గుఱ్ఱములు తమ స్వామి భూమిమీఁదఁ బడుటనుగాంచి నిలిచిపోయెను. అక్రూరుని శరీరమంతటను ధూళి అంటుకొని యుండెను. అట్టి స్థితిలో నాతఁడు గుఱ్ఱవు పగ్గములను బట్టుకొనితోల నారంభించెను. ఇప్పుడాతఁడు రథముపైఁ గూర్చుండలేదు. ప్రియుని దర్శనోత్కంఠతచే కాలినడకనే నందగ్రామములోనికిఁ బోయెను."

సూతుఁడిట్లనెను:- "మునులారా! మానవశరీరమును ధరించినందుల కేకైకఫలము తన ప్రియుని భావమందు సదా భావితుఁడై యుండుటయే. నిరంతరము తన ప్రియతముని స్మృతియందే కాలమును గడుపవలయును. కంసుఁడక్రూరుని వ్రజమునకుఁ బొమ్మని ఆజ్ఞ యిచ్చినప్పటినుండి యీ క్షణము వఱకొక్క క్షణమైనను శ్రీకృష్ణచంద్రుని మఱవలేదు. ఆతనికి సంబంధించిన విషయములనే మనస్సులో నాలోచించుకొనును. వాక్కులతో నాతని నామమునే ఉచ్చరించు

చుండును. శరీరమును నాతని చరణముల రజమునందు బొరలించెను. ఈ విధముగ మనసా, వాచా, కర్మణా సమస్త కర్మలను శ్రీకృష్ణుని నిమిత్తమే చేయుచుండును. అతఁడు నరతనువును ధరించిన పరమ ఫలమును బొందెను. ఇప్పు డాతని కేవిధముగ రామశ్యాముల దర్శనమయ్యెనో ఆ ప్రసంగమును నేను ముందు వర్ణించెదను. మీరు దత్త చిత్తులరై శ్రవణ మొనర్పుఁడు."

# అక్రూరుఁడు - రామకృష్ణులు

౧౦౨౨

శ్లో॥ దదర్శ కృష్ణం రామం చ వ్రజే గోదోహనం గతౌ।
పీత నీలాంబరధరౌ శరదంబురుహేక్షణౌ॥

శ్రీభాగ. ౧౦స్కం. 35 అ. ౨౭ శ్లో॥

మ॥ కనె నక్రూరుఁడు పద్మ నేత్రులను రంగద్గాత్రులఁ ధేను దో
హనవాటీగతుల న్నలంకృతుల నుద్యద్భాసులం బీత నీ
ల నవీనోజ్జ్వలం గుసుమ మాలాధారులఁ ధీరులఁ
వనితా కాములఁ గృష్ణరాముల జగద్వంద్య క్రమోద్దాములఁ॥

శ్రీమదాంధ్రభాగవతము.

ఎవఁడు మన హృదయమును మందిరముగఁ జేసికొని నాఁడో, ఎవని మనోమయ మూర్తి నిద్రించుచుండఁగను, మేల్కొన్నప్పుడును మనమందిరమున నృత్యమొనర్చునో, కన్నులలో నిలిచియుండునో, చిత్తము చిరకాల మెవనిఁగూర్చి చింతించుచుండునో ఆతని సాక్షాత్కారమగును. సాకారరూప

మున నాతఁడు దర్శన మొసంగును. అప్పుడు శరీరమందు భారమును వహించుటకు సామర్థ్యముండదు. మనస్సుయొక్క స్థితి విచిత్రముగ నుండును. కన్నులతో నాతని రూపమును పానము చేయవలయునని ఆతని చిత్తము కాంక్షించు చుండును. రసన ఆతని సుధారసమును పానము చేయవలయు ననుకొనుచుండును. ప్రియతముని మిలనమం దెంతటి సుఖ ముండునో దానినిఁ జెప్పుటకును, వినుటకును, వ్రాయుటకును, చదువుటకును విషయముకాదు. ఇది అనుభవ రూపమైన వస్తువు. ఇట్టి యనుభవమే భాగ్యశాలికోగల్గును. ప్రేమంబో నున్న విశేషత యిదియే. ఇందులో నిత్యనూతనత యుండును. ప్రాచీనతను ప్రేమ యెఱుఁగనే యెఱుఁగదు. నిత్య నవయ ములు విలక్షణముగ నుండును. ప్రేమ కలతయుండును. అలౌ కికత యుండును. ప్రేమియొక్క దర్శనానుభూతి భాగ్యశాలు రకే యుండును. ఇద్దరు ప్రేమికుల సమ్మిళన కథను విన్నను మిక్కిలి సుఖముగ నుండును.

సూతుఁడిట్లనెను :- "మునులారా! అక్రూరుఁడు భగవానుని చరణకమలములచేఁ జిహ్నితమైన వ్రజరజమందు చాల సేపటివఱకు పొరలాడి, మరలఁ గొంచెము బాహ్యజ్ఞా నము కలుగఁగానే ఆతఁడు గుఱ్ఱపు పగ్గములను బట్టుకొని కాలినడకనే నందగ్రామములోఁ బ్రవేశించెను. అచ్చటికిఁ బోయి చూడఁగా నందుని గోశాలలో లక్షలకొలఁది గోవులు నిలిచియుండెను. చాలమంది గోపకులు పాలుపిండు బిందె లను బట్టుకొని నిలుచుండిరి. వారి మధ్యలో పీతాంబరు

నీలాంబరములను ధరించి అలంకారముతో రామకృష్ణులు
నిలుచుండిరి. బలరాముఁడొక్క గోవు కొమ్ములమధ్య గోకు
చుండెను. సుందర గోవత్సమును వడిలోనికిఁదీసికొని నిలు
చుండెను. దానిని ముద్దుపెట్టు కొనుచుండెను మాటి
మాటికిని బుజ్జగించు చుండెను. పాలకు పెద్ద హండీలను
బెట్టిరి. చాలమంది గోపకులు పాలను బితికి పెద్ద పెద్ద
హండీలలోఁ బోయుచుండిరి. రామకృష్ణు లటునిటుఁ దిరుగు
చుండిరి. ఒకానొకఁడిట్లు కేకవేసెను :- "కృష్ణా! ఈ ఆవు
పోట్లది. నీవు దీనిముందు నిలుచుండినఁగాని అది పాలనీయదు."
ఇది విని వెంటనే నంద నందనుఁడు తన వడిలోని వత్సమును
వదలి ఆ గోవు ముందునకుఁబోయి నిలుచుండెను. వాత్సల్య
స్నేహముచే బలరాముఁడును నచ్చటికిఁ జేరుకొనెను. అది
పోట్ల ఆవు గావున నొకవేళఁ గృష్ణునిపైఁ గొమ్మును విసరు
నేమో! ప్రేమయొక్క గతి యెంతటిని విచిత్రమైనది.
ప్రేమలో నైశ్వర్య ప్రసక్తియే యుండదు. భగవానుఁడు
లాల్యుఁడగును. దాస్యభావమందు భగవానుఁడు రక్షకుఁడ
గును. మనము రక్ష్యుల మయ్యెదము. కాని సఖ్యవాత్సల్య
మధురభావములందు భగవానుఁడు రక్ష్యుఁడగును.
మనము రక్షకులమై సదా ఆతనిఁ గనిపెట్టుకొనియుందుము.
అఘాసురుని, బకాసురుని, ధేనుకాసురుని, తృణావర్తాసురుని
ఇటువంటి బలవంతులగు నసురులను నిమిషములోఁ జంపిన
వానికి, ఒక వ్రేలిమీఁద నేడు దినములు గోవర్ధన పర్వతము
నెత్తినవానికి, పోట్లఆవు ఏమి అపకార మొనర్పఁగలదు. కాని

వాత్సల్యభావమున నీవిషయములు జ్ఞాపకమునకు రావు. అచ్చట అడుగడుగునకును ననిష్ట శంక యుండును. గోపకులు గోవులను బాలుపిదుకు చుండిరి. రామశ్యాములు దాని యెదుట నిలుచుండి యుండెను. పోట్లావు మిక్కిలి సాధువైనదై తలను వంచుకొని నిలుచుండి యుండెను. శ్యామసుందరుని ఆ యంగమును నాకుచుండెను. అతఁడు దాని శిరస్సును గోకుచుండెను. బలరాముఁడు నిలుచుండి నవ్వుచుండెను. శరత్కాలీన కమల సదృశములగు రామకృష్ణుల విశాల స్వచ్ఛ అరుణ నేత్రములు హర్షోదారముచే వికసితములయ్యెను.

ఇద్దరును కిశోరావస్థలోనే యుండిరి. యౌవనము వారిపై దృష్టిని సారించి, వారి వెనువెంటనే తిరుగుచుండెను. ఇద్దరియొక్క భుజములు విశాలములుగ నుండెను. అవి గోళాకారముగ నుబ్బెత్తులుగ సర్పశరీరమువలె నునుపుగ నుండెను. రెండును స్త్రీకి ఆశ్రయస్థానములే. అనఁగా సమస్త సులక్షణములచేత లక్షితములై శ్రీసంపన్నములై యుండెను. ఇద్దరి ముఖమండలములును మధురముగను, మనోహరముగను నుండెను. ఇద్దరి శరీరములును మృదువుగను, కోమలముగను నుండెను. హృష్టపుష్టముగను, స్థూలముగను నున్న శరీరముగుటచే నేనుఁగు గున్నవలెఁ జక్కఁగ నుండెను. ఇద్దరును మాట మాటకును నవ్వుచుండిరి. తమ మందహాస ముఖారవిందముచే సమస్త వ్రజవాసుల మనస్సులను హఠాత్తుగఁ దమవైపునకాకర్షించుచుండిరి.

ఇద్దరి శ్రీచరణములందును ధ్వజ వజ్రాంకుశ, కమ
లాది చిహ్నములు శోభించుచుండెను. ఆ శుభలాంఛన
లాంఛిత పదములచే వారు బృందావన పావన భూమినింకను
బరమపావన మొనర్చుచు విచరించుచుండెను. ఇద్దరి కంఠము
లందును మణిమాలలును, సువర్ణ హారములును, పుష్పమాల
లును శోభించుచుండెను. ఇద్దరి శ్రీయంగములును నునుపుగ
నుండెను. పైఁగా స్నానము, నలుగు, అంగరాగము,
చందనాదులచే నవి యింకను నునుపుగను, సుందరముగను,
స్వచ్ఛముగను, గంధమయముగ నుండెను. ఇద్దరి వస్త్రము
లును సుందరముగను శోభాయుక్తముగను నుండెను.
చొక్కా ప్రక్కలందు జరీ పనిచేయఁబడినది. వాటి అంచు
లందు గోటు కుట్టఁబడినది. సన్నని గుండ్రని జరీయంచు
టోపీలపైన నెమిలిపింఛముతోఁ గూడిన మకుటమమర్పఁబడినది
నడుమున మురళులు దోపఁబడినవి."

మహామనస్వియగు నక్రూరుఁడు దూరమున నుండియే
యిట్లు గాంచెను:- "జగత్పతియును, జగత్తున కాది కార
ణుఁడును, బురాణ పురుషుఁడును, లోకరక్షకుఁడును, ప్రధా
నుఁడును, బురుషుఁడును దన సమస్త అంశములతో రామ
కృష్ణుల రూపమున భూమిపై నవతరించి మానసీయ క్రీడలను
గావించుచుఁ బ్రాణులకు సుఖమునొసంగుచున్నాఁడు. పీతాం
బరమును ధరించిన నందనందనుఁడు మరకతమణి పర్వతము
సువర్ణపత్ర విభూషితమైనటు లుండెను. తెల్లతెల్లగా
నుండిన బలరాముఁడు నీల వస్త్రమును ధరించి రజతపర్వతము

మీఁద నీలమణులను బఱవఁబడినట్లుండెను. వారిద్దరును దమ కాంతులచే దశదిశలను బ్రకాశింపఁ జేయుచుండిరి.

అక్రూరుఁడెవరికొఱకు, ఎన్నెన్ని మనోరథములను గావించుకొనుచు నింతదూరము వచ్చెనో వారిరువురను కన్నుల యెదుటఁ గాంచఁగనే ఆతని హర్షమునకు మేఱలేకుండెను. ఆతఁడు తన సమస్త శరీరమును మఱచి, పితాసహితముగఁ దన నామమును జెప్పుకొని భగవానుని సమ్ముఖమున దండము వలెఁబడిపోయెను. భగవద్దర్శన పరమాహ్లాదముచే నాతని నేత్రములనుండి ప్రేమాశ్రువులు ప్రవహించుచుండెను. శరీరమంతయును బులకించెను. హృదయము ముప్పొంగుట చేఁగంఠము రుద్ధమయ్యెను. గద్గద వాక్కులగుటచే నాతఁడు తన పూర్తి పరిచయమును గావింపఁజాలక పోయెను. నామమును గూడ పూర్తిగఁబలుకఁజాలకపోయెను అంత మూర్ఛితుఁడై క్రిందపడిపోయెను.

ఏడ్చుచు నక్రూరుఁడెప్పుడు భూమిపై దండమువలెఁ బడుటను భగవానుఁడు కాంచెనో ఆతఁడు గోవుయొక్క శిరస్సును వదలి వైచెను. దుమికి ఆతఁడు వెంటనే అక్రూరుని సమీపమునకు వచ్చెను. వేషభూషలను, వైఖరిని అక్రూరుఁడను నామమును వినఁగానే ఆ సర్వాంతర్యామియగు ప్రభువు, ఆతఁడు తన పినతండ్రి వరుసవాఁడని గ్రహించెను. ఆతఁడు భూమి మీఁదఁబడిన నక్రూరుని బలపూర్వకముగఁదన చక్రాంకిత కరకమలముతో లేవనెత్తెను. ప్రేష్ఠుఁడు తన

పాదములమీఁదబడిన ప్రేయసిని ప్రేమపూర్వకముగ శరీరముతోఁ గాఁగిలించునట్లు కౌఁగిలించుకొనెను.

అక్రూరుఁడు భగవానుని ప్రేమాలింగనమును బొంది యెంతటి యానందమును జెందెనో ఆవిషయము వర్ణనాతీతము. ఆతఁడేమియు నెఱుఁగని శిశువువలెఁ దన శరీరమును శిథిలము గావించుకొని భగవానుని హృదయమున కంటుకొనెను. హర్షముచే నాతని రోమరోమము నిక్కబొడిచెను. నేత్రాశ్రువులచే నాతఁడు నందనందనునికి స్నానము కావించుచుండెను. ఆతని శరీరము కంపించుచుండెను. కంపించుచుండిన శరీరము మీఁద శ్యామసుందరుఁడు చేతులను నిమురుచుండెను. దీనివలన నాతనికిఁ బరమానందసుఖము కలుగుచుండెను.

శ్యామసుందరుఁడాతని శిరస్సునెత్తి అత్యంత ప్రేమతో నిట్లనెను :- "బాబాయి! నీయీ దశయేమి? నీశరీరమంత టను దుర్మైనదేమి. చాలగ నలసితివా యేమి?

శ్యామసుందరుఁ డిట్లనఁగా నక్రూరుఁ డేమియును మాట్లాడలేదు. ఆతఁడ నిచ్ఛాపూర్వకముగ భగవానునకు విడివడి చేతులను జోడించుకొని, తలను వంచుకొని ఆతని సమ్ముఖమున నిలుచుండెను. ఇంతలోనే బలరాముఁడును నచ్చటికి వచ్చెను. అక్రూరుఁ డాతని పాదములపైఁ బడఁ బోవు నంతలో మధ్యలోఁ దటుక్కునఁ గౌఁగిలించుకొనెను. అక్రూరునకు శరీరము తెలియదు. అంజలి పట్టిన నాతని

చేతులను బట్టుకొని బలరాముఁడు సమీపముననుండిన గోపకుల నిట్లనెను:- "అయ్యా! ఈ బాబాయి యొక్క రథము వాఁకిట నిలిచియున్నది. ఆ గుఱ్ఱములను విప్పుఁడు. రథమును ఆవరణమున నిలుపుఁడు. గుఱ్ఱములును గుఱ్ఱపుకొట్టములోఁ గట్టివేయుఁడు. వానికి పచ్చిగడ్డిని వేయుఁడు. గుఱ్ఱములకు మాలీసు చేయుఁడని నౌకర్లకుఁ జెప్పుఁడు. ఇంటినుండి తెచ్చి వానికి దాణాను బెట్టుఁడు. మేము మా బాబాయినిఁ దీసికొని పోయెదము."

సేవకులు చేతులను జోడించుకొని యిట్లనిరి:-"మంచిది మీరు దయచేయుఁడు. మేమంత పనినిఁజూచెదము."

ఇది విని బలరాముఁడు పాలకుండల నట్లే విడిచివైచి, జోడించుకొనిన యక్రూరుని చేతుల నట్లే పట్టుకొని యింటికిఁబోయెను. శ్యామసుందరుఁడును నాతని వెనువెంటనే బయలుదేరెను. నేఁడు సోదరులిద్దర మధ్యనుండి ఆదర పూర్వకముగఁ బోవుటను గాంచి అక్రూరుఁడు తన భాగ్యమును గూర్చి మెచ్చుకొనుచుండెను. లోలోన నత్యానందమును జెందుచుండెను.

ఇంటికిఁ జేరఁగానే వాఁకిటనుండియే బలరాముఁడిట్లు కేకవైచెను. "అమ్మా! అమ్మా! మథురనుండి బాబాయి వచ్చినాఁడు." ఆసమయమున యశోదమ్మ, రోహిణమ్మతో నేదియో మాట్లాడుచుండెను. మథుర మాట వినఁగానే రోహిణి గుండెలు కొట్టుకొన నారంభించెను. ఆమె పైఁటను

సవరించుకొనెను. కొంచెము మేలిముసుఁగును ముందుకు లాగుకొని, ఒక ప్రక్కకుఁదిరిగి నిలుచుండెను. యశోదమ్మ మిక్కిలి ముసలిదానివలె శిరస్సును గప్పుకొని నిలుచుండి అటుచూచుచుండెను. ఆ సమయమున నక్రూరుని చేతులను బట్టుకొని రామకృష్ణు లిద్దరును లోపలకుఁ బ్రవేశించిరి. భూమిపైఁబడి అక్రూరుఁడు నందుని కాళ్లకిని, నందుని అంగణమునకును బ్రణామము కావించెను. అట్లే రోహిణికినిఁ బ్రణామము కావించెను.

అక్రూరుని గుర్తించి మెల్లమెల్లఁగా రోహిణీదేవి అతని సమీపమునకు వచ్చి, సిగ్గుతోఁగన్నుల నీరు నింపుకొని యిట్లనెను :- "నాయనా! బాగుగానున్నావా? ఎచ్చటనుండి దారి తప్పితివి? వ్రజములో మేమున్నామని జ్ఞాపకము పెట్టుకొని వచ్చినావు. ఇది గొప్ప అదృష్టము."

ఏడ్చుచు నక్రూరుఁడిట్లనెను:- "వదినా! నీవు నన్నేల సిగ్గుపరచెదవు? నేనితరులకు దాసుఁడను. ఇందు నా యిష్టమేమియును లేదు. దాసులకేమి యిచ్ఛయుండును. ఇప్పుడైనను నా అంతట నేను రాలేదు. నేను వేతన భోగిని."

మాటను మధ్యలోనే ఆపుచు బలరాముఁ డిట్లనెను:- "బాబాయీ! ఈమాట లన్నియును దరువాత మాట్లాడవచ్చును ముందుగా నీవు చేతులను గాళ్లను గడిగికొనుము. అలసియుందువు"

అంత రోహిణీతో నిట్లనెను :- "అమ్మా! జలమును దీసికొనిరమ్ము. బాబాయికి కాళ్లు కడుగవలయును."

పరువిడిపోయి రోహిణి జలమును దెచ్చెను. శ్యామసుందరుఁడు పీఁటను దీసికొని వచ్చెను. దానిమీఁద మెత్తని రంగుల ఆసనమును బఱచెను. బలవంతముగ బలరాముఁడక్రూరుని దానిపైఁ గూర్చుంఁబెట్టి సుందర సుగంధిత శీతోష్ణ జలములచే నాతని పాదములను గడిగెను. అక్రూరుఁడు వలదనుచుండెను. కాని బలరాముఁ డాతనిఁ బట్టుకొనఁగా శ్యామసుందరుఁడు పాదములను గడిగెను. పాదములను గడిగి భగవానుఁడు తన పీతాంబరముచే నాతని పాదములను దుడిచెను అంతఁబెరుగును, నేతిని, నేనెను, చక్కెరను గలిపి ఆతనికి మధుపర్కము నొసంగెను. గంధాక్షత ధూపదీప నైవేద్యాదులచే విధిపూర్వకముగ నాతనిఁ బూజించెను. శ్రేష్ఠుఁడగు నతిథి లభించినపుడు అర్ఘ్యమునకు తోడుగా గోదానమొసంగు ప్రాచీన విధానము కలదు. దాని ననుసరించి ఒకమంచి పాడియావును నాతని కొసంగెను. అంత స్వయముగ నాతని వస్త్రములను దీసి నానావిధములగు షడ్రసభోజనముల నాతని సమ్ముఖమున నుంచెను. ఏవిధమగు నభ్యంతరమును లేక అమాయకపు బాలునివలె నాతఁడు భోజనము చేయ నారంభించెను. శ్యామసుందరుఁ డాతనికి మాటిమాటికిని గుణయుక్తమగు పవిత్రాన్నమును దెచ్చి వడ్డించు చుండెను. వెంటనే నవ్వుచుండెను. అక్రూరుఁడు వలదనుచున్నను ప్రేమకు వశీభూతుడై భగవానుఁ డాతని పళ్లెరము నందింకను బదార్థములను వేయుచుండెను. అట్లు భోజనమును బెట్టి ఆతనికి స్వయముగ శ్యామసుందరుఁడు చేతులను గడిగెను. ఆచమ

నము చేయు నంతలోఁ బలరాముఁడు ముఖశుద్ధి సామగ్రిని దెచ్చెను. ఒక పళ్లెమునందు జక్కఁగ నమర్పఁబడిన తాంబూలములుండెను. దానిలోఁ గర్పూరము, జాపత్రి, జాజికాయ, ఏలకులు, వక్కలు లవంగాదులుండెను. ఇంకను వక్కలావఁ నుంచెను. కాల్చిన కరక్కాయ, కాచుపొడి, యాలకులు, సోపుపొడి, ఉప్పగానుండు ధనియాలుండెను. ముఖశుద్ధికి సంబంధించిన నీవస్తువుల నన్నిటిని గైకొని బలరాముఁడాతని సమ్ముఖమునకు వచ్చెను. ఒక్కొక్క వస్తువు నాతని కొసంగెను. ప్రేమమగ్నుఁడై రెండు సుగంధిత పుష్పమాలలను మెడలో వైచి పరమసుఖమయమగు శయ్యయందాతనిఁ బరుండఁబెట్టిరి. ఒక కాలిని బలరాముఁడును, రెండవపాదమును శ్రీకృష్ణుఁడును బిసుగుచుండిరి. అక్రూరుఁడు వలదు వలదనుచుండెను. రామకృష్ణు లిద్దరును బలవంతులు. వారెవరి మాటను వినరు అందువలన వారు పాద సంవాహనాది సేవ నొనర్చు చుండిరి.

శ్రీరామకృష్ణులచే నిట్లు సమ్మానింపఁబడి అక్రూరుఁడు కృతకృత్యుఁడయ్యెను. ఎవని పాదసేవను సాక్షాత్తుగ భగవంతుఁడు తన చేతులతోఁ జేసెనో ఆతనికి మించిన నదృష్టవంతులు ప్రపంచమున నింకెవరుండఁగలరు ?"

ఆ సమయమున నందుఁడింట లేఁడు. ఆతఁడింకొక గోశాలలోఁ బాలను బిదికించుచుండెను. అది అచ్చటికి చాల క్రోసుల దూరమున నుండెను. ఆతఁడు పాలను బిదికించి తిరిగి వచ్చుచుండఁగా నాతనికి సువర్ణమండిత రథము

కనఁబడెను. ఆతఁడు గోపకుల నిట్లడిగెను :- "ఈరథ మెవ
రిది? ఇది కంస మహారాజు రథమువలెఁ గనఁబడుచున్నదే."

గోపకులిట్లనిరి :- "మధురనుండి యెవరో దీనిమీఁద
నెక్కి వచ్చిరి. బలరామకృష్ణులు వారిని బాబాయియని
పిలుచుచు నింటికిఁ గొనిపోయిరి."

ఇది వినఁగా నందుఁడు వెంటనే త్వరత్వరగా నిల్లు
చేరెను. అచ్చట మంచముమీఁద నక్రూరుఁడు పరుండి
యుండెను. బలరామకృష్ణు లాతని పాదములను బిసుగు
చుండిరి. నందుని రాకను గాంచి అక్రూరుఁడు వెంటనే
మంచముమీఁద నుండి దిగి నిలుచుండెను. ఇద్దరును గట్టిగఁ
గౌఁగిలించుకొనిరి. నందుఁడక్రూరుని గట్టిగాఁ గౌఁగిలించు
కొనెను. ఇద్దరికిని గన్నులనుండి ప్రేమాశ్రువులు కారు
చుండెను.

ప్రేమవేగము కొంచెము తగ్గఁగానే ఇద్దరును నేత్రము
లను దుడుచుకొని మంచము మీఁదఁగూర్చుండిరి. అక్రూరుఁడు
తలవంచుకొని అశ్రువులను గార్చుచుండెను. అప్పుడు సంభా
షణమును సాగించుచు నందుఁడిట్లనెను :- "అక్రూరా!
మధురలో నందఱును నానందముగ నున్నారా? మన బంధువు
లందఱును కుశలముగ నున్నారుకాదా? అక్రూరుఁడు దానికి
జవాబీయకపోఁగా నందుఁడు మరలఁ దానే యిట్లనెను:-
నాయనా! మాకన్నియును దెలియును. కుశల క్షేమములడు
గుట అది శిష్టాచార మాత్రమే. కానున్న మీ కెట్టి

కుశలము కలదో అది మేమెఱుఁగనిది కాదు. కసాయివాని యింటనున్న గొఱ్ఱెలకు కుశలమెక్కడిది? వాఁడెప్పుడు తలఁచుకొనిన నప్పుడు వాని కంఠముమీఁదకు గత్తి వచ్చును. మాంసాహారి యింటిలో నున్న కోడిపిల్లల కేమి కుశలము? ఎప్పుడు మనస్సునకు వచ్చిన నప్పుడు కోసి కూర వండుకొనును. ఆవిధముగనే కసాయియగు కంసునిచే జయింపఁబడిన యదు వంశీయులకుఁ గుశల మెచ్చటిది? మీరంద ఱాతని రాజ్యములో నెట్లు దినములు కడుపుచున్నారా యని నాకాశ్చర్యమగుచున్నది."

అక్రూరుఁడు ఖిన్నమనస్కుఁడై యిట్లనెను :- "ఏమి చేయుదుము నందా! ఏదోవిధముగఁ గాలక్షేప మొనర్చుచున్నాము. కాలమును గడుపుచున్నాము. మీకును మాకును నిట్టి శాసకుఁడే లభించినాఁడు. ఆతని దాసత్వము నాముఖమున వ్రాయఁబడినది."

నందుఁడిట్లనెను :- "అక్రూరా! ఒకఁడు క్రూరుఁడుగ నుండును. వేఱొకఁడు మహాక్రూరుఁడుగ నుండును. ఇంకొకఁడు క్రూరుని కంటె నధిక క్రూరుఁడగును. ఈ కంసుఁడట్టివాఁడే. మీరాలోచించుఁడు. తనతోఁ బుట్టువు కొడుకులను బ్రదికి యుండగాఁ జేతులారఁ జంపినాఁడే ఇంకవాఁడేమి పాపమును జేయఁడు. ఏడ్చుచుండిన జెల్లెలి చంకలోనుండి బలవంతముగ నప్పుడు పుట్టిన బిడ్డను లాగుకొని ఱాతిమీఁదఁగొట్టినాఁడు. అట్టివాని హృదయ మెట్లుండును!"

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఈ విధముగ నందుఁడును నక్రూరుఁడును జాలసేపటివఱకు మాట్లాడుకొనుచుండిరి. భగవానుఁడత్యధికముగ నాదరించుటచేతను, ప్రేమ సంభాషణము జరుగుటచేతను నక్రూరుని మార్గశ్రమ అంతయును బోయెను. ఆతఁడు స్వస్థుఁడై మంచముమీఁదఁ గూర్చుండెను. బలవంతముగ నాతఁడు నందునిఁ బంపివైచెను. నందుఁడు పోఁగానే అక్రూరునకును నేను ముందు చేయుదును."

## అక్రూరుని ద్వారా కంస సందేశము.

౧౨౩

శ్లో॥ పృష్టో భగవతా సర్వం వర్ణయా మాస మాధవః।
వైరాను బంధం యదషు వాసుదేవ వధోద్యమమ్॥

వ. మఱియు నీవేమి కారణంబున వచ్చితని హరియడిగిన నతండు కంసునికి నారదుండు వచ్చి చెప్పిన వైరానుబంధ ప్రకారంబును, గంసుండు దేవకీవసుదేవుల వధియింపఁ గమకించి మానిన తెఱంగును, ధనుర్యాగంబు పేరుసెప్పి పుత్తెంచిన ప్రకారంబును వెఱింగించెను."

(శ్రీమదాంధ్ర భాగవతము.)

భగవానుఁడెప్పు డెట్టి లీలను జేయఁదలఁచునో అప్పుడట్టి విధానము నేర్పఱచును. ఎప్పు డెవనిచేత నేకార్యమును

జేయించఁదలఁచునో వాని కప్పుడట్టి మతినిఁ గలిగించును. ఆతఁడు చేయఁదలఁచిన దానికి విపరీతముగా నొనర్చుటకు శక్తి యింకెవరికిని లేదు. ఆతని లీలలకు సమయము నిర్ధారిత మగు చుండును. ఎవనినో నిమిత్తముగఁ జేసికొని ఆతఁడా లీలనొ నర్చును. దీనినే భగవత్క్రీడ యందురు. మనమందఱమును సమస్త జీవులము శ్రీహరి లీలా సంభారములము. మనమందఱ మాతని యాటకు సామగ్రులము. మనము యంత్రములము, ఆతఁడు యంత్రి. మనమందఱమును బొమ్మలము. ఆతఁడు వానితోనాడు బాలముకుందుఁడు. ఆడుకొను పిల్లవాఁడాట బొమ్మను దూరముగఁ బాఱవేయవచ్చును. హృదయమునకు హత్తుకొనవచ్చును. దానిని విఱిచివేయవచ్చును. ఆట బొమ్మ ఆతని కార్యములో హస్తక్షేప మొనర్పదు. ఏ జీవు లాశ్యామసుందరున కాటవస్తువు లయ్యెదరో వారి కే కార్య ములందును మోహముండదు. ఆతఁడు సమస్తావస్థలందును, సమస్త సంఘటనలందును సమముగ నుండును. ఆతఁడు దుఃఖమును బడఁడు, విస్మయమును జెందఁడు.

సూతుఁడిట్లనెను :- "మునులారా! నందుఁడు లోప లికి పోఁగానే అక్రూరుని కడ బలరామకృష్ణులు మాత్ర ముండిరి. కొంచెము సేపటివఱకు అన్నదమ్ములిద్దరును ఆయీ మాటలను మాటలాడుకొనిరి. చివరకు భగవానుఁడు తన అన్నతో నిట్లనెను :- "బలరామ అన్నయ్యా! నీవు కాప పరుండుము. నేను కొంచెము సేపు బాబాయివద్ద నుందును."

బలరాముఁడు కృష్ణుని సంకేతమును గ్రహించి ఆతఁడే యభ్యంతరమును బెట్టలేదు. అందఱును వెడలి పోయిన తరువాత భగవానుఁడేకాంతమున నక్రూరునితో నిట్లనెను :- "బాబాయి ! ఇప్పుడు నామాట నొక్కసారి వినుఁడు. మథుర స్థితి యెట్లున్నది? మథురలో మనజాతి బంధువులందఱును కుశలముగ నున్నారు గదా !"

దీర్ఘనిశ్వాసమును విడిచి అక్రూరుఁడిట్లనెను :- "శ్యామసుందరా ! నీవు సర్వజ్ఞుఁడవు. కులము యొక్క కుశలమును నీకడ నేమి చెప్పుదును ?"

భగవానుఁడు సమవేదనా స్వరమున నిట్లనెను :- "బాబాయి ! మాకంతయును దెలియును. ఇంటికి రాఁగానే జాతి బంధువులయొక్కయు, స్వజనులయొక్కయు కుశలము నడుగవలయును. ఈ సదాచారము ననుసరించి, శిష్టాచారానుసారముగఁ గుశలము నడుగుచున్నాను. కాకున్న మీకెట్టి కుశలమున్నదో అది నాకుఁ దెలియనిది కాదు. ఏ కట్టెకు నిప్పంటుకొనినదో దానికిఁ గుశలమెచ్చటిది? ఏపైరునకు మిడుతల దండుపోటు తగిలినదో దానికి క్షేమ మెక్కడిది? ఏ శరీరమునకు క్షయరోగమువంటి అసాధ్య రోగము సంభవించినదో దానికిఁ గుశల మెక్కడిది? ఏ పరివారమునఁ గలహము సంభవించినదో దానికిఁ గుశల మెక్కడిది ? ఏ కులమునఁ గంసునివంటి క్రూరుఁడు పుట్టినాఁడో ఆకులమునకుఁ గుశలత యెక్కడ ఉండును ? ఆతఁడు నాకు సంబంధమున

మామయైనను నాతని కారణమున మన జాతియంతయును దుఃఖసాగరమున నిమగ్నమగు నంతటి దుష్టుఁడైనాఁడు.

అక్రూరుఁ డిట్లనెను :- "ప్రభూ! ఇప్పుడు నీ క్షేమని చెప్పుదును. మా కిప్పుడు నీ వొక్కఁడవే ఆధారము."

కన్నుల నీరును నింపుచు శ్యామసుందరుఁ డిట్లనెను :- "బాబాయీ! నా కంటె నీ లోకమున నభాగ్యుఁడింకెవరుండఁ గలఁడు? నా కారణమున నా తల్లిదండ్రులకును, నా జాతి బంధువులకును మిక్కిలి విపత్తులు వచ్చినవి. నా మూలకముగ తల్లి, దండ్రి, సోదరులు, బంధువులు, స్వజనులు, నన్నుఁ బ్రేమించువారు వివిధ దుఃఖముల ననుభవింపవలసి వచ్చెను. నా మూలమున వారి పుత్రులందఱును జంపఁ బడిరి. నా కారణమున వారు చిరకాలమువఱకు కారాగృహమున భయంకర యాతనల ననుభవింప వలసి వచ్చినది. ఇప్పుడును వారు కారాగారమున మిక్కిలి క్లేశములతో దివసములను గడుపుచుండవచ్చును. నేనిచ్చట ప్రశాంతిగ నుంటినని మీరు తలంచుచుండవచ్చును. కక్కా! అది నిజముకాదు. నాకు రాత్రింబవళ్ళు నా స్వజనులయొక్క చింతయే. నాబంధు బాంధవులను దర్శించుటకు నా చిత్త మెల్లప్పుడును గొట్టు కొనుచుండును. నేఁడు నిన్నుఁజూడఁగానే యెంతటి యానందము కలుగుచున్నదో దానిని నేను వర్ణింపఁజాలను. వియోగమును బొందినఁ దన బంధువుల దర్శనము మిక్కిలి యదృష్టమున లభించును. ఆ దుష్టకంసుని కన్నులఁ గారమునుగొట్టి

నీవీ వ్రజమున కెట్లు వచ్చితివో చెప్పుము. ఆతనితోఁ జెప్పి వచ్చితివా? లేక మెదలక జెప్పకయే వచ్చితివా? నీవు వచ్చిన పనిని నాకు జెప్పవలయును.

ఇది విని కన్నుల నీరు నింపుచు నక్రూరుఁడిట్లు చెప్పనా టకారంభించెను:- "ప్రభూ! నీవు సర్వాంతర్యామివి, అందఱ హృదయములలోని విషయములను దెలిసికొనఁగలవు. నీ వద్ద దాపరిక మేమున్నది? నీవు పుట్టిన తరువాతఁ గంసుఁడు అన్న యగు వసుదేవుని, వదినెయగు దేవకీదేవినిఁ గారావాసము నుండి విడుదలజేసెను. ఆతఁడనేకులగు నసురులను బంపి నిన్నుఁ జంపింపఁదలఁచెను. నీ వాతని శత్రువవని ఆతనికి విశ్వాసము కలిగినది. ఇంతవఱకాతఁడు నీవు నందనందనుఁడ వనియే యని యనుకొనుచుండెను. నారదుఁడు వచ్చి ఆతనితో నంతయును నిజము చెప్పఁగా నాతఁడు అన్నయగు వసుదేవునిఁ జంపుట కుద్యుక్తుఁడయ్యెను. ఏదోవిధముగ దేవర్షి నారదుఁడు దీని నాపించెను. అయినను నా దుష్టుఁడు దేవకీ వసుదేవులను గారావాసమున బంధించెను. ఇప్పుడాతఁడు ధనుర్యాగమును జేయఁదలఁచినాఁడు. యజ్ఞమొక నెపము మాత్రమే. యథార్థ విషయమేమనఁగా నాతఁడు నిన్నచ్చటికిఁ బిలిపించి చంపింపఁ జూచుచున్నాఁడు. అందువలన నాతఁడు మీ అన్నదమ్ములిద్దరను సమస్త గోపకులను దీసికొని రమ్మని నన్నుఁ బంపినాఁడు".

భగవానుఁడు నవ్వి యిట్లనెను:-"అయితే బాబాయీ! నీవు కంసుని దూతవై వచ్చితివని యేలఁ జెప్పవు?" దీనతా

స్వరమున నక్రూరుఁ డిట్లనెను:- "ప్రభూ! ఇప్పుడు మీ రెట్టైన ననుకొనుఁడు. మానసికముగ నే చరణదాసుఁడను. పైకి కంసుని ఆజ్ఞను శిరసా వహింపవలయును. నేనాతని కపట సందేశమును దీసికొని వచ్చితిని. అతఁడు నిన్నుఁ జంపు ప్రయత్నములో నున్నాఁడు."

శుష్కహాస మొనర్చుచు శ్యామసుందరుఁ డిట్లనెను:- "బాబాయీ! అతఁడు నన్నేమి చంపఁగలఁడు. అతఁడే చంపఁబడఁగలఁడు." అని పలికి భగవానుఁడు కిలకిల నవ్వెను. ఆతని నవ్వులో నవ్వుఁగలుపుచు ద్వారమున నున్న బలరాముఁ డిట్లనెను:- "అవును బాబాయీ! ఇప్పుడు కంసుని మృత్యు వాతని శిరస్సున నాట్యమాడుచున్నది".

బలరాముని వాక్కులను విని శ్యామసుందరుఁడింకను నవ్వుచు నిట్లనెను:- "రమ్ము, అన్నయ్యా! మామయ్య మన లను ధనుర్యాగమునకుఁ బిలుచుచున్నాఁడు. బాబాయి ఆ యాహ్వానమును దీసికొని వచ్చినాఁడు. మనమచ్చటికి బోవలయునా పోరాదా?"

బలరాముఁడిట్లనెను:- "అవశ్యము వెడలవలయును. అవిలంబముగఁ బోవలయును. తినుటకుఁ దింశీ దొఱకినఁ జూచుట కుత్సవము లభించిన నచ్చటికెవఁడు పోఁగోరఁడు! సోదరా! నా కిప్పుడే నోరూరుచున్నది."

అక్రూర రామ కృష్ణులిట్లు మాట్లాడుకొనుచుండఁ గనే నందుఁడు రాత్రిభోజన మొసగ్గి పుక్కిలించుచుండఁగా

నవ్వుచు శ్యామ సుందరుఁ డాతని సమీపమునకుఁబోయి, బాల కుల వలె నుత్సాహముతో నిట్లనెను:- "బాబా! బాబా! నీవు విన్నావా? అక్రూర బాబాయి యేల వచ్చినాఁడో?"

నవ్వి నందుఁడిట్లనెను:- "అది నీకును మీ బాబాయికిని తెలియవలయును. ఎందులకు వచ్చినాఁడో యింతవఱకు నా వద్ద నట్టి ప్రసంగము రాలేదు."

శ్యామ సుందరుఁడుల్లాస స్వరమున నిట్లనెను :- "బాబా! మంచి సుఖద సంభాషణము. మథురలోఁ గంస రాజుగారి కడ గొప్ప ఉత్సవమఁట. శివచతుర్దశినాఁడు ధనుర్యాగము. అచ్చట మల్లయుద్ధమును జరుగును. గొప్ప గొప్ప మల్లులచ్చటికి వచ్చెదరు. ద్వంద్వయుద్ధము జరుగును. మేళములుండును. మనల నందఱను రాజు పిలిచినాఁడు. బాబాయి మనలను బిలుచుటకే వచ్చినాఁడు. ఆహా! మనమును వెళ్లుదము. ఏమి నాయనా! పోవుదము కాదూ? మేమింతవఱకు మథురాపట్టణమును జూడనే చూడలేదు. తిరణాల్లను జూచెదము. ఆట వస్తువులను గొందము. పెరుగును, మిఠాయిలను దినెదము. అహోరాత్రాలాలును మల్ల యుద్ధమును జూచెదము. తూ తూ తూ తూ సన్నాయి వాద్యములను వినెదము. లడ్డూలు జిలేబీలు దినెదము. ఏమి నాన్నగారూ!"

నందుఁడిట్లనెను :- "ఓరీ! మీరేమెనఁ బిచ్చివారా యేమి? రాజు కడ కటులఁబోరాదు. క్రొత్త వస్త్రములను

ధరించి అప్పుడు పోవలయును. ఆతని కడ యజ్ఞము జరుగుచో మనము కానుకలను సమర్పింపవలసియుండును. మనము వారికి సామంతులము కదా!

భగవానుఁడిట్లనెను :- "బాబా! కానుకలను గీనుకలను మేమిూయము. మీరేదైనఁగొని పోయినఁగొనిపొండు. మేమాతనితోఁగుస్తీ పట్టెదము."

ఇది విని యశోదమ్మ యిట్లనెను:- "ఇదిగో! విన్నారా? ఈ పిల్లలు మిక్కిలి అల్లరి పిల్లలు. వీరినిఁదీసికొని పోవలదు. వీరు పోయి అచ్చట నేదైన నుపద్రవ మొనర్చెదరు. అది రాజధాని విషయము, పల్లెటూరు కాదది. మీరేపోయి రాజునకుఁగానుకలిచ్చి రండు."

అంత నక్రూరుఁడిట్లనెను :- "వదినా! పిల్లలు. వారినాపుటెందులకు? వీరు మూఁడు నాలుగు రోజులు ఆటను జూచి రాఁగలరు. మేమిందఱ ముంటిమి కదా! ఇప్పుడు వీరు పెద్దవారైనారు. ఇంకెన్నినాళ్లు వీరినింటిలో బంధించి యుంచుకొందురు. చెప్పుఁడు. వీరును జూచి వచ్చెదరు యజ్ఞమును, మల్లయుద్ధమును."

యశోదాదేవి యిట్లనెను :- "చెప్పుటకేమి కలదు. మీ యిష్టము వచ్చినట్లు చేయుఁడు. వీరల్లరివాండ్రని మాత్రము నేను జెప్పుచున్నాను. మాట మాటకు నితరులతోఁ గలహించుచుందురు. ఇంత పెద్దవారైనారు వీరికింతనఱకు బుద్ధిరాలేదు. కొనిపొండు. చాల జాగ్రత్తగ నుంచవలయును."

యశోద అనుజ్ఞ రాఁగానే అందఱును మిక్కిలి యానందమయ్యెను. నందుఁడా సమయమున ముఖ్యులగు గోపకులను బిలిచి యిట్లనెను :- "ఓయీ ! మన రాజగు కంసుఁడొక పెద్ద యజ్ఞమును జేయుచున్నాఁడు. దానికి మన మందఱమును బోవలయును. రాజు స్వయముగ నక్రూరుని మనలను సమ్మానముగఁ బిలుచుటకై రథమును బంపినాఁడు. మీరందఱును నాతనికి పాలు, పెరుగు, నేయి తరుగు కాకుండునట్లు కానుకలు తీసికొనిపొండు. వ్రజములో నెంతగాఁ బెరుగు, పాలు, నేయి దొఱకునో యందుగా నంతయును బ్రోవుచేయుఁడు. రేపు ఎవ్వరును పాలను గాయరాదు, చల్లఁజేయరాదు. ఎవరివద్ద నెంత వెన్నకలదో దానినిఁ దెప్పింపవలయును. పెరుగు పాలు, వెన్న, నేయి వీనిని కుండలలోను, పాత్రలలోను బెట్టి బండ్ల కత్తింపుఁడు. ఉన్నంతవఱకు చిన్న బండ్లుగాని అన్నిటినిఁ దొరలుకొని పోవలెను. రేపు మనమందఱమును గలిసి మధుపురికిఁ బోయెదము. రాజుయొక్క యజ్ఞమును జూచెదము. మల్లయుద్ధమును జూచెదము. అతనికి గోరసముల నర్పించెదము. రాజు గొప్ప యజ్ఞమును జేయుచున్నాఁడు. దేశదేశాంతరములవారు వచ్చెదరు. గొప్పగొప్ప విద్వాంసులగు బ్రాహ్మణులు, సూత, మాగధ, వందీ, నట, నర్తక, వివిధఖేలనములను తమాషాలను జేయు కళాకారులు రాఁగలరు. మీరిట్టి గొప్ప యుత్సవమును నేఁటివఱకెచ్చటను జూచి యుండరు."

గోపకులిట్లనిరి :- "మంచిది. వ్రజరాజా! ఇప్పుడు చాలరాత్రి గడచినది. అందఱును నిద్రించి యుందురు. ప్రాతఃకాలము అరుణోదయమునకు పూర్వమే మేమందఱ మేర్పాటు చేయుదుము. అందఱును నిద్రలేవక పూర్వమే వ్రజమంతటను దండోరా వేయించెదము."

సూతుఁడిట్లనెను :- "వినుఁడు. ఇట్లు చెప్పి గోపకు లందఱును దమ తమ స్థానములకుఁ బోయిరి. అక్రూరుఁడును అలసియుండెను. పరుండఁగనే నిద్రించెను. కాని శ్రీకృష్ణ చంద్రుని కన్నులకు నిద్ర యెచ్చటిది? ఆతఁడు తన ప్రియ సఖులతో వియోగమును దలఁచుకొనఁగానే అధీరుఁడయ్యెను."

# భగవానుని భావీ వియోగము

౧౨౪

శ్లో॥ కాశ్చిత్తత్కృత హృత్తాపశ్వాసమ్లానముఖ శ్రియః।
స్రంసద్దుకూలబలయకేశగ్రంథ్యశ్చ కాశ్చన॥

శ్రీభాగ. ౧౦స్కం. ౩౯ అ. ౧౪ శ్లో॥

మ॥ హరి నేలా కొనిపోయెదంచు మనమా యక్రూరుఁ బ్రార్థింతమా
హరిఁ బోనీకుఁడు నిల్పరే యనుచు నేఁడర్పింతమా పేల్పులన్
హరి పాదంబుల కడ్డముల్ వడుదమా హా దైవమా యందు నా
తరుణుల్ గొప్పులుఁ జీరలున్ మఱచి కందర్ప జ్వరభ్రాంతలై॥

శ్రీమదాంధ్ర భాగవతము.

అది ప్రాకృత మిళనమైనను అప్రాకృతమైనను సమ్మి ళన సుఖము ననుభవించిన తరువాత నాతఁడు వియోగదుఃఖము

యశోద అనుజ్ఞ రాఁగానే అందఱకును మిక్కిలి యానందమయ్యెను. నందుఁడా సమయమున ముఖ్యులగు గోపకులను బిలిచి యిట్లనెను :- "ఓయీ ! మన రాజగు కంసుఁడొక పెద్ద యజ్ఞమును జేయుచున్నాఁడు. దానికి మన మందఱమును బోవలయును. రాజు స్వయముగ నక్రూరుని మనలను సమ్మానముగఁ బిలుచుటకై రథమును బంపినాఁడు. మీరందఱును నాతనికి పాలు, పెరుగు, నేయి తరుగు కాకుండునట్లు కానుకలు తీసికొనిపొండు. వ్రజములో నెంతగాఁ బెరుగు, పాలు, నేయి దొఱకునో యందుగా నంతయును బ్రోవుచేయుఁడు. రేపు ఎవ్వరును పాలను గాయరాదు, చల్లఁ జేయరాదు. ఎవరివద్ద నెంత వెన్నకలదో దానినిఁ దెప్పింపవలయును. పెరుగు పాలు, వెన్న, నేయి వీనిని కుండలలోను, పాత్రలలోను బెట్టి బండ్ల కత్తింపుఁడు. ఉన్నంతవఱకు చిన్న బండ్లుగాని అన్నిటినిఁ దొరలుకొని పోవలెను. రేపు మనమందఱమును గలిసి మథుపురికిఁ బోయెదము, రాజుయొక్క యజ్ఞమును జూచెదము. మల్లయుద్ధమును జూచెదము. ఆతనికి గోరసముల నర్పించెదము. రాజు గొప్ప యజ్ఞమును జేయుచున్నాఁడు. దేశ దేశాంతరములవారు వచ్చెదరు. గొప్ప గొప్ప విద్వాంసులగు బ్రాహ్మణులు, సూత, మాగధ, వంది, నట, నర్తక, వివిధఖేలనములను తమాషాలను జేయు కళాకారులు రాఁగలరు. మీరిట్టి గొప్ప యుత్సవమును నేఁటివఱ కెచ్చటను జూచి యుండరు."

గోపకులిట్లనిరి :- "మంచిది. వ్రజరాజా ! ఇప్పుడు చాలరాత్రి గడచినది. అందఱును నిద్రించి యుందురు. ప్రాతఃకాలము అరుణోదయమునకు పూర్వమే మేమందఱ మేర్పాటు చేయుదుము. అందఱును నిద్రలేవక పూర్వమే వ్రజమంతటను దండోరా వేయించెదము."

సూతుఁడిట్లనెను :- "వినుఁడు. ఇట్లు చెప్పి గోపకు లందఱును దమ తమ స్థానములకుఁ బోయిరి. అక్రూరుఁడును అలసియుండెను. పరుండఁగనే నిద్రించెను. కాని శ్రీకృష్ణ చంద్రుని కన్నులకు నిద్ర యెచ్చటిది ? ఆతఁడు తన ప్రియ సఖులతో వియోగమును దలఁచుకొనఁగానే అధీరుఁడయ్యెను."

# భగవానుని భావీ వియోగము

౧౦౨౮

శ్లో॥ కాశ్చిత్తత్కృత హృత్తాపశ్వాసమ్లానముఖ శ్రియః।
స్రంసద్దుకూలవలయకేశగ్రంథ్యశ్చ కాశ్చన॥

శ్రీభాగ. ౧౦స్కం. ౩౯ అ. ౧౪ శ్లో॥

మ॥ హరి నేలా కొనిపోయెదంచు మనమా యక్రూరుఁ బ్రార్థింతమా
హరిఁ బోనీకుఁడు నిల్పరే యనుచు నేఁడర్పింతమా వేల్పులన్
హరి పాదంబుల కడ్డముల్ వడుదమా హా దైవమా యందు నా
తరుణుల్ గొప్పులుఁ జీరలున్ మఱచి కందర్ప జ్వరక్రాంతలై ॥

శ్రీమదాంధ్ర భాగవతము.

అది ప్రాకృత మిళనమైనను అప్రాకృతమైనను సమ్మి ళన సుఖము ననుభవించిన తరువాత నాతఁడు వియోగదుఃఖము

ననుభవించి తీరవలెను జనించినవానికి మృత్యువెట్లు నిశ్చితమో, ఉదయించిన వానికి అస్తమించుట ధ్రువము. ఉత్థానమనంతరము పతనమనివార్యము. అట్లే సంయోగము తరువాత వియోగము తప్పదు. సంయోగము వియోగ నిమిత్తముగ నుండును. వియోగ విషయములు చెప్పవీలుం డదు. వాని లక్షణములు మొదటినుండియును గనబడు చుండును. ఒక ఋతువు తర్వాత నింకొక ఋతువు వచ్చు లక్షణములు ముందుగానే ప్రకటమగునట్లు సంయోగములో భావి వియోగము యొక్క ఆభాస లభించును. సంయోగ ములో నెంతటి గొప్ప సుఖముండునో అట్లే వియోగమున నంతటి గొప్ప దుఃఖముండును. వియోగానుభూతి అందఱకు నొక విధముగ నుండదు. శత్రువునకుగాని, ఉదాసీనునకుం గాని వియోగ దుఃఖ ముండదు. ఇది శత్రువులకు సుఖముగ నుండును. వియోగజన్య దుఃఖము సంబంధులకుండును. సంబంధమెంత దృఢముగ నుండునో వియోగ దుఃఖమును నంతయధికముగ నుండును. వియోగజన్య దుఃఖములోను నొక విధమగు సుఖముండును. దాని యనుభవమును నుత్కృష్ట ప్రేమిక పురుషులే తెలిసికొనఁగలరు.

సూతుఁడిట్లనెను:- "మునులారా! నేను రాధతో వెళ్లిపోవు విషయము నెట్లు చెప్పఁగలను? బహుశః వినఁగానే మూర్ఛితురాలగును. అందువలన వెళ్లిపోఁగలనని చెప్పుట మంచిది కాదు. నేనేనాఁడు పోవుచుండుటయే మంచిదని తోఁచు చున్నది."

ఇట్లు విచారించి శ్రీకృష్ణుఁడు మెదలకుండ పడి యుండెను. కాని ఆతని మనస్సు కుదుటపడలేదు. హృదయ మున నొక విధమగు కంపనము కలుగుచుండెను. అంతఃకరణ మున నొక విధమగు సుడిగాలి తిరిగెను. ఆతఁడిట్లనుకొనెను:- "నేఁడే అంతిమ మిలనము. నేఁడు నేను పోకున్నచో నామె కెంతటి నిరాశగ నుండునో. నేఁడవశ్యము నేను పోయి తీర వలెను. నేను వెళ్ళు పోదునను విషయ మచ్చట చెప్పను." అని యిట్లాలోచించుకొని శ్రీకృష్ణుఁడు మెదలక శయ్యనుండి లేచి దట్టమైన నికుంజము కడకుఁ బోయెను. అచ్చట బృందా వన అభిష్ఠాత్ర్ది దేవియగు బృంద సమస్త కామకేళి కొఱకు సంభారములను ప్రోవుచేయు చున్నట్లుండెను నేఁడు రాధికా కృష్ణపక్షముయొక్క అభిసారికా శృంగారమును జేసికొని యుండెను. నీలపు చీరను గట్టుకొని యుండెను నీలమణి హారములను ధరించెను. నీలి ఱవికను ధరించి, నీల పుష్ప హారమును ధరించెను. నీలాలకములలో నీలమణి శోభించు చుండెను. చంపక వర్ణమగు లలాటమున నీలపుబొట్టు శోభాయ మానముగ నుండెను. శరీరముమీఁద శ్రీకృష్ణ వర్ణముగ నుండు కస్తూరి అలఁది యుండెను. ఆమె మిక్కిలి యుత్సాహముతో శ్యామసుందరునిఁ బ్రతీక్షించుచుండెను. ఆమెకు క్షణక్షణము, తెప్ప తెప్పపాటు కల్పమువలె గడుచు చుండెను మనస్సులో వివిధములగు సందేహములుబుకు చుండును. మెకాశంకలు కలిగి విలీనము లగును. చంద్రుని ప్రతీక్షకొఱకు చకోరము వ్యాకులము చెందునట్లు మార్గము

వైపున దృష్టిని సారించుచుఁ దదేక దృష్టితో సత్యంతో
త్సాహముతోఁ జూచుచుండును. దూరమున నుండియే
శ్యాముని ప్రతీక్షించుచుండ నామె హృదయము పచ్చఁ
బడెను. నికుంజమందలి సఖులందఱును నా వైపునకుఁ జూచు
చుండిరి. పరస్పరము గుసగుసలు సాగెను. అవును, శ్యామ
సుందరుఁడే. నేఁడు సమస్త సఖుల శృంగారమొకే రకముగ
నుండెను. రాధ శ్యామసుందరుని సంభ్రమములోఁ బడ
వేయుటకై యిట్టి కౌతుకమును రచించెను. ఆమె
దానిలో సఫలుఁడయ్యెను, రాధను నీలశృంగారమునఁగాంచి
కృష్ణుఁడు సంభ్రమమునఁ బడెను. ఆతఁడామెను గుర్తింపఁ
జాలకపోయెను. లలితాదేవి నవ్వినపుడు ఆతఁడు గుర్తించెను.
శ్యామ సుందరుఁడు రాధాదేవి కంఠమును దన చేతితోఁ
గౌగిలించుకొనుచు నిట్లనెను:- "ప్రియా! నేఁడు నీ విట్టి
వేషమును వేయుటచే నేను గుర్తింపఁజాలక పోయితిని"

ప్రియయగు రాధిక దీనికి జవాబు చెప్పలేదు.
నేఁడామె చిత్తము చంచలమగుచుండెను. మనస్సులో
ననేక విధములగు నాశంకలు కలుగఁ జొచ్చెను. నేఁడెందులకో
గాని మనస్సులో నొకవిధమగు నవ్యక్త వేద కలుఁగుచున్న
ట్లుండెను. దానిని మఱచుటకు అనేక వినోదములను వివిధో
పాయములను గావించెను కాని ఆమె వేదన తగ్గలేదు. నేఁడు
ప్రియుని తాఁకుటలో నిదివఱకున్నంత సుఖము కలుగుట
లేదు. శ్యామ సుందరుఁడు సమస్త సఖులతో మాట
లాడెను. అందఱను సన్మానించెను. ఆతఁడేకాంతముగ

నిభృత నికుంజమునఁ బ్రవేశించెను. నేఁడు శ్యామసుందరుని వ్యవహారమున కపటమున్నది. నేఁడాతఁడు వెనుకటికంటె నధిక ప్రేమను బ్రదర్శించుచుండెను. మాటి మాటికి ఆలింగనము ద్వారా వృషభానునందినియగు రాధకు సంతుష్టి కావింపఁజూచుచుండెను. ప్రియను దొడమీఁదఁ గూర్చుండఁ బెట్టుకొని ఆతఁడు తన కరకమలమును నామె శిరస్సుపై నిమురుచుండెను. ప్రియతముని సుఖదస్పర్శను బొందఁగానే కీర్తి కిశోరియగు రాధికకు కొంచెము వణఁకు వలె వచ్చుచుండెను. ఆమె కొంచెము సేపు ప్రియుని తొడమీఁదనే నిద్రించెను. కొంచెము సేపైన తర్వాత ఆమె తటుక్కున నులికిపడి బిగ్గఱగ నేడువ నారంభించెను అఱువ నారంభించెను. "శ్యామసుందరా! నన్ను వదలి నీ వెచ్చటికిఁ బోయితి"వని ఆమె తన రెండు భుజములతో శ్యామసుందరుని గట్టిగాఁబట్టుకొనెను. అంత నత్యంత ప్రేమతో హరి ఇట్లడుగ నారంభించెను:- "ప్రియా! ఏమది? ఏమైనది? నీవేల నులికిపడితివి. నేను నీ యెదుటఁ గూర్చుంటిని గదా! నీవేమియును స్వప్నమును గాంచుటలేదు. నీ చిత్త మెట్లున్నది? నీవు కన్నులెత్తి నా వంక నొక్కసారి చూడుము."

శ్యామసుందరుని వడిలో నుండుటను గాంచి ఆమె లేచి, కన్నులను తుడుచుకొని అత్యంత మమతా భరిత వాక్కులతో నిట్లనెను:- ప్రాణవల్లభా! రమ్ము! నీవు నాపైఁ గృపఁ జూడుము. నేనిప్పుడే చాల భయంకర స్వప్నమును గాంచితిని."

రాధ శరీరముతోఁ దన శరీరమును గలిపి, ఆమె వడి లోఁదన శిరస్సు నుంచి, నయనములతో నామె ముఖారవింద మును గాంచుచు నందనందనుఁడిట్లనెను :- "ఏ స్వప్నమును నీవు గాంచితివి. ప్రియా ! దానిని నాకు జెప్పుము."

శ్యామసుందరుని ఆమస్తకమునఁదన మృదుల సుకోమల కరకమలములనుంచుచు రాధ ఇట్లనెను :- "చూడుము ! కృష్ణా ! నేఁడు నీప్రేమలోఁ గృత్రిమత కలదు. నేఁడు నీవింతటి అధిక ప్రేమను జూపించుచున్నావు. దీనిలో నేదియో కారణముండి తీరును. అతి బాగుండదు. అతి తీపిలో పురుగులు పడును. అతి తీపిచే వెగటు పుట్టును నీవు నన్ను మోసగించుచున్నట్లున్నది. నీకు దూరముగఁ జేయుచున్నావు. తన్ని వేయుచున్నావు. నన్ను నుఱుకించు చున్నావు.

భగవానుఁడగు శ్యామసుందరుఁడిట్లనెను :- "ప్రియా! నీ వెట్టి మాటలు మాటలాడుచున్నావు. నీ చిత్తము సరిగా లేదా యేమి ? నీవు నిద్రపోవుట లేదు కదా ! స్వప్నమునఁ బ్రలాపమొనర్చుట లేదుకదా ! నీవు నాకు స్వప్న వృత్తాంత మును జెప్పుచున్నాను. స్వప్నపు మాటలను జెప్పక యీ అస్తావ్యస్తపు మాటలనేల వాగుచున్నావు ?"

రాధాదేవి యిట్లనెను :- "నేను నిద్రపోవుట లేదు. మేల్కొనియే యున్నాను. నీవు నన్ను వదలిపెట్టి పోవు చున్నావని నాఅంతరాత్మ చెప్పుచున్నది. నీ యీ ప్రేమ

విషము కలిసిన మిఠాయివలె నున్నది. నామనస్సు నేఁడు ప్రొద్దుటినుండి దడ దడ కొట్టుకొనుచున్నది. నేనీ కారణమును నింతవఱకు నెఱుఁగఁజాలకున్నాను. ఇప్పుడు స్వప్నమునుండి ఆభాసము లభించినది.”

భగవానుఁడిట్లనెను: “స్వప్నములో నేవేమి చూచితివి?” వినెదను చెప్పుము.

వృషభానుసుత యిట్లనెను:– “ఇప్పుడు నీ వడిలోఁ బరుండఁగాఁ గన్నులు మూఁత్రపడెను. నాకు నిద్రయెందులకు వచ్చినదో తెలియదు. ఆ స్థితిలో నేను స్వప్నమును గాంచితిని. నే నొక బహుమూల్యమగు సుందర సింహాసనముపఁ గూర్చుండి యుంటిని. నాపైన శ్వేతఛత్రము పట్టఁబడినది. దానికి ముత్యాల జాలరులు కట్టఁబడినవి. ఇంతలోనే ఒక బ్రాహ్మణుఁడు వచ్చి, నా ఛత్రమును లాగుకొనెను. శ్యామసుందరా! నా ఛత్రము నీవే! నీ ఛత్రఛాయలో నుండి నేను సుఖముగ నుండఁగలను. నీవు లేకున్న నేను కుమిలిపోయెదను. ఆశ్రయహీన నయ్యెదను. అంతనొక గొప్ప సముద్రమును గాంచితిని. దానిలో నల్లనల్లని నీరు నిండి యున్నది. నేను దానిలోఁ బ్రవేశింపఁదలఁచలేదు. కాని ఆ క్రోధియగు బ్రాహ్మణుఁడు నన్ను బలవంతముగ దానిలోనికిఁ ద్రోసెను. నేనేమి చేయుదును. ఆతఁడు నన్ను దానిలోఁ బడఁద్రోయఁగా నేను దుఃఖితనై అటునిటు నుండి ఆ కృష్ణ సాగరమున నీదుచు, మునుఁగుచుఁ దేలు

చుంటిని. దాని గొప్ప గొప్ప తరంగములలోఁబడి దెబ్బలు తిని అఱచుచుంటిని. దానిలో గొప్ప గొప్ప మొసళ్లును, చేఁపలును నిలుచుడి నన్ను మ్రింగఁ జూచుచుండెను. వానికి భయపడి నేను 'త్రాహి త్రాహి' యని పిలుచు చుంటిని. ఎవ్వరును నవలంబనముగఁ జిక్కక యేడ్చుచుంటిని. జీవితాశను వదలుకొంటిని. పైన నాకాశమునఁ జంద్రుఁడు శోభిల్లుచుండెను. ఇంతలోఁ జూడఁగా నాకాశమునుండి చంద్రుఁడు భూమిమీఁదకు బడుచుండెను. నేనీ యఘటిత ఘటనను మిక్కిలి విస్మయముతోఁ జూచుచుండఁగా నా సమయమునఁ జంద్రుఁడు నేలఁమీఁదఁబడి నూఱు వ్రక్కలయ్యెను.

మరలఁ జూడఁగా నాకాశమండలమున సూర్యనారాయణుఁడుదయించుచుండెను. ఆతఁడును భూమిపైఁ బడెను. ఆతఁడు నాల్గు ముక్కలయ్యెను. కొన్ని క్షణముల తరువాత నాకాశమందు సూర్యచంద్రులిద్దరును గలిసి ఉదయించుచుండిరి. వారిద్దరి నొక్కసారిగా రాహువు గ్రసించుచుండెను. సగమును మ్రింగుటకాదు చంద్రసూర్యుల నిద్దరను బూర్ణముగ మ్రింగెను. ఆకాశ మండలము కజ్జలాకారమును జెందెను.

అంత నావడిలో నొక అమృత ఘటమున్నట్లును, దానినిఁ దీసికొని మోహితురాల నగుచుంటిని. దానినిఁ బ్రేమించుచుంటినని చూచితిని. ఇంతలోనే ఒక కుపిత బ్రాహ్మణుఁడు వచ్చుచుండెను. వచ్చినా వడిలోని సుధాకుంభ

మును ఖండ ఖండములుగ నొనర్చెను. నా హృదయ మందలి రత్నహారము దాసికదియే భిన్నభిన్నమై క్రిందను రాలిపోవుచుండెను. మరలఁ జూడఁగా నా క్రుద్ధ బ్రాహ్మణుఁడే నా కంటిపాపలోని పురుషునిఁ దీసికొని పోవుచున్న ట్లుండెను. నా చేతిలోనున్న క్రీడాకమలమును నా బ్రాహ్మణుఁడు లాగుకొని చించి ముక్కలుచేసి పాఱవైచినట్లుండెను. నా చేతిలో నొక సుందర దర్పణమున్నట్లును, దానిలో నా ప్రతిబింబమును గాంచి సంతోషించుచున్నట్లు కాంచితిని. క్షణములో నా సుందర స్వచ్ఛనిర్మలమగు నద్దము మలినమై, అది నా చేతినుండి జారి ముక్కలైనట్లు గాంచితిని. ఇంకను పాషాణ విగ్రహములు నృత్యమొనర్చుచు, నవ్వుచుఁ, బాడుచు, వాయించుచున్నట్లుండెను. ఉచ్చస్వరముతో రోదనము చేయుచున్నట్లుండెను. ఆకాశమున నొక నల్లని చక్రము మాటిమాటికి దిరుగుచుండెను. ఆ సమయమున నేను నీ లోపలనుండి వచ్చి చూడఁగా నీవు నన్నాలింగనము చేసికొని యిట్లంటివి:- "రాధా! ప్రాణాధికా! ప్రియా! నాకు వెళ్లుట కాజ్ఞయిమ్ము. ప్రేమ పూర్వకముగ వీడ్కోలొసంగుము, ఇప్పుడు నేను కన్నులను దెఱచియున్నను, స్వప్నమును జూడకున్నను, నీవు కృష్ణ వస్త్రమును ధరించినట్లు చూచుచున్నాను. నా హృదయము దడదడ కొట్టుకొనుచున్నది. నా దక్షిణాంగము లదరుచున్నవి. నాకు ప్రపంచమున నన్నియును విపరీతముగనే తోఁచుచున్నవి. ప్రాణవల్లభా! నా వద్ద దాపరికము వద్దు. నన్ను మోసగింపకుము.

నాకు నిజమును జెప్పుము. ఈ యపశకునములకుఁ గారణ మేమి? ఏల నా హృదయములోనికి పోటు పాటులు వచ్చుచున్నవి? నా అంతఃకరణమున సుడిగాలి లేచుచున్నదేల?"

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఇట్లు చెప్పుచుఁ జెప్పుచు రాసేశ్వరియగు రాధ మూర్ఛితయై శ్యామసుందరునిపైఁ బడెను. ఆమె కంఠము గద్గదమయ్యెను. అరుణ కమలదళములవలె నుండిన నెఱ్ఱని పెదవులు రెండును నెండి పోయెను. ఆమె భయభీత మృగమువలెఁ జకిత దృష్టులచేఁ జూచుచు భూమి మీఁద దొరలెను. ఆమె రెండు కనుఱెప్పలు తెఱవఁబడెను. ఆమె యొక్క యీ దశను గాంచి శ్రీకృష్ణుఁడు భయపడెను. వెంటనే ఆమెను తన వడిలోఁ బరుండఁబెట్టుకొని తన పీతాంబరముతో విసరసాగెను. మాటి మాటికి ఇట్లనుచుండెను:- "ప్రియా! ప్రకృతిస్థవుకమ్ము నీ కేమి భ్రమ వచ్చినది? చూడుము. నేను నీ సమీపమున నేయున్నాను. ప్రాణేశ్వరీ! నీవే విషయమునను జింతింపకుము."

భగవంతుని యొక్క యీ వచనములను విని రాధ కన్నులను దెఱచి అత్యంతానురాగభరిత హృదయముతో నిట్లనెను:- "నిజమును జెప్పుము ప్రాణవల్లభా! ఏమి నీవు నన్ను వీడి యెచ్చటికైనను బోయెదవా?"

రాధయొక్క యీ వాక్యములను విని భగవానుఁ డిట్లనెను : "ప్రియా! నీకేమైనది? నేను వచ్చువాఁడను గాను బోవువాఁడనుగాను, ఒక స్థానమునుండి వేఱొక

స్థానమున లేనివానికి రాకపోకలుండును. నేను వాయువు వలెను, అగ్నివలెను సర్వత్ర వ్యాపకుఁడను. నేను సర్వత్ర యెల్లప్పుడు నుంటిని, ఉండఁగలను. అన్నిటికిని ముందు నున్నాను, వెనుక నున్నాను. నేను సదా, సర్వత్ర, సమస్త కాలములందున్నానో, అట్లే నీవు నున్నావు. నీకును నాకును భేదములేదు. నేను నీకు వేఱుగా నుందమనుకొన్నను నుండఁజాలను. దేహ సంయోగము సంయోగమునుగాదు, దేహ వియోగము వియోగమునుగాదు. సంయోగ వియోగములు మానసికముగ నుండును. నీవెల్లప్పుడును నామానసమందున్నావు. అందువలన నీకును నాకును వియోగముండనే యుండదు."

భగవానునియొక్క యీ వాక్యములను విని వాసేశ్వరియు, వృషభాను నందినియునగు రాధ యిట్లనెను:—
"ప్రాణనాథా! నీవేదో మాయమాటలను జెప్పి నన్నుమఱపించుచున్నావు. నీవు జ్ఞాపకముంచుకొనుము. నీవు లేకున్న నేను జీవింపఁజాలను. ఓషధులు చంద్రునిఁ గాంచినఁ బ్రఫుల్లితములగును. సూర్యతాపముచేఁ దపించును అట్లే నిన్నుఁగాంచినఁ బ్రఫుల్లితములగును. సూర్యతాపముచే దపించును; అట్లే నిన్నుఁగాంచినఁ జప్పి వాడిపోయిన నేను తిరిగి బ్రఫుల్లితనగుదును.

రాత్రియందు దీపశిఖ ప్రకాశితమైనట్లు నేను నీ దర్శనముచేఁ బ్రకాశితనగుచున్నాను. శుక్లపక్షమునఁ జంద్ర

కళలు వృద్ధిబొందునట్లు నిన్ను బొందిన నా యనురాగోత్సాహములు వృద్ధిబొందుచున్నవి. కృష్ణపక్షమును బొంది చంద్రకళలు తగ్గి తగ్గి క్షీణించినట్లు నిన్నుఁబొందక నేను కృశనై ఒకానొక దినమున విలుప్తనై పోవుదును. నీహృదయమున శిరస్సునుంచి నిద్రించినచోఁ జంద్రునిఁబొంది పూర్ణిమారాత్రి ప్రకాశించినట్లు ప్రకాశించెదను. నీవు లేకున్న నమావాస్యనాఁడు రాత్రి ప్రభావిహీనమైనట్లు ప్రభాహీననయ్యెదను. మండుటగ్నిలో ఘృతమును వైచిన నది వృద్ధిచెందునట్లు నిన్నుఁబొంది నా తేజ, ఓజ, శ్రీ, కాంతి, శోభాదులభివృద్ధిఁ బొందును హిమవంతమున మంచుపడుటచే లతాదులు వాడిపోయినట్లు నీవు లేకున్న నేను వాడి, వరుగై పోవుదును. రాత్ర్యంతమునఁ దారకల తేజస్సు విలుప్తమైనట్లు నా రూప, యౌవన, శృంగారములన్నియును వ్యర్థములు కాఁగలవు. శరీరములందలి ప్రాణములు పోఁగానే శరీరము పీనుఁగైనట్లు నీవు లేకున్న నేను బీనుఁగువలె నగుదును. తేజస్వియగు భాగ్యశాలి యుండుటచే నాశ్రమము శోభాయుక్తముగ నుండును. ఆతఁడు లేకుండిన శూన్యముగ గోచరించును. అటులనే నీవు లేకున్న నేను శూన్యనగుదును. చత్రమునఁ జిత్రమును బిగించిన నది శోభాయమానముగ నుండును. చిత్రమును నాశనమొనర్చినఁ గేవలము మట్టియే, మిగులును. అట్లే నీవు లేకుండినఁ గాంతి హీన నగుదును నీవు సమస్త వ్రజమును బ్రకాశింపఁజేయువాఁడవు. వ్రజరాజగు నందునకును, యశోదమ్మకును నీవు కంటిలోని పాపవు.

నా ప్రాణములకంటె నధిక ప్రియుఁడవు. నీవు బృందావన వృక్షములకు శోభవు. నీవు వెడలిపోయిన తరువాత మేము బలహీనమై యెండిన నదివలెను, చంద్రహీనమగు రాత్రి వలెను, చంద్రహీనమగు రాత్రివలెను, ప్రాణహీనమగు దేహమువలె నయ్యెదను."

భగవానుఁడిట్లనెను :- "ప్రియా! నీవింత దుఃఖిత వయ్యెద వేల? నీవు నాకు ప్రాణములకంటెను బ్రియమైన దానవు. నిన్ను వదలి నేనింకొక చోటున కెక్కడికిఁ బోవుదును?"

రాధాదేవి యిట్లనెను :- "అయితే, నిజమును జెప్పుము. నీవెచ్చటికినిఁ బోవు కదా! నామీఁద నొట్టు పెట్టుకొనుము."

ఇప్పుడు శ్యామసుందరుఁడు ధర్మసంకటములోఁబడి పోయెను. అవుననుటకును వీలులేకుండెను. కాదనుటకును వీలులేకుండెను. ఆమె ముఖమును గాంచుచు మౌనముగ నట్లే నిలుచుండెను. అప్పుడు రాధ యిట్లనెను :- "చెప్పవేమి? మెదలకుంటివేల? నీవెచ్చటికిని బోవలయునని లేదు కదా!"

భగవానుఁడిట్లనెను :- "చాల దూరమెచ్చటికినిఁ బోవలయునని లేదు. మథురవఱకు బోవలయును. అంత వఱకు నీవింటిలో నుండుము. సమయము వచ్చినపుడు మరల మనకిద్దరికిని సమాగమము జరుగును."

రాధికాదేవి యులికిపడి యిట్లనెను:- "అవును. అయితే, నీవిదివఱకే పోవుటకు నిశ్చయించితివి. నాకడ దాఁచుచున్నావు. చాల మోసగాఁడవు. సరే, నీవు, వెడలవలసియుండినచో నిన్నాపఁగలవారెవరుందురు? కాని వ్రజవల్లభా! జీవన ధనమా! నీవు వెడలిపోయినచో, నీతోఁగూడ నా సౌభాగ్యమును వెడలిపోఁగలదు. నన్ను నీవు ఘోర విపత్సాగరమునఁబడవైచి మధురకుఁబోవుచున్నావు. నేనిచ్చట నెవరి యాధారమున నుందును. ఎవరి ముఖమును గాంచి జీవింతును. ఎవరి ముఖమకరందమును ద్రావెదను? నీవు అబలనగు నన్ను నిస్సహాయముగ విడిచి పోవు నెడల నేనింటికిఁబోను. నేనొక వనమునుండి యింకొక వనమునకు నిట్లు తిరుగుచుందును. కృష్ణకృష్ణ యను నీ సుమధుర నామమును జపించుచుందును. ఈవిధముగ రాత్రింబవళ్లు నీ నామమును గాన మొనర్చుచుఁదిరుగుచుందును."

అయ్యో! నాకు నీమీఁద నెంతయో గర్వము. ప్రపంచములో నేను సర్వశ్రేష్ఠనని భావించుచున్నాను. నాగర్వమంతయును ఖర్వము కాఁగలదు. జీవన ధనమా! నీవును నన్ను వదలి సుఖమును బొందవు. నీ జీవితము సుఖముగ గడువదు. నీవే యాలోచింపుము. నీవు లేకున్న నాకు ఒక్కొక్క క్షణము ఒక్కొక్క కల్పముగఁ గడచును.

కన్నుల నీరును నించుచూ దీన ప్రియ యగు రాధను వడిలోఁ గూర్చుండఁబెట్టుకొని శ్యామసుందరుఁడిట్లనెను :-

"ప్రియా! నిన్ను వదలి పోవలయునని నాకెప్పుడుండును? కాని చేయున దేమున్నది? కర్తవ్యమతి కఠినముగ నుండును. కర్తవ్యమునకు వశీభూతుఁడనై నేను మధురకుఁ బోవలసి యున్నది. అక్రూరుఁడు నన్నుఁగొని పోవ వచ్చినాఁడు. భవితవ్య మిట్లున్నది. నీవు గోలోకవృత్తాంతమును స్మరించుకొనుము. సుదామ గోపకుఁడు మన కిద్దఱకును గొన్ని దినములు వియోగము సంభవించునని నీకు శాపమొసంగి నాఁడు. భవితవ్యము నెవఁడు తుడుపఁగలఁడు? ఏది లభించి నదో, ఏదో ఒక దినమున నది వదలి తీరవలయును. నీవు చింతింపకుము. సమయము లభించినపుడు మరల మనమిద్దర మును గలిసెదము. మరల మనమిద్దరమును నిట్టి లీలనే యొనర్చెదము." ఇట్లు పలికి భగవానుఁడు వృషభాను కిశోరిని గట్టిగాఁ గౌఁగిలించుకొనెను. రాఁబోవు విరహమును స్మరించియు, ప్రియసంగమ సుఖమున రాధాదేవి చేతనా శూన్యయయ్యెను. ఆమెకు శరీరస్మృతి లేదు. గోపకులు తప్పెట్లను వాయించుచు 'నేఁడెవరును పాలను గాచవలదు. తోడు పెట్టఁగూడదు. పెరుగును, పాలను, వెన్నను, నేతిని, వ్రజరాజునకడకు గొని తెండు. నేఁడు గోపకులందఱును మధు రాధిపతి యజ్ఞమునకుఁ బోయెదరను జాటింపు వేయుటను శ్యామసుందరుఁడు వినెను."

ఈ చాటింపు శబ్దమును విని యిప్పుడరుణోదయమైన దని తెలిసికొని, మెల్ల మెల్లఁగాఁ దన ప్రియురాలియొక్క శిరస్సును దన వడిలోనుండి తీసి చక్కని మెత్తని దిండుమీఁదనుంచి,

నికుంజమందలి అన్యసఖులకో నామెను జూచుచుండవలయు నని ఆదేశించి, ఆతఁడు దుఃఖిత మనస్సుతో నామె మూర్ఛిత దశలో నుండఁగనే వదలి వెడలిపోయెను.

సూతుఁడిట్లనెను :- "మునులారా! ప్రేమలీల చాల విచిత్రమైనది. దీనిలో నేడ్చుటయే ఉపహారము. ప్రేమ జీవిత మేడ్చుటలోనే గడచును. భగవానుఁడు వెడలిపోయిన మీఁదట రాధికాదేవి మూర్ఛ యెట్లు భంగమైనదియును, ఇతర గోపికలు శ్యామసుందరుని విరహమున నెట్లు ప్రలాపించినదియును, దాని నత్యంత కష్టముతో నత్యంత సంక్షేపమున ముందు వర్ణనమును గావించెదను.

## గోపికల భావి విరహ దుఃఖము

౧౦౨౫

శ్లో॥ గతిం సులలితాం చేష్టాం స్నిగ్ధహాసావలోకనమ్ ।
శోకాపహాని నర్మాణి ప్రోద్దామచరితాని చ ।
చింత యన్త్యో ముకుందస్య భీతా విరహ కాతరాః ।
సమేతాః సంఘ శః ప్రోచురశ్రుముఖ్యోఽచ్యుతాశయాః ॥

శ్రీ భాగ. ౧౦ స్కం. ౩౯ అ. ౧౩, ౧౪ శ్లో॥

మ॥ ఉవిదల్ సిగ్గులు మాని కనవల నీరొండంద వర్షింపఁగా
వివశత్వంబులతోఁ గపోలతట సం విన్యస్త హస్తోబ్జలై
పవనోద్ధూత లతాభలై మముఁగృపం బాటింపు గోవింద మా
ధవ దామోదర యంచు నేడ్చిరి సుజాతంబైన గీతంబులన్ ।

శ్రీ మదాంధ్ర భాగవతము

ఎవనితో ననేక సుఖద క్రీడలొనర్పఁబడినవో, ఆనందముతోఁ గాలము గడుపఁబడినదో, మధురాతి మధురములగు ప్రేమ ప్రసంగములను జేసికొనుచుఁ జలికాలమందలి పెద్ద పెద్ద రాత్రులందు మేల్కాని గడుపఁబడెనో అట్టివాని వియోగము కలిగినచోఁ జిత్తమున కెట్టి స్థితి కలుగునో దాని ననురాగముకలవాఁడు తప్ప యింకెవరు అనుభవ పూర్వకముగఁ దెలిసికొనఁగలరు? ముఖము నెంతగాఁ జూచినను దృప్తికాదు. హృదయ మతృప్తినిఁ జెందియే యుండును. అట్టివాని ముఖమును రేపు చూచుకొనుటకు వీలులేదు. ఇట్టి స్మృతి చిత్తమునకు రాఁగానే కలుగు విచిత్ర దశ నేమని వర్ణింతము. శరీరమంతయును శిథిలమగును. మనస్సు బాధను జెందును. తాతయగు వృద్ధ బ్రహ్మ యేమి ఆలోచించి యీ ప్రపంచము నిట్లు విరుద్ధాచరణము కలదానిఁగా సృజించినాఁడు. ఇందులోఁ బ్రియ సంయోగమునే కలిగింపరాదు. సంయోగ ముండుటయే ఆవశ్యకమగుచో వియోగ సృష్టినిఁ జేయకుండ వలసినది: ప్రియునియొక్క సంయోగ సుఖమును గాంచి, దానికి యోగమును గలిగించుట అమృత కలశమందు విషమును బోసినట్లుండును.

సూతుఁడిట్లనెను :- "మునులారా! శ్రీకృష్ణుఁడు రాధను మూర్ఛితావస్థలో వదలిపెట్టి పోయెను గదా! కొంత కాలమైన తరువాత నామెకు దెలివి వచ్చెను. అటు నిటుఁ జూడఁగాఁ బ్రాణనాథుఁడు కనఁబడలేదు. అప్పుడామె "హా ప్రాణనాథా! హా జీవన ధనమా!" అని పలిక

యేడ్వ నారంభించెను. రాధ యొక్క కరుణాక్రందనమును విని సఖులందఱును బరువిడి వచ్చిరి. నేఁడు సూర్యోదయము కాఁగానే రామకృష్ణులు మథురాపురికి వెళ్లఁగలరను సమాచారము క్షణములో గోకులమంతటను వ్యాపించెను. వారినిఁ గొనిపోవుటకు రాత్రియే అక్రూరుఁడు వచ్చియుండెనను సమాచారము తెలియఁగనే అందఱ హృదయములందును విరహాజన్యమగు గొప్ప ఆఘాతము తగిలెను వారీ సమాచారమును వినుటచేతనే వ్యాకులురైరి. అందఱకును సమాన మగు దుఃఖము కలిగెను. వారు శరీరమును మఱచి ప్రలాప మొనర్ప నారంభించిరి. వారి హృదయములకు రాఁబోవు విరహస్మృతిచే మిక్కిలి సంతాపము కలిగెను వారి సంతాపముయొక్క ఉష్ణత్వముచే వారి అంతఃకరణములు సంతప్తములగుటయే కాదు, వారి శ్వాసలును వేడి వేడిగ వెలువడుచుండెను. ఆ కారణమున వారి సుకోమల కమల ముఖము వాడిపోయెను. ఈ సమాచారము చేతనే వారచేతనులైరి. వారి శరీరమంతయును సీతవర్ణముగ నయ్యెను. కరకంకణములు జాఱిపోవునంతగ వారి శరీరము కృశమయ్యెను. ఉంగరములు వ్రేళ్లనుంచి జారుచుండెను. కట్టుకొనిన లంగాలు వదులయ్యెను. శిరమున నున్న మేలి ముసుఁగు జారిపోయెను. కేశపాశములు వదులై విడిపోయెను. తలలోఁ దుఱిమిన పుష్పమాలలు వాడి క్రింద రాలుచుండెను. వారు ప్రపంచమందలి సమస్త పదార్థములను మఱచిరి. వారి చిత్తవృత్తు లన్నియును జిత్తచోరుని చింతనమందే కేంద్రితములయ్యెను.

వారు భావ సమాధిలో నిమగ్నలైరి. సమాధిస్థ విముక్త పురుషులవలె వారికిఁ తమ శరీరము భానము లేకుండెను.

కొందఱకు విచిత్ర స్థితిగా నుండెను. వారికి భగవానుని మధురాతి మధుర లీలలు స్మరణమునకు వచ్చెను. ఆతని ప్రణయ కటాక్ష యుక్తమగు మధుర మధుర మంద హాసము వారి చిత్తములందు హత్తుకొనెను. ఆతని సరస పరిహాసయుక్తములగు మధుర వాక్యములు వారి స్మృతి పటలము మీఁదకువచ్చి ఒక విధమగు దీర్ఘ నిశ్శ్వాసమునుత్పన్న మొనర్చుచుండెను. ఆతని చిత్ర విచిత్ర పదావళీ యుక్తములగు వాక్యములను స్మరించి విమోహితలగుచుండిరి.

కొందఱు భగవానుని లీలా స్మరణమునఁ దన్మయలైరి. మదన మోహనుఁడేవిధముగ సులలిత రీతిచే విలాసముగ నడుచునదియును, ఏవిధముగ విచిత్ర కమనీయ కవిత క్రీడ లొనర్చునదియును, శోక సంతాపములను నాశన మొనర్చుచు నెట్టి సుఖద సరస కథానికములను జెప్పునదియును స్మరించుచుండిరి. ఈ విధముగ నందఱకును విచిత్ర స్థితిగా నుండెను. అందఱును శరీరస్మృతులను మఱచి పిచ్చివాండ్రవలె నిటు నటుఁ దిరుగుచుండిరి. అందఱును నేడ్చుచు, నఱచుచు, నక్రూరునిఁ దిట్టుచు నందనందనుని భవనమునకుఁ బోవుచుండిరి. నందభవన సమీపముననుండి ఆరబయట స్థలములో నందఱును గుమిగూడిరి. వారందఱ నేత్రములనుండి బొటబొటమని అశ్రువులు ప్రవహించుచుండెను. అందఱును

శరీరములను, మనస్సులను మఱచిరి. అందఱ వెండ్రుకలు విఱియఁబడి యుండెను. అందఱ శరీరములును ధూళి ధూసరితములయ్యెను. వారందఱును విలాప మొనర్చుచు నోటికి వచ్చినట్లు వాగుచుండిరి. వారి ప్రలాపములు అసంబద్ధములుగ నుండెను. ప్రలాపముల సంబద్ధములుగనే యుండును. వారు క్రమానుసారముగఁదమ మనోగత భావములను వంతుల వారిగా వర్ణన మొనర్చుచుండిరి. వానిలో నొకర్తుక యిట్లనెను :- "అయ్యో! శ్యామసుందరుఁడు నేఁడు వెడలిపోవును. ఆతఁడు లేకుండిన మేమేడ్వవలసినదే. తట తట కొట్టుకొందుము. దుఃఖితల మయ్యెదము. ఎంతటి అన్యాయము! ఎంతటి అత్యాచారము."

అంత నొక్క గోపిక యిట్లనెను :- "అక్కలారా! మన మెవరి ననవలయును? ఇది విధి విధానము. బ్రహ్మ యెవరి కెవరితో నెన్నిదినములు సంయోగమును వ్రాసి యుండెనో దాని కన్ని దినములే సంయోగము కలుగును. దానిలో నిసుమంతైనను దగ్గిపోదు. నువ్వు గింజంతైనను బెరుగదు. ఆతని మనకు వియోగమెప్పుడని వ్రాయఁబడినదో అప్పుడవశ్యము వియోగము కలుగును. బ్రహ్మ వ్రాసిన వ్రాలను దుడుపుట కెవరికిని శక్తి చాలదు. పుట్టుటకు ముందే బ్రహ్మ విద్యా, ఆయు, యశ, సుఖ, దుఃఖ, సంయోగ వియోగాదులను వ్రాయును."

అంత నొక్క గోపిక పండ్లు పటపట గొఱుకుచు నిట్లనెను :- "ఆహా! ఈముసలి బ్రహ్మకు దయలేదు గదా!

ఈతడు హృదయహీనుఁడగు వ్యక్తియా లేక యీతని హృద
యము పాషాణమా? ఈవిధాతకిట్టి వ్యర్థ విషయములను
వ్రాయుటచేతను, ఇట్టి నిరర్థక వ్యాపారముల నొనర్చుట
చేతను నేమి యానందము లభించును. విధాత ప్రాణులను
జేయజాలకుండినట్లు చేయకుండినచో నాతఁడు ప్రాణులను
హృదయహీనులుగ నొనర్చును. ఒకవేళ హృదయముల
తోడనే నిర్మించుచో దానిలోఁ బ్రేమ నిర్మాణము నొన
ర్పఁడు పరస్పరము కలిసికొని యెవరి త్రోవను వారు
పోవుదురు. ఎవ్వరికిని సంయోగ సుఖమునుండదు, వియోగ
దుఃఖము నుండదు. రాళ్లు బండలు నొక్కచోటునకుఁ జేరు
చుండును, మరల విడిపోవుచుండును. వానికి సంయోగ
వియోగమునకు సంబంధించిన సుఖదుఃఖములు లేవు.
ప్రాణుల హృదయములందు బ్రహ్మ హృదయమునే యొన
ర్చుచో, దానిలోఁ బ్రేమనుత్పన్నము కావించుచో, మిత్రతా
భావము నేర్పఱచుచో దానిలోఁ బూర్ణత్వము నుంచవల
యును. ఎవరికెవరి యందు బ్రేమ కలుగునో అప్రేమ తన
నుండి వేరుకానంతవఱకును, దానిలోఁదృప్తి కానంతవఱకును,
మనోరథము సిద్ధింపనంత వఱకును బ్రేమ యుండవలయును.
అతృప్త ప్రేమయందు వియోగ మత్యంత దుఃఖదమై
యుండును. మేమింతవఱకు శ్యామసుందరుని ముఖమును
విడమఱచి సరిగాఁ జూడనైనఁ జూడలేదు. మేమా మనో
హరమూర్తిని, ఆ శ్యామసుందరుని ముఖమును గన్నులారఁ
జూతమని దృష్టిని సారించిన నీ కన్నులు శత్రువులుకాఁగా

శ్యామసుందరుని ప్రియమైన మూర్తిని బాగుగఁజూడఁజాలక పోయితిమి. అయ్యో! ఇంకను శ్యామసుందరునితోఁ బూర్ణ పరిచయమైనను గలుగలేదు ఇంకను హృదయములోఁ బ్రేమయొక్క ఒక క్షీణ తంతువు అంటుకొనియున్నది. దానిని గూడ నిర్దయతతో నీ విధాత త్రెంచివేయుచున్నాఁడు. ఈతనికి వియోగమును గలిగించుటయే యుద్దేశ్యమగుచో సంయోగమును గలిగించు టెందులకు? లోకులందఱును బ్రహ్మ ముసలివాఁడు ముసలివాఁడందురు. బ్రహ్మ వృద్ధుఁడుకాఁడు, వట్టి పసివాఁడు, అబోధశిశువు, అజ్ఞాని బాలకుఁడని నేననుచున్నాను. ముందుగా బొమ్మలను జేయుటయును, వాని నొక్క చోటఁ గూర్చుండఁ బెట్టుటయును, వానికి పెండ్లిండ్లు చేయుటయును, జివరకు పగులఁగొట్టి పాఱవేయుటయును నిది పిల్ల చేష్టలు కాకున్న నేమి? ఇట్టి మూర్ఖతాపూర్ణములగు కార్యములను అబోధ బాలకులు తప్ప బుద్ధిమంతుఁడగు వ్యక్తి యెవఁడు చేయఁగలఁడు? కావున మేము బ్రహ్మయొక్క యీ కార్యమును మూర్ఖతాపూర్ణమగు కార్యమని తలఁచుచున్నాము. సఖులారా! ఒక్కసారి ఆలోచింపుఁడు. గుండ్రని బుగ్గలును, నల్లనల్లని అలినీలాలకములునుగల నా యనుపమాననమును, సిందూరమువంటి అరుణారుణోష్ఠములును, సుందరమగు నాశికతో శోభించుచు మంద మందస్మందహాస రుచులతోనుండు నా శ్యామసుందరుని, అనుపమాననమును జూపించి, మరల దానిని మాదృష్టినుండి తొలగించుట-కనఁబడకుండఁ జేయుట ఇది నిర్దయతా కార్యము

కాక అదేమి? క్రూరత్వమునకును హద్దు కలదు; నీచత్వము
నకు పరిధి కలదు. ఇట్టి జఘన్య వ్యాపారమును వజ్ర
హృదయుఁడును జేయఁజాలఁడు. ఇట్లు చేయుచున్న విధాత
మా కెచ్చటనైనను దొఱకినచో వాని తలను బగులఁగొట్టి
వేయి వ్రక్కలను జేసెదము. సఖులారా! మీ రెవ్వరైన
నావిధాతను గాంచితిరా?"

అంత నొక్క సఖియిట్లనెను :- "సఖులారా! ఈవిధాత
చాల రూపములతో నున్నాఁడు. వీఁ డెప్పుడేరూపమును
ధరింపవలయుననిన నారూపమును ధరించును. నేఁడా విధా
తయే అక్రూరరూపమును ధరించి వ్రజమునకు వచ్చినాఁడు.
ఈతఁడు తనమూఁడు ముఖములను దాచుకొని ఒక్కముఖ
ముతో వచ్చినాఁడు. హంస నెచ్చటనో దాచి రథముపై
వచ్చినాఁడు. కమండలువును దనలోకములో నెచ్చటనో
దాచి చేతిలో కొఱడాను ధరించి వచ్చినాఁడు. వీఁడతి
ధూర్తుఁడు. తన నామమును మార్చుకొని వచ్చి
నాఁడు. ఈతఁడు చేయునది క్రూరకృతి, పేరు అక్రూరుఁడని
పేరును బెట్టుకొని వచ్చినాఁడు. వాస్తవమున నీతఁడక్రూ
రుఁడు కాక క్రూరుఁడు. గ్రామ గోపికలమగు మనము
సౌందర్యధాముఁడును, మనోహరతామూర్తియునగు మాధ
వుని మన ప్రయత్నములద్వారానో యెట్లో ప్రాప్తించితిమి.
విధాతయే మనకీ యవకాశమును లభింపఁజేసినాఁడు. ఆతఁడే
మన నేత్రములను సార్థకము గావించినాఁడు. ఆతఁడే మన కిట్టి
అనుపమ దానము నొసఁగెను. దానమునొసఁగి మరల

నిప్పుడు దానిని లాగుకొనుటకు చూచుచున్నాఁడు. ఏ నంద నందనుని ఒక్కొక్క అంగముపైని కోటికోటి బ్రహ్మాండముల లోని సమస్త సౌందర్యము దిగదుడుపగునో, అట్టి సుందర మూర్తిని మాదృష్టుల కొసంగి, యిప్పుడీ దుష్టుఁడు దాని నపహరణ మొనర్చుచున్నాఁడు. ఈతనికి నృగుని దుర్దశ పట్టఁగలదు. ఈతఁడు తప్పక ఊసరవిల్లి కాఁగలఁడు. దానము నొసంగి దానిని లాగుకొనుటయును, బలవంతముగ నపహరించుటయును నిది మంచి కార్యమా? కావున నా యభిప్రాయమిది. మన మందఱమును బట్టుకొని యీ యక్రూరుని నేకాంతమునకుఁ గొనిపోయి దాచి యుంచి, యేయింటిలోనైనను బంధించి, బయటఁ దాళమును వేయ వలయును. అసలు వాసమే లేకున్న వేణు వెట్లు కాఁ గలదు. అక్రూరుఁడే లేకున్నచో శ్యామసుందరుఁ డెట్లు పోఁగలఁడు?"

అంత నొకకర్త యిట్లనెను :- "సఖులారా! ఇతరుల మీఁద దోషము వేయుట వ్యర్థము. మన బంగారము మంచిదైన కమసాలి ననవలసిన పనియే మున్నది? శ్యామ సుందరుఁడే పోఁగూడదనుకొనినచో, లక్షమంది అక్రూరులు వచ్చినను నాతఁడు పోనేపోఁడు. కాని శ్యామసుందరుఁడు స్వయ ముగఁ దానే పోవ నుద్యుక్తుఁడై యున్నాడు. అతఁడు పోవలయునను నానందములోనే అటు నిటు సంతోషమునఁ దిరుగుచున్నాఁడు. ఈతఁడింతవఱకును రచించిన ప్రేమ కపట ప్రేమ. ప్రేమ ప్రదర్శన మొనర్చినాఁడు. ఇదంతయును

గపట వ్యవహారము. మోసము. ఈతఁడు బహువల్లభుఁడు. ప్రేమించుట తెలియును గాని దానిని నిలుపుకొనుట తెలియదు. నేఁడు దీనినిఁ బ్రేమించును, రేపు దానినిఁ బ్రేమించును. తుమ్మెద ఒక పుష్పకోశమునుండి యింకో పుష్పకోశమునకుఁ దిరుగుచుండును. మధువునకై ఉత్కంఠతను జెంది యుండును. బహుశః ఒక పుష్పమునకంటె నింకొక పుష్పమందధిక రుచికరమగు రసముండవచ్చును. అధికమగు మాధుర్య ముండవచ్చును. శ్రీకృష్ణుని ప్రేమ క్షణికమైనది. ఒక్కక్షణము ప్రేమించును. మఱు క్షణముందే దానిగాజు ముక్కవలె ముక్కల ముక్కలొనర్చును. ఈతఁడు మిక్కిలి కృతఘ్నుఁడు. పరోపకారము వైపున కీతని దృష్టియే పోదు."

అంత నొక్క సఖి యిట్లనెను :- "సోదరీ! శ్యామసుందరునిఁ గృతఘ్నుఁడనెదవేల?"

తన మాటమీఁద నిలిచి ఆసఖి యిట్లనెను :- నేను శ్యామసుందరునిఁ గృతఘ్నుఁడందును. అవశ్యమందును. ఢంకామీఁద దెబ్బగొట్టి యనెదను. మనము మనయిండ్ల వాఁకిండ్లను వదలి ఆతని వెనువెంట నరణ్యములలో మనము తిరుగుటేలనో ఒక్కసారి ఆలోచింపుఁడు. మన మన బంధు బాంధవులను లక్ష్యపెట్టలేదు. ఎవరైన నేమైన ననుకొందురాయని మన మాలోచింపనే లేదు. ఇట్లేలఁ జేసితిమి? శ్యామసుందరుని ప్రేమకొఱకు మన స్వజనమును, పతి, పుత్ర, సోదర, బంధు సంబంధులనేల విడిచితిమి? ఈతని చరణ

కింకరులమగుటకు గాదా! ఈతఁడు మనలను జరణ కింకరులను గాఁజేసికొనఁగలఁడని మన కభిలాష యుండెడిది. తనకు దాసీలనుగాఁజేసికొను ననుకొంటిమి. మన మీతని కొఱకు అంతయును జేసితిమి. కాని నేఁడాతఁడు మనవైపునకుఁ గన్నెత్తియైనను జూడనంతటి నిర్కృష్టుఁడైనాఁడు. మనతో మాటలాడనైనను మాటలాడుటలేదు. మానస్వాముల వారైనాఁడు. ఇది కృతఘ్నత కాక మఱేమి కాఁగలదు?"

అంత నొక్కతె యిట్లనెను:- "సఖులారా! చెడ్డ రోజులు వచ్చినపుడు తనవారు పరాయివారగు చుందురు. మన సౌభాగ్య సూర్యుఁడస్తమించినట్లు తోఁచుచున్నది. గత రాత్రి వఱకు మనకు సుఖసౌభాగ్యము కలదు. నేఁటి రాత్రి మధురాపురీనివాసినులు, నాగరిక స్త్రీలకు సుఖప్రదముగ నుండును. నేఁడు వారికి ప్రాతఃకాలము శుభశకున యుక్తముగ నుండఁగలదు. నేఁడు మధురాపురి వాసులకు మంగళ దివసములగును. మధురాపుర నివాసినులగు స్త్రీల నేత్రములు నేఁడే సఫలములగును వారికి కన్నులున్నందులకు యథార్థమగు ఫలము నేఁడే కలుగును. శ్యామసుందరుఁడు నగరమునఁ బ్రవేశింపఁగనే లజ్జావతులును, కులవతులును, సుకుమారలునగు లలనలు తమ మేడలపైకి, మిద్దెలపైకి నెక్కి తమ కౌతుక కన్నులతోఁ గ్రీగంటి చూపులతోఁ, వాలిమునుఁ గుత చాటునుండి చూచిన మోహనుని మధుర మందహాసమయ ముఖమును మోదమాధురీ మధుకరములవలె పాన మొనర్చెదరు. శ్యామసుందరుఁడు వారి సులలితమనోహర విందముల

నవలోకించినప్పుడు వారు ప్రణయ జలమందు మునిఁగిపోవు దురు. పల్లెటూరి గోపగోపికలమగు మనలను శాశ్వతముగ మఱచిపోఁగలఁడు. నంద గ్రామమువైపు పాదములను బెట్టి యైనను బరుండఁడు."

అంత నొకర్తుక యిట్లనెను :- "సఖీ! ఇట్టి మాటలను నోటినుండి యేల వెలువడఁ జేసెదవు? నగరమందలి సుకు మార లజ్జావతులగు సుందరీమణులముందు పల్లెటూరు తెలియని స్త్రీలమగు మనము దేనికిని బనికి రామనుట నిజమే. అతఁడచ్చటికిఁబోయిన తరువాత మనమేల జ్ఞాపక ముందుము. అయినను శ్రీకృష్ణుఁడు గొప్ప మనస్వి. తల్లిదండ్రులందు మిక్కిలి భక్తికలవాఁడు. మన కొఱకయి కాకపోయినను ఆతని తల్లిదండ్రులను జూచుటకైనను రాఁ గలఁడు. ఆసమయమున మనము దూరమునుండి ఆతని దర్శనమును జేసెదము."

అంతనొక్కతె యిట్లనెను :- "సఖీ! నీవమాయకు రాలవు సౌందర్యమున నెంతటి యాకర్షణ మున్నదో రూపమున నెంత మాదకత యున్నదో నీకు తెలియదు. కృష్ణుఁడెంతటి మాతాపితృ భక్తుఁడైన నగుఁగాక! అతఁ డెచ్చటనైనఁ దెల్లతెల్లఁగా గుండ్రముగా నుండిన బుగ్గలు కల సుకుమార స్త్రీలను గాంచినచో నాతఁడు వారికి వశుఁడై తల్లిదండ్రులను, స్వజనులను, సఖులను ఇంక నందజను మఱచి పోవును. వారి ప్రేమలో నెంతో ఆసక్తినిఁజెంది మరల

వ్రజమునకు వచ్చుట అత్యంత హేయముగ భావించును. అతఁడు పోరబాటుననైనను వ్రజమును గూర్చిన చర్చ నొనర్పఁడు."

అంతనొక యన్య సఖి యిట్లనెను :- "సఖులారా! మన సౌభాగ్యము వదలిపోయినది. మన మితరు లననవలసిన పని యేమున్నది? నేఁడే మార్గమున రథముపై నెక్కి శ్యామసుందరుఁడు పోవునో ఆ మార్గమందలి స్త్రీ పురుషులు కృతార్థులగుదురు, ధన్యులగుదురు. సమస్త గుణాగారము, లక్ష్మీరమణుఁడునగు నందనందనుని రథముపై నుండఁగా నెవరు చూచెదరో వారు ధన్యులగుదురు. మథురాపురియును గృతార్థమగును. దానిలో నివసించు దాశార్హ, అంధక, భోజ, కుక్కుర, మధు, వృష్ణివంశీయులగు యాదవులును, ఇతర వర్ణములవారును నాతనిఁగాంచి పరమానందమును జెంది ప్రదక్షిణ మొనర్చెదరు. ఆతనికి స్వాగత సత్కారము లొనర్చెదరు."

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఈవిధముగ ననేక మనోరథముల నొనర్చుచు, అనేక విధములగు ననుమానములను జెందుచు గోపికలు బిగ్గఱగా నేడ్వనారంభించిరి.

# విరహాతురలగు వ్రజాంగనలు

౧౦-౨౬

శ్లో॥ ఏవం బ్రువాణా విరహాతురా భృశమ్
వ్రజస్త్రియః కృష్ణ విషక్త మానసాః।
విసృజ్య లజ్జాం రురుదుః స్మ సుస్వరమ్
గోవింద దామోదర మాధవేతి॥

శ్రీభాగ. ౧౦ స్కం. ౩౯ అ. ౩౧ శ్లో॥

మ॥ ఉవిదల్ సిగులు మాని కన్నవల నీరొండొంట వర్షింపఁగా
వివశత్వంబులతోఁ గపోల తట సంవిన్యస్త హస్తాబ్జలై
పవనోద్ధూతలతాభలై మముఁ గృపం బాటింపు గోవింద మా
ధవ దామోదర యంచు నేడ్చిరి సుజాతంబైన గీతంబులన్॥

శ్రీమదాంధ్ర భాగవతము

అత్యంత శోకమునందును, అత్యంత హర్షోల్లాసమందును అత్యంత మాంగళిక కార్యములందును నంతగా లోకలజ్జయుండదు. అచ్చట మహిళలు తమ నారీసులభలజ్జను బరిత్యాగ మొనర్చెదరు. ఈయన్నింటియందును, అత్యంత శోకమందును శరీరస్పృహ యుండదు. ఒక్కొక్కప్పుడు హద్దులను దాటుటయును జరుగుచుండును. శోకమందేమి పలకవచ్చునో, ఏమి పల్కరాదో గుర్తుండదు. ఆవేగములోనికివచ్చి నోటికివచ్చిన దానిని బలుకుచుందురు.

సూతుఁడిట్లనెను :- "మునులారా! భగవంతుఁడు వెడలిపోవునను సమాచారముచే గోపికలత్యంత వికలలైరి. వారి కందఱికంటె నక్రూరునిపైఁ గ్రోధము వచ్చెను.

అందులో నొకర్తుక అక్రూరుని లక్ష్యమందుంచుకొని యిట్లు పలుక నారంభించెను :- "ఈయక్రూరుఁడు క్రూరుఁడే కాఁడు. మిక్కిలి గర్వపోతు. శ్యామసుందరుని మీఁద మనకు గొంత అభిమానము కలదు. ఆతనికిని మనమీఁదఁ గొంత కలదు. ఈయక్రూరుఁడాతనిఁ గొనిపోవఁదలఁచిన ముందుగా నాతఁడు మనకడకు రావలసియుండెను. మనకు నచ్చఁజెప్పవలసి యుండవలసినది. మనల నిట్లడుగ వలసినది :- "మేము శ్యామసుందరునిఁ గొన్ని దినములవఱకు మధురానగరమునకుఁ దీసికొనిపోయెదము. మీరు భయపడకుఁడు. చింతింపకుఁడు. ఆతఁడు త్వరలోనే తిరిగి రాఁగలఁడు" ఈవిధముగ మనల నడిగి, మనలనోదార్చి, నచ్చఁజెప్పి యుండవలసినది. ఈతఁడట్టి పని నేదియును జేసియుండలేదు. దుఃఖితలమును, అబలలమునగు మనకు ధైర్యము చెప్పకయే తీసికొనిపోవుచున్నాఁడు. మన ప్రాణములకంటె నధిక ప్రియుడును, యశోదాదేవికి కంటిపాపయును వ్రజజీవన ధనమగు శ్రీకృష్ణుని మనదృష్టిపథమునుండి వేఱు చేయుచున్నాఁడు. ఈక్రూరుని అక్రూరుఁడని యెట్లనవలయును ?"

ఒకర్తుక యిట్లనెను :- "ఆశ్చర్య విషయమేమనఁగా దీనికి ప్రతివాదమును నెవరును జరుపుటలేదు. ఇంతేకాదు. అందఱును నిటునుండి అటకు మిక్కిలి యుత్సాహముతోఁ దిరుగుచున్నారు. కొందఱు బండ్లను గట్టుచున్నారు. కొందఱు ఎద్దులను దెచ్చుచున్నారు. కొందఱు శకటములలోఁ బాలు, పెరుగు, నేయి, నవనీతాదులను నింపు

చున్నారు. యువకులగు గోపకులెంతో తొందఱపడు చున్నారు. వారికి పెండ్లికి వెడలుచున్నట్లుండెను. మన వైపునకెవరును జూచుటయే లేదు. కొందఱిట్లనుచున్నారు. ఈఆడవాండ్రెట్లేడ్చుచున్నారో చూడుఁడు? వృద్ధగోపకులు అవహేళనా స్వరమునఁ దమ బోసినోటినిఁ గదలించుచు నిట్లనుచున్నారు :- "ఓరీ! మీరేమి చూచుచున్నారు? ఈ ఆడువాండ్రకేడ్చి ముఖము కడుగుకొనుటయే పని. వీరు ముక్కలపైనశ్రువులను రాల్చుచున్నారు. వీరికి తెలిసిన దేడ్చుటయే. అప్పుడొక యాఁడుది యిట్లనెను :- "ఆడు వాండ్ర కేడ్చుట తెలియును. మీకేమి తెలియును? మీ కెవరి హృదయమునైనఁ గష్టపెట్టుట తెలియును, ఎవరిమూర్తులనైనను దీసికొనిపోవుట తెలియును. మీకు ముసలితనమువలన హృదయమును శుష్కించినది, నేత్ర జలములును నెండిపోయినవి. అందువలననే అట్టి ఉదాసీన వాక్యములను బలుకుచున్నారు."

అంత నింకొకర్తుక యిట్లనెను :- "సఖులారా! మీరి తరుల వైపునకుఁ జూడవలదు. ఈగోపకులలో నెవరును శ్యామసుందరుని నివారింపఁ జాలరు. పైఁగా వీరాతనికి మధురకు వెడల్టుటకు బ్రోత్సహించుచున్నారు. ఇతరుల మీఁద నాధారపడవల్లదు. స్వయముగఁబోయి శ్యామ సుందరు నాపవలెను. ఇప్పుడాతఁడు వెడలుటకు సిద్ధపడియే యున్నాఁడు శ్యామసుందరుఁడును రథముమీఁదఁ గూర్చుండి నాఁడు. అయ్యో! దేవుఁడీతని కనుకూలముగా నున్నాఁడు

మాకు ప్రతికూలముగనున్నాఁడు. కాకున్న నక్రూరు నేదైన సర్పమువచ్చి కాటువేయకుండునా ? ఈ గుఱ్ఱములమీఁద పిడుగుపడదా ? ఇంకనేదో విధముగ నీ ప్రయాణములో విఘ్నము కలుగవలయును. ఇప్పుడు కొంచెమైనను విఘ్నము కనఁబడుట లేదు. కావున మనమే విఘ్నము నొనర్చెదము. గుఱ్ఱముల పగ్గములను బట్టుకొని రథముపోవు మార్గమున నందఱమును బరుండెదము. అక్రూరునిఁబట్టుకొని యెచ్చటనైనను బంధించెదము. శ్యామసుందరుని బలాత్కారముగ దింపి వేయుదము."

అంతనింకొకతె యిట్లనెను :- స్త్రీలమగు మనమట్లు చేయుట శోభింపదు. చూడుడు. అదిగో మన కులమునకు వృద్ధుఁడైన పెద్దమామగారు నిలుచున్నాఁడు చూడుఁడు. ఆతఁడేమనునో?"

అంత నామె విసుగుతో మండిపడి యిట్లనెను:- "పెద్ద మామ యేమనును బండ? అనునదేమో అననిమ్ము. అని ఆతఁడు మనలనేమి చేయఁగలఁడు. చచ్చును, ఏమియును జేయఁజాలఁడు. ప్రాణములువిసిగిన లోకలజ్జనేమి పాటించును? సఖులారా! మీరే స్వయముగ నాలోచింపుడు. ఏనందనందను నొక్క అర్థక్షణమైనను మనము విడువఁజాలకుంటిమో అతని నక్రూరుఁడు మనలనుండి బలవంతముగఁ గొనిపోవుచున్నాఁడు. దుర్దైవవశమున మనకును మాధవునకును వియోగము కలుగుచున్నది. ఆమూలమున మనమత్యంత వ్యాకులమును

జెందియున్నాము. అయ్యో! మనమింక నెట్లు కాలమును గడి పెదము. మనకు కాలక్షేపమెట్లు జరుగును.”

అంత నొకతె కన్నులనీరునించుచు నేడ్చుచునిట్లనెను:— “సఖులారా! మనహృదయము లిందువలననే బద్ధలగుచున్నవి. అంతఃకరణమునందు దీని నాలోచించుటచేతనే మెలివేయుచున్నట్లుండెను. ఇంతవఱకే మదనమోహానుని మధురముకంటె మధురమైనదియును, మదిరకంటె మాదకమైనదియును మనోహర మందహాసయుక్తమగు ముఖముతో సుమధుర ప్రేమపూర్ణవాక్యములను నిరంతరము వినియుంటమో, అవి యిప్పుడు వినుటకు లభింపవు. తన భ్రుకుటిరూపమగు ధనుస్సునెక్కుడి లీలామయ కటాక్షబాణములను మాపైన విసరఁగా, ఆబాణములు తగులుటచే హృదయములోనొక మధురమైన వేదనలభించినది. అవిఇఁకమనకు లభింపక మధురాపురీ స్త్రీలకు లభించును. తన విశాలబాహువులతో మనలను లాగుకొని తన హృదయముతోఁ గౌఁగిలించుకొనెడువాఁడు. ఆకారణమున మనకు రోమాంచము కలిగెడిది. ప్రపంచమున జన్మించినందులకు సార్థకమైనదని భావించితిమి. అచ్యుతుని ఆలింగమునకంటె ప్రపంచములో నింకొక సుఖము లేదు. దానికిమించి ఆనంద ప్రదానమొనర్చు వస్తువు ఇంకొకటిలేదు. అయ్యో! మేమా సుఖమునకు వంచితుల మగుదుము. ఇఁకనాశ్యామసుందరుని సుఖద ఆలింగనము ఇంకమాకు లభింపదు. అయ్యో! ఎవరితో నెగతాళి ఆడుచు రాసవిలాసము లొనర్చుచు శరదృతువుయొక్క గొప్పగొప్ప రాత్రు

లను ఒక్కొక్కక్షణమువలె గడిపితివి. అట్టివాఁడు లేక యీ నీరస, శూన్యమగు దీర్ఘరాత్రులను నొంటరిగా మేల్కొని నిట్టూర్పులు విడుచుచు నాతని విషయవిరహవ్యథలో నెట్లు గడిపెదము. ఈవిపత్తుయొక్క యిట్టివిషమ విరహ వారిధి నెట్లు దాటుదము. ఇట్లు చెప్పుచుండఁగా నాసఖికి కంఠము గద్గదికముకాఁగా నామె యింకేమియును మాట లాడఁజాలక పోయెను.

అంత నింకొక గోపిక యిట్లనెను:- "సఖులారా! నా మనస్సులో మదనమోహనుని మనోహరమూర్తి నిలిచినది. నేను దినమంతయును దానినే చింతించుచుందును. మఱియు సాయంకాల సమయమున గోధూళికా వేళయందు ఆతని బ్రత్యక్షము కావించుకొని నా ధ్యానము సజీవమైనదని గుర్తించి చూచుకొందును"

అంత నింకొక సఖి యిట్లనెను:- "సోదరీ! ఆ శ్యామ సుందరుని యేసమయమునయున్న మూర్తి బాగుండును. ఏ సమయమున ధ్యానమది?"

ఆ సఖియే యిట్లనెను:- "ఇది గోధూళివేళయొక్క ధ్యానము. సాయంకాల సమయమున లక్షలకొలఁది గోవుల వెనుక వేణువు నూదుచు, వాని గిట్టలనుండి లేచిన ధూళిచే ధూసరితమైన నాతని నల్లనల్లని అలకావళులను మాటిమాటి కని సంభాళించుకొనుచు, వన్యపుష్పమాలలచే నలంకరింపఁ బడ్డిన-అనేక గోపబాలుర తోడను, సఖులతోడను ఒరివే

ష్టింపఁబడి, తన మధుర మందహాసము, కమనీయ కటాక్షము లచే యుక్తమగు వైఖరితో నందఱ చిత్తములను హరించుచు, విషభరిత కటాక్ష బాణములచే నందఱ హృదయములను ఛేదించుచు వనమునుండి వ్రజమునకు వచ్చుచున్నప్పుడు అందఱకును నవజీవితము ప్రాప్తించెడిది. నా మనస్సులో నా మూర్తియే నాటుకొనినది. నేను నిరంతరమా మూర్తి ధ్యానమునే చేయుచుందును. అయ్యో! నేఁటినుండి అట్టి మూర్తి ఇంకఁ గనఁబడదు కదా! ఇప్పుడు గోధూళికావేళ యందు ఎవని ముఖమునుగాంచి జీవములను నిలుపుకొందుము. ఎవని ప్రియాతిప్రియములను బలుకుదును.

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఈ విధముగ గోపికలు వివిధ విధముల విలాపములొనర్ప సాగిరి. వారరుణోదయమునకుఁ బూర్వమే గుమిగూడి యేడ్వఁదొడం గిరి. వారేడ్చుచుండఁగనే సూర్యోదయమయ్యెను. అప్ప టికి అక్రూరుఁడు నిత్యకర్మలొనర్చుకొని యమునలో స్నాన మును సంధ్యావందనమును జేసికొని అచ్చటికి వచ్చెను. యశోదమ్మ ఏడ్చుచు నేడ్చుచ నక్రూరునకును, రామకృష్ణు లకును జలిది యన్నములను బెట్టెను. భోజనముచేసి వస్త్ర ములను ధరించి, అక్రూరుఁడు ముందుపోఁగా రామకృష్ణులు పీత, నీలవస్త్రములను ధరించి పోవుచుండిరి. వారి వెనుక యేడ్చుచుండిన యశోదమ్మయును, రోహిణియు నుండిరి. చాల మంది వృద్ధ గోపికలు పైఁటలతో ముఖమును గప్పుకొని యేడ్చుచుఁ బోవుచుండిరి. అక్రూరుఁడు వచ్చిన గుఱ్ఱముల

పగ్గములను బట్టుకొనెను. ఆతఁడు ముందుగా రథముపైఁ గూర్చుండెను. తర్వాత బలరాముఁడు రథముపై కెక్కెను. చివరకు శ్యామసుందరుఁడు క్రిందనుండి రథముపై కెక్కఁగా నలువైపులనుండియును హాహాకారములు చెలరేగెను. "హా గోవిందా! హా! శ్యామసుందరా! ఎచ్చటికిఁబోవుచున్నావు? ఎచ్చటికిఁబోవుచున్నావు? అనుచు రథమునకు నలువైపులను గోపికలు క్రమ్మిరి ఆ గోపికలు రథము చుట్టును వెంద్రుకలు విఱియఁబోసికొని యేడ్చుచు తిరుగుచుండెను. నేఁడామె కేమియును దోచుటలేదు. ఎదుటఁ గూర్చుండిన శ్యామసుందరుఁడామెకుఁ గనఁబడుటలేదు. ఆమె యేడ్చుచుండెను. అఱచుచుండెను. 'మా శ్యామసుందరుని మథురకు బోవకుండ నెవరైన నాపుఁడు. ఇంత గొప్ప వ్రజమందెవరికిని దయలేదా? ఎవరి హృదయమును గరుగుటలేదే! నాచిన్న పిల్లలతో నా ధనుర్యాగమున నేమి పని యున్నది. మాపిల్లల వెంటఁ గంసుఁడేలఁ బడినాఁడు. కంసుఁడు మా ఆవులనన్నిటినిఁ గొనిపోవచ్చును. మా ధనము నంతను దీసికొనిపోవచ్చును. మా పిల్లలను వదిలినఁజాలును. నా గారాబు పిల్లల ముఖములను మరల నెప్పుడు చూడఁగలను? నేనెప్పుడు నాచేతులతో వడ్డించి అన్నముపెట్టఁగలను. అయ్యో! నాపిల్లలు ఆఁకలికి ఆగలేరు. ఇంత పెద్దవారైనను ప్రాతఃకాలమున నేడ్చుచు నన్ను నవనీతము నడుగుచుందురు. అచ్చట తెల్లవారఁగనే వీరికి వెన్నపెట్టు వారెవరు? ఇతరులకడ నాపిల్లలు సిగ్గుపడెదరు. ఆఁకలి

కారణమున వీరి ముఖములు వాడిపోఁగలవు. అయినను వారెవరిని వెన్న నడుగరు. మధుర గొప్ప పురియని విను చున్నాను. అచ్చట వెన్న యెచ్చట లభించును. అచ్చట గోవు లెచ్చటఁ దిరుగును. మా పిల్లలకు వెన్న చాల యిష్టము. నేను వారివెంట మూఁట కట్టితిని. కాని పురుషుల హృదయము పురుషుల దే. నేను వెంటఁబోయినచో వేళ కన్నము పెట్టుదును. అయ్యో! నన్నెవరైన వెంటఁ గొనిపొండు. అక్రూరా! నన్నుఁగూడ రథమున గూర్చుండఁ బెట్టవేల? ఒంటరిగా నేనిచ్చట ఏమి చేయుదును? పగలంత యును గూర్చుండి ఈఁగలను దోలుకొన వలసిన దే. రామ కృష్ణులకు వంట చేయవలయును. పాలుతోడు వేయ వలెను. చల్ల చేయవలెను. ఇట్లు వీనితోఁ గాలమేల గడుచును. ఏమియును దెలియదు. ఇన్ని రోజులూరక కూర్చుండి యెట్లు కాలమును గడుపఁగలను. ఎవరిముఖ మును జూచి పోవుదును? అయ్యో దుఃఖములలో నాదు కొనువారెవరు నుండరు."

సూతుఁడిట్లనెను :- "మునులారా! యశోద ఇట్లు ప్రలాప మొనర్చుచుఁ బరువిడుటచే నలసి నేలమీఁదపడి మూర్ఛిత యయ్యెను.

# రామకృష్ణుల మథురాగమనము

౧౨౭

శ్లో॥ స్త్రీణామేవం రుదంతీనా ముదితే సవితర్యథ।
అక్రూరశ్చోదయామాస కృతమైత్రాదికో రథమ్॥

శ్రీ భాగ ౧౦ స్కం ౩౯ అ. ౩౨ శ్లో।

వ. అంత మఱునాడు సూర్యోదయకాలంబునం గృష్ణుఁడు దన తోడఁ బయనంబునకు గమకించి నడుచు గోపికలను మరలి వత్తునని దూతికాముఖంబున వివరించి శకటంబులందుఁ గానికలు గోరసంబు నిడికొని నందాదులయిన గోపకులు వెనతగులు నక్రూర చోదితంబయిన రథంబెక్కి మథురాభిముఖుండై చను సమయంబున"

శ్రీ మదాంధ్ర భాగవతము.

'తన ప్రియుఁడు రేపు వెడలి పోఁగలఁడను నీ భావముదయింపఁగనే యీ సమాచారమును వినఁగానే చిత్తము వికలమగును. ధైర్యము నశించును. అధీరత్వము వృద్ధిఁ బొందును. మనస్సునకు విచిత్రదశ కలుగును. ఏమియును దోచదు. హృదయము బ్రద్దలైనట్లుండును. జగత్తు శూన్యముగ గోచరించును. తినవలయునని యుండదు. నిద్రపోవలయునని యుండదు ఇది భవిష్యద్విరహాదశ. ప్రియుఁడు నేఁడు కన్నుల యెదుటనుండి, రేపు లేకున్నచో నా భావమున కిట్టి దశకలుగును. భవిష్యద్విరహమునకే యిట్టి యధీరత్వము, వికలత్వమున్నయెడల వర్తమాన విరహమందు విరహిణుల

కెట్టి స్థితి యుండునో దానినిఁ జెప్పుటకును, వినుటకును వీలులేదు. అది అనుభవవిషయము. భావీవిరహమందు ఆశయుండును. ఏదైన విఘ్నము కలిగినచో యాత్ర ఆగిపో వచ్చును. భూతకాల విరహమునఁ గొంత ధైర్యమును వహించియుండ వచ్చును. ఓర్చుకొనఁగా సహనశక్తి పెరుగును. కాని వర్తమాన విరహము చాల దుఃఖదమైనది. దానిని సహించుట శూరవీరుల కార్యము మన జీవనమునకు జీవనమైనవాఁడును, ప్రాణములకుఁ బ్రాణమైనవాఁడు నేఁడు మనము దుఃఖించుచుండ వీఁడి వజ్రహృదయుఁడై-మన నేత్ర సమ్ముఖముననే పోవుచున్నాఁడు. అట్టి సమయమున మనస్సున కెట్టి స్థితి కలుగునో దాని ననుభవించినవారికిగాని తెలియదు. దాని నెవరైన నూహించి వర్ణన మొనర్పఁబూనినచో నది అసత్యమే యగును. మిథ్యాచారమే కాఁగలదు. ఆతని మాటలు ప్రామాణికముగ నెన్నఁబడవు.

సూతుఁడిట్లనెను:- "మునులారా! విరహవ్యథచే వ్యథితులైన వ్రజాంగనలు విలాపమొనర్చుచుండ నింతలోఁ బ్రాతఃకాలమయ్యెను. భగవానుఁడగు భువనభాస్కరుఁడు ఆతని దుఃఖకారణమున దుఃఖితుఁడయ్యెను. ఆతఁడు ప్రాచీ దిశాంచలమున ముఖమును గప్పుకొని అధికముగ నిద్రింపఁ జాలక పోయెను రోదనముయొక్క కరుణాక్రందన ధ్వనిని విని యాతఁడు ప్రాచీదిశయొక్క అరుణాంచలమును దీసి తన ముఖమును బయటకుఁ బెట్టెను. దినకరుని ముఖము బయటకు రాఁగానే సర్వత్ర ప్రకాశము వ్యాపించెను.

ఇప్పుడు రథముపైఁ గూర్చుండిన రామశ్యాముల మధుర ముఖములు స్పష్టముగ గోచరించుచుండెను. నేఁడు శ్యాముని ముఖముమీఁద స్వాభావిక మందహాసములేదు విశాల కమల దళములవలె నుండిన నాతని వికసిత నేత్రములు నేఁడు చంచలములుగ లేవు. అవి శాంతముగ నుండెను. గోపికలు గోపీజనవల్లభుని ముఖముమీఁద నిట్టి గంభీరతను నేఁటివఱ కెన్నఁడును జూడనేలేదు. దీనివలన వారి హృదయములు బ్రద్దలగు చున్నట్లుండెను. అయ్యో! నేఁడే కృష్ణుఁడు మారిపోయినాఁడే. ఆతఁడు పోఁదలఁచిఁ బోవచ్చును. ఆతఁడు నవ్వని కారణమేమి? మనవైపున కనురాగభరిత దృష్టులతోఁ జూడఁడేల? పోవునపుడు మనతో రెండు మధుర వాక్యములను బలుకరాదా?

ఆ సమయమున దృశ్యము మిక్కిలి కరుణాజనకముగ నుండెను. నందభవనమునకుఁ గొంచెము దూరమున విశాలమగు నాల్గు బజారులు కలిసిన కూడలి కలదు. అచ్చట మధురకుఁబోవు మార్గమున నక్రూరుని రథము నిలిచి యుండెను. మిగిలిన మూఁడుమార్గములందు పెరుగు, పాలు, నేయి, వెన్న నింపిన బానలతో నింపిన శకటములు కలవు వానికి పెద్ద పెద్ద యెద్దులు కట్టఁబడెను. వాని శృంగములకు పంచరంగుల దుప్పటి చుట్టఁబడి యుండెను. కంఠమున మువ్వలును, వాని వీపుమీఁద రంగుల రంగుల గవిసెనలు కప్పఁబడి యుండెను. గోపకులు తలపాగాలను, చొక్కాలను, దుప్పట్లను ధరించి, మధురకుబోవుటకె యుత్సహించుచుండిరి.

వారు మాటిమాటికి యిట్లనుచుండిరి:- "ఇంక నాలస్యమేమి రథమును బోనీయరేల? ముందు రథముపోయిన దాని వెనుకనే బండ్లన్నియును రాఁగలవు." ఒకానొకఁడిట్లనెను:-"పోనిమ్ము పోనిమ్మనుచున్నావు. నందబాబా వారి బండి యింకను గట్టనేలేదు. పోవుటెట్లు? రథము వెనువెంట బాబాగారి బండి బయలుదేరును. ఇంతలోనే నందుఁడును జరీతలపాగను జుట్టుకొని చేతిలో వెండిబెత్తమును ధరించివచ్చి యిట్లనెను:- "బండ్లనన్నిటిని లెక్కింపుఁడు వృషభానుని పెద్దబండి యింత వఱకు రానేరాలేదు. ఆతనినిగూడ బిలువుఁడు, బండ్లన్నియును గలిసిపోఁగలవు ఎద్దులను బరువెత్తింపవలదు." అదివిని కొందఱు గోపకులు వృషభానుని బండ్లను దెచ్చుటకుఁ బరువిడిరి. నందుని బండికి కట్టఁబడిన నెద్దులకు వివిధవర్ణములుగల గవిసెనలు వేయఁబడినవి. మువ్వలును బెద్దపెద్దగంటలును గట్టఁబడినవి. గణగణశబ్ద మొనర్చుచు నది రథము వెనుక నిలిచినది. దానికి సింహముపిల్లలవలె రెండెద్దులు కట్టఁబడినవి. దాని నొక యువకగోపకుఁడు వంకరగ బొట్టుపెట్టుకొని, క్రుచ్చు వ్రేలాడు తలపాగను జుట్టుకొని తోలుచుండెను. దానికిఁ బ్రదక్షిణమొనర్చి నందుఁడు దానిపైఁగూర్చుండుటను గోపికలు గాంచిరి. ఇప్పుడు గోపికలధైర్యము సడలిపోయెను. గుంపులు గుంపులుగావచ్చి రథముముందు నిలుచుండి మూఁడువైపులను వారు రథమును జుట్టుముట్టిరి. ముసుఁగులనుదీసి మదన మోహనుని ముఖకమలమును గాంచుచు బిగ్గఱగా నోరెత్తి యేడ్వనారంభించిరి. శ్యామసుందరుఁడు పోవునపుడు మనతో

రెండు మాటలను మాటలాడినఁజాలు ననుకొనుచుండిరి. తమ నోదార్చి, మరలఁదానెప్పుడు వచ్చునో నిజమును జెప్పినఁజాలు ననుకొనుచుండిరి. కాని శ్యామసుందరుని ముఖమునేఁడు వాడి యున్నది. ఆతఁడపరాధివలె భయభీతుఁడైనట్లుండెను. గోపికల చూపులలోఁ జూపులు కలుపుట కాతనికి సాహసము లేకుండెను. గోపికలక్రూరునిఁ బట్టుకొని యిట్లనిరి :- "అక్రూరా నీవు మా ప్రాణములను గొనిపోవుచున్నావు. నీవు మమ్ములను మీ వెంటనైనను గొనిపొమ్ము లేదా మామీఁదుగా రథమును బోనీయుము.

అక్రూరుఁడిట్లనెను :- "అమ్మలారా ! మీరింతగా నధీరులై తిరేల ? శ్యామసుందరుఁడుత్సవమును జూడఁబోవుచున్నాఁడు."

గోపిక లిట్లనిరి :- "నీవు నీమనస్సునకు వచ్చిన మాటలను మాటలాడుచున్నావా ? లేక శ్యామసుందరుఁడు చెప్పిన మాటలను జెప్పుచున్నావా ?

అక్రూరుఁడు సంకోచపడుటనుగాంచి శ్యామసుందరుఁడే అక్రూరునిచే "నేను మరలఁదిరిగి వచ్చెద"నని చెప్పించెను.

గోపికలు కోపముతో నిట్లనిరి :- "తిరిగి యెప్పుడు వచ్చెదవో మాకా సమయమును జెప్పవలయును."

భగవానుఁడక్రూరునిద్వారా మెల్లఁగా నిట్లు చెప్పించెను :- "త్వరగానే తిరిగి వచ్చెదను. ఈ యేడు దినములలో

